శ్రీరస్తు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

పసగాడసన్న్యాసిచే రచియింపఁబడిన

# శతకంఠరామాయణము.

ఈ గ్రంథము,

గ్రంథకర్తకుమారులవలన

అధికారముపొందిన, 22-

విశాఖపట్టణములో

పుస్తకవ్యాపారస్తులగు

## కలగర్ల-సరయ్యాగారివలన

చెన్నపురి,

పెసల-నమ్మాళ్వారుశెట్టిగారి

## శ్రీరామవిలాసముద్రాక్షరశాలయందు

ముద్రించిప్రచురింపబడియె.

( మొదటికూర్పు. )

వెల- 8 అణాలు- పోస్టేజి 1 అణా.

1899.

*Registered- CopyRight.*

శుభమస్తు.

అవిఘ్నమస్తు.

# శతకంఠరామాయణము.



శ్రీమహాదేవుండుజగదేకవీరుండు। గణనాయకునితండ్రిగరళకంధరుడు॥ ఐదుమోములసామిఅమరేంద్రవందితుడు। పాపసంహారుండుపరమేశ్వరుండు। ముల్లోకములకెల్లమూలముగు దేవుండు। శివనామదేవుండుజగతిరక్షకుడు॥ ముక్కోటిదేవతలుమునిగణంబులుగొల్వ। శైలజతోదివ్యకైలాసమునను ॥ స్థిరపదంబునరత్నసింహాసనమునందు । సరణిగాగూర్చున్నసమయంబునందు॥ అలపార్వతీదేవిహస్తములుజోడించి। పతినిశంభోయనుచుప్రార్థించిమిగుల॥ ప్రాణనాయకమీరుపరమహర్షమునొక్క। కథయానతీయవలెకరుణరంజిల్ల ॥ మీరెరుంగనిధర్మమీరేదు

లోకముల । లేదుకోరికమిమ్ములీలతోనొకటి॥ శతకంఠుడనునిశాచరుడు
శ్రీరాములతో। నేరీతిపగబూనెనెట్లుపోరాడె॥ జానకీదేవిచేశతకంఠుడేరీ
తి। మడసెనాతనిగర్వమహియందుదొలగె॥ సాకల్యముగనుయాచందం
బుయావత్తు। పరిపూర్ణకరుణతోప్రాణేశయిపుడు ॥ యానతిమ్మనిపలుక
యాపార్వతినిగాంచి। చిరునవ్వునవ్వుచునుశివుడిట్లుబలికె॥ పార్వతీగుణ
వతీపరమపుణ్యవతీ। కళ్యాణవతివినవెఘనరామచరితా ॥ శృంగారమైన
ట్టిశ్రీరామచరితంబు। గోరువారలకొసగుగొప్పభాగ్యములు ॥ ఆయురా
రోగ్యంబులతిశయిల్లుచునెపుడు। తాండవంబాడునేతసయింటలక్ష్మి॥ పు
ణ్యముల్చేకూరిపుణ్యలోకముగల్గు। ఆపదలుదొలగునేయదికారణమున॥

### * శివుడు పార్వతికి రామకథచెప్పుట. *



ఘనమైనరామకథవినగోరితివినీవు । చెప్పెదనువినుమనీచెవుల
పండువుగా॥ పూర్వకాలమునందుభువనములునిర్మింప। వెలయులోకము
లన్నివిఖ్యాతిపరుప॥ నారాయణుదివ్యనాభికమలమునందు। పరగచాతు
ర్ముఖబ్రహ్మబుట్టెనుగా॥ పరగచాతుర్ముఖబ్రహ్మగర్భమునందు। పౌలస్త్య
బ్రహ్మయింపారపుట్టెనుగా॥ ఆపులస్త్యబ్రహ్మకతిముద్దుపుత్రులై। విశ్రవ

సునాశ్రవసువీరలిద్దరునూ॥ కలిగిరివారిలోఘనుడువిశ్వావసుకు। కేకసియ
నునామెగర్భంబునందు॥ రావణకుంభకర్ణవిభీషణాదులు। జగదేకవీరూ
లుజననమొందిరిగా॥ వారిలోఘనుడురావణుడులంకారాజ్య। పట్టణాధీ
శుడైప్రబలుచుండెనుగా॥ అన్నకొడుకులజూచిఆశ్రవసుడనువాడు। తన
కుసంతానంబుతగలేదుయనుచు॥ సుతులుగలుగనితనువుపతిలేనిరాజ్యం
బు। వినయమెరుగనివిద్యవైరివైద్యంబు॥ పతిలేనిమానవతిగతిలేనిజీవ
నము। మతిలేనిమంత్రిసమ్మతిలేనిభార్య॥ అన్నంబులేనొడలుసున్నమెయ్య
నివిడెము। వ్యర్థకార్యములనుచువడిమీరలేచి॥ ఘోరవిపినముకేగిసిరం
బులోమునిగి। పంచాగ్నిమధ్యమునభక్తిమీరగను॥ బొటవ్రేలుమొన
నూతపొందుగానిలుపుకొని। తపమునిష్టనుజేసెదానవేశ్వరుడు॥ వానిత
పముకుమెచ్చిభానుడొయ్యనవచ్చి। కరుణించియాదనుజవరునకిట్లనియె॥
కొడుకుగోరితపంబుఘోరముగజేసితివి। అత్రేయమునిసుతుండరయనీస
తికి॥ చిత్రగంధికినివిచిత్రంబుగానేడు। జననమొందునటంచుజనియెసూ
ర్యుండు॥ ఇనుడుచెప్పినరీతితనగర్భవాసమున। జనియించెశతకంఠుడనుని
శాచరుడు॥ నూరుశిరములునుయిన్నూరుచేతులుగలిగి। యినకోటితేజు
డైతనయుడుదయించె॥ అంతింతయనరానిసంతోషభరితుడై। తండ్రిఆ
శ్రవసుండుతనివిమీరుచును॥ తనయునకుసర్వవిద్యలుతానుజెప్పించి। లం
కకట్టినసహస్రలావణ్యమైన॥ అతులప్రతాపలంకయనుపట్టణముతా। విశ్వ
కర్మునిచేతవెలయనిర్మించె॥ కొమరొప్పబంగారుకోటలునుతొమ్మిది। పరి
ఘావిశేషముల్పరగతొమ్మిదియు॥ తగుబలస్తోమంబుదనరంగజేయించి।
యెడతెగకలోకంబుయేలుకొమ్మనుచు॥ సురసముద్రముమధ్యసురలుభీతి
ల్లంగ। పరగశతకంఠునికిపట్నంబుగట్టి॥ ఎలమిమీరగసుతునకిట్లుపట్న
ముగట్టి। నాశ్రవసుడేగెతపమాచరించుటకు॥ శతకంఠుడవలీలజగముయే
లుచునుండె। సంతసంబుననున్నకొంతకాలముకు॥ ర 3॥

## * రామాయణకథ. *



ఆదినారాయణుండవతారమూర్తియై। దశరథమహారాజుతనయుడై పుట్టి॥ శ్రీరామచంద్రుడై శ్రితజనులరక్షింప । అయోధ్యాపురమందు ఆవందువెలసె॥ అఖిలవిద్యావిధులనభ్యాసమొనరించి। కౌశికునియాగంబునాచిరక్షించి॥ తాటకినిబరిమార్చిదనుజకోట్లనుగూల్చి । అవలీలగా బట్టిహరువిల్లువిరచి॥ జనకరాజుకొమార్తెజానకినిబెండ్లాడి। పరశురామునిభంగపరచి వేగమున ॥ తండ్రిశెలవునజనకతనయలక్ష్మణుతోడ । దండకారణ్యమునకుదర్లి యుద్ధతిని॥ అలవిరాధఖరాదులనుబట్టివధియించి। చుప్పనాతికిముక్కుచోద్యముగగోసి॥ మాయావియతినీచుమారీచుబరిమార్చి। చనటిరక్కసుకబంధునిబట్టిచంపి॥ కపిరాజుసుగ్రీవుకభయంబుదయచేసి। ఏకశరమునవాలినిలగూలవేసి॥ వెలయుడెబ్బదిరెండువేలకపులునుగొల్వ। సుగ్రీవుతోగూడిచోద్యమొప్పగను ॥ జానకినిచెరగొనుచుచనినరావణుదున్మంప। దలచిసముద్రబంధనముగావించి ॥ కడువేగలంకముట్టడివేసిశరణన్న। నావిభీషణుదనుజకభయంబొసంగి ॥ దేవతాద్రోహులైనట్టిరావణకుంభ। కర్ణదైత్యులనెల్లకయ్యమునజంపి॥ శరణుజొచ్చినవిషభీ

ణునకభయంబిచ్చి। సత్యంబువెలయనాచంద్రార్కముగను ॥ సకలజను లునుబాగడసత్కృపావంతుడై। పరమవేడ్కనులంకపట్నంబుగట్టి॥ జన కాత్మజైనట్టిజానకిచరబాపి। సన్నునులుదీవింపజగములునుతింప ॥ అఖిల బలములుగొల్వనయోధ్యపురికేగి। తనరాకగోరున్నతల్లులకుమ్రొక్కి॥ తనగురువశిష్ఠునకుదండప్రణామంబు। గావించివిప్రవర్గములుగొల్వగను॥ మంగళహారతులుసంగీతములువెలయ। పంచమహావాద్యములుమించి మ్రోయగను॥ అత్యనర్గళసంభ్రమాయత్తచిత్తుడై। హితమానిజనపురో హితులుబాగడగను॥ సీతాసమేతుడైశ్రీరామచంద్రుండు। కరుణాసము ద్రుండుకనకాంబరుండు ॥ రభసమొందగమంచిశుభముహూర్తమునం దు। పట్టాభిషిక్తుడైప్రబలుచూనుండె ॥ రాజ్యమేలుచునుండెరామచం ద్రుండంత। దివ్యకీర్తిప్రభలుతేజరిల్లగను ॥ రాజపరమేశ్వరుడురాజసిం హుడుదేవ। రాజసన్నుతుడుశ్రీరాఘవేశ్వరుడు ॥ తల్లిదండ్రులనుతాదై వముగభావించి। ఘనతతోపాలించుకాలంబునందు॥ ధర్మంబునాల్గుపా దములవర్తిల్లెను। వలసినప్పుడుగురియువానమేఘములు॥ పొంగిపారుచు నుండుగంగపడమటదిక్కు। పాపముండకవలసపారిపోయెనుగ ॥ గోవువే వేళనుగురియుచుండునుపాలు। వెతకినగనరాదువిరసమేమూల॥ బాలమ రణములేదుభాగ్యహీనులులేరు। ఇలనవగ్రహదోషమెచ్చోటలేదు॥ ప లుమారుదున్నకనెఫలియించుసస్యములు। కామధేనువులాగుభూమిరా ణించు॥ నీలవర్ణుడురామునేర్పుగావిధియించె। వలనొప్పగాపుట్టికొకరూ కపన్ను॥ పదిపాళ్లకొకపాలుపార్థివేంద్రునకిచ్చి। పరగతొమ్మిదిపాళ్లుపం టకాపునకు ॥ ఏవీథిజూచినాయేవంకజూచినా। మహాలక్ష్మితాండవము మహిమీదనుండు॥ కనకశోభితముగాకళలుదీపించుచును। పన్నెండుఆమ డాపట్నమంతటను ॥ రాఘవుండీరీతిరాజ్యమేలుచునుండె। ప్రజలంతదే వేంద్రపదవినుండిరిగా॥ సత్యలోకముకన్నసాంబశివుపురికన్న। దేవేంద్రు

పురికన్న దేజరిల్లునుగా॥ భూలోకవైకుంఠపురముచందంబున । అయో ధ్యపట్నంబులతివిచిత్రముగ ॥ పొంక మొప్పప్రతాపలంకానివాసుడౌ । శౌర్యాసలాభీలశతకంధరుండు ॥ రాముచేతనుమున్న రావణాసురుగూలు । రణమెల్లవిన్నాడురాక్షసేశ్వరుడు ॥ కుంభకర్ణుడు మొదలు ఘోరదనుజావళులు। మడసినారన్నట్టిమాటవిన్నాడు॥ శరణన్న రఘురాముకరుణవిభీషణుడు । లంకాధిపతియైనలావువిన్నాడు ॥ ఇంద్రజిత్తుడు మొదలు యెల్లరాక్షసకులము। ఇలనుగూలినవార్తలెల్లవిన్నాడు॥ ఘృతము వేల్చి

## * శతకంఠుడు రామునిపై కోపించుట. *

నయగ్నిగతిమంటలొల్కుచును। పదిపదులునోళ్లతోపళ్లుగొరుకుచును॥ కన్నులెఱ్ఱగజేసికలహించిచూచుచును। మెరసిబ్రహ్మాండంబుభ్రమింగుసట్లుగను॥ ఉరువడిసివక్త్రగహ్వరములన్నియుదెరువ। తరుణిభయపడిమేఘమరువుకేగెనుగ॥ కలగెసప్తాంబుధులుయిలరాలెతారకలు। జగముకంపమునొందె శైలముల్గదలె॥ తరుచుగానటునయోధ్యాపట్టణములోన। ఉత్పాతములుబుట్టెఉలికిపడినట్లు॥ శతకంధరుండప్పుడతివెలయుకాలాగ్ని। పగిదిమండుచుబల్కెపటురోషముననను॥ నరుడునిష్కారణమునావారలనుజంపె । వింటిరాలంకలోవృత్తాంతమిపుడు॥ మానవుడుదానవునిమదమణచిపోయెనట। వానిజంపగమానవచ్చునామనకు॥ మానవునిబలమెంతదానవునిబలమెంత। యేరీతిగూల్చెనోవారినందరిని ॥ నెన్నశక్యముగాదుయేమిటికియీవింత। ఆశ్చర్యకరమాయెనంతరంగమున॥ ఇంచుకింతైననేనెరుగనైతినిగదా । కబురులేదాయెగాకటాకటాయపుడు॥ ఈవర్తమానంబుయిటుముందుదెలసితే। నరునిదునుముదునెదిరిదురుముసేయుదును॥ అతిసూక్ష్మరూపమునసగుపించునానరుని। ఘోరశరమునబట్టికూల్చివేయుదును॥ బ్రహ్మదేవునిగోరిబలుతపంబొనరించి। ఘోరవరములుబడసిధీరతనువత్తు॥ నెరయువరములుబడసినేవచ్చునందాక। యేకచక్రం

బుగానేలమిమీరుచును ॥ మహాదరణ్యముకేగిమనసునేకముజేసి। పరమే

### శతకంఠుండు బ్రహ్మనుగూర్చి తపము సేయుట.

ష్ఠిమదిగోరిపంచాగ్నినడుమ ॥ వెలయంగతనబొటనవ్రేలునేలనుమోపి। తనువెల్లనిక్కహస్తములుపైకెత్తి॥ మధ్యాహ్నమార్తాండమండలంబును బోలి। నిరహారుండగుచుదానెరిదప్పకుండ॥ ఇదివానఇదియెండయిదిమంచుయనకుండ। దనుజుండుయేవేళతపముజేయుచును॥ ఘనుడుజేసెటియుగ్రతపమహాత్మ్యమునను। నెరిదప్పిజగములన్నియుతల్లటించె ॥ రవిచంద్రులెల్లమార్గముదప్పిభయపడిరి। దిశలుమ్రొగ్గెనుభూమిదిరగవాడగనుగా॥ వెరచెదేవేంద్రుండువీరదిక్పాలకులు। బ్రహ్మదేవుడుచాలభయపడుచులేచె॥ భయపడుచులేచియాభయకరమంతయును। శతకంఠుసేయువిశ్రుతతపోమహిమ॥ అనుచువేగమువచ్చిఅసురముందరనిలచి॥శతముఖానీతపముచాలులెమ్మనెను॥ నీభక్తియుక్తికినీతపంబుకుమెచ్చి। వరములిచ్చెదగోరుమరిజాలమేల॥ అనిధాతపలుకంగనసురుడంతటలేచి। శతనమస్కారములుసంపూర్తిజేసి॥ కరమర్థినిన్నూరుకరములనుజోడించి। కైవారమొనరించిఘనుడుతాబల్కె॥ కమలసంభవనన్నుకరుణజూచితివిపుడు। ఏనుకోరినవరములేర్పరించెదను ॥ యక్షకిన్నరగరుడరాక్షసకింపురుష। గణములచేచావుగానరాకుండ॥ భూమిలోగలయట్టిపురుషవర్గమువల్ల। జగతినెన్నాళ్లకునుచావులేకుండ ॥ వరములిమ్మనిపల్కకరుణించిపరమేష్టి। అట్లుగావరమిచ్చియసురతోననియె ॥ మరికోరుమనియింకవరమిత్తునన్నిపల్క। మదిగోరెదనుజుండుమరియొక్కవరము ॥ తనశరీరమురక్తమునునేలబడువేళ। తనుబోలువకనూరుదనుజనాయకులు॥ ధరబుట్టుటకుతనకువరములిమ్మనిబలుక। దనుజుగోరినవరముతప్పకనుయిచ్చె॥ రెండువరములనిచ్చెపుండరీకభవుండు। అడుగుమూడవవరంబసురుడాయెనెను॥ పరితాపదైన్యంబుపరగశ్రమయెడల। అంటకుండగవరమునసురుండుగో

రె॥ బుద్ధిమితనకెన్నటికిమొదలంటకుండంగ। ప్రాయమిమ్మనిపలికెపాపద
నుజుండు॥ న్యాయమార్గసుబుద్ధియేయెడలలేకుండ। వరమడిగెదైత్యేం
ద్రుపరమమూర్ఖతను॥ *

శతకంఠుండు బ్రహ్మచే వరములుబడసి
ఆస్థానమున కరుగుట.

కోరినట్లుగనిచ్చికొందువలేదికనీవు। మూడువరములుబడసిమో
దించినావు॥ అనిబ్రహ్మబలుకఆస్థానమునకరుదెంచి। శతకంధరుడుచాల
సంతోషమొదవె॥ ఆవర్తమానంబుఅమరాధిపతివిని। గుండెలుఝల్లు
మనికులిశమట్టువైచె॥ ఘోరవరములుగొనియెక్రూరరాక్షసుడనుచు। ధ
రణీమండలమెల్లతల్లటించెనుగ॥ మిగులమూడువరాలుతగనిచ్చెనన
-చు। ధాతతనలోతానుతల్లటిల్లెండె॥ ఆదురాత్ముండుముందేమికథజరుపు
నో। యనుచుకంపమునొందెయాకాశవాణి॥ శతకంఠరుడుచాలాసంతో
షచిత్తుడై। తనపురంబునకేగితనివిజెందుచును॥ బ్రహ్మతనకిచ్చినబలువ
రంబులమహిమ। తనవారితోజెప్పెదనుజనాయకుడు॥ తనవారితోజెప్పి
తగకినుకబెంచుచును। వారితోతాననియెక్రూరరాక్షసుడు॥ వింటిరాదశ
రథునికుమారుండు। మనుజమర్కటసేనతనుగూర్చుకొనుచు॥ లంకమీ
దికిబోయిపొంకమంతయుజూపె। మనవిభీషణుగుట్టుతనకుజెప్పగను॥ మ
నజ్ఞాతులైనరావణకుంభకర్ణాది। దనుజహరణమునలిపెతన్నుగానకను॥
వెరపేమిలేకుండనరుడుదనుజులజంపె। నాబిరుదుతలవంకనున్నదుంగిక
ను॥ వానిగర్వంబణచివసుధగూల్చకపోతె। అఖిలలోకములనాకపకీర్తి
గాద॥ వానికొరకైనేనువనజసంభవుగోరి। తపముజేసివరాలుతగమూ
డుగొంటి॥ ఆమానవునిదునుమునదియెంతపనినాకు। తృణమురీతిగవానిదు
నుమాడివేతు॥ పరమపావనులయందుబ్రాహ్మణోత్తములందు। కనికరం
మురంజిల్లమనుజుడటవాడు॥ సాధుమనుజులయందుశతవృద్ధజనులంద।

కనికరమురంజిల్లమనుజుఁడటవాఁడు॥ మనుజులయెడనట్టికనికరంబుండునో।
సర్వగవారినిబట్టిబాధింపవలెను ॥ బాధించినంతటనుబలుబ్రమోగ్రబెట్టుచు
ను। వానితోఁజెప్పెదరువారంతఁబోయి ॥ కనికరంబునవారికరుణించిమా
నవుఁడు। మనతోటికయ్యముకుజనుదెంచువఁడని॥ ఆడబోయినతీర్థమగయ
నెదురైనట్లు। ద్రొక్కఁబోయినవేల్పుముందరున్నట్లు ॥ మనలావారుంగ
కమర్మములుదెలియక। మననగరికేవాఁడుజనుదెంచునిజము ॥ వచ్చినంత
టవానిబట్టిచంపగవచ్చు। కడుపులోపలచల్లగదలకుండగను॥ ఆయూసప
డిమనముఅయోధ్యపట్నముకు।వెళ్లవలెననిచాలవేడ్కవుదయించె॥ వే
గమనమందరమువెళ్లిసకలశోభ। గావించివత్తాముఘనులారరండి॥ అని
పల్కిదండనాయకులప్రధానులను। తనవెంటగూర్చుకొనిదండువెడలెను

### శతకంఠుండు రాక్షసవీరులతో సాధుల బాధించుటకరుగుట.

గ ॥మునియాశ్రమంబులకుముందుగాఁజొరబారి। బలుహోమకుండములు
పాడుచేసెనుగ॥ ధేనువులబరిమార్చిమౌనీంద్రులనుబట్టి। కఠినత్రాళ్లను
దండగట్టివేసిరిగ ॥ కాసారములలోనగంగలేకుండంగ । పారగాఁజల్లించె
పాపచిత్తుండు॥ ఒకమునీంద్రునిబట్టిఊర్ధ్వపుండ్రముదుడచి। యొకవిప్రు
జంధ్యములుపోడిసివడితెంచు॥ నొకమౌనిపైజల్లునుర్వీపరాగంబు। నొక
తాపసునినోరునొగిబట్టిమూయు॥ నొకమునీంద్రునిపిల్లశిగబట్టిదిగనాఁడు।
మొగసియొకతాపసునిముక్కుబట్టీడ్చు॥ ఒకతాపసునినోరువికసించియు
మివేయు। నొకమునీంద్రునిచెవిలోహోయంచునూదు ॥ తపసుజేయుచు
నున్న తాపసులకొందరిని। మెడలబట్టలుజుట్టిబడద్రోచినవ్వు॥ ఇట్టిమౌనీం
ద్రులాహింసకోర్వగలేక। పాహియనిదానవునిపాదములబడిరి॥ ఏమిగావ
లెనంచుయతివరులబట్టుకొని। పూనివెంపలుగొట్టిపోబ్రతుకఁడనుచు॥ ప
రమపాతివ్రతలపైటచెంగులుబట్టి। చెరలుబట్టెరిచెప్పతరముగాకుండ॥ నిం

ఘు చెరువునీరుఖండించి తెగటార్చి। పంటపైరులు నేలపాలు జేసిరిగ॥ తన బాహుకందూతిదప్పిగిరిశృంగములు। నుంకించిపడద్రోయునొక్కొక్కనాడు॥ ఉగ్రుడై యొకనాడునాగ్రంబునదోలు। ఉదరిమనుజులమ్రింగునొక్కొక్కనాడు॥ బ్రహ్మదేవుండిచ్చుబలువరంబులదలచి। శపియించలేరైరితపసిబృందములు॥ ఈవిధిభయంకరముగావించచిత్తములు। కళకలపడిదేవతులుమునీంద్రులును॥ ఒకరహస్యస్థలమునొప్పగాగూడుకొని। కడుదానవునిహింసపడలేమయనుచు॥

రాక్షసబాధలు సహించలేక దేవతాము
నీంద్రు లయోధ్యకరుగుట.



తలపోసితమలోనతమకువెతలనుబొంది। సురలుపలికిరిమానివరులతోడుతను। దైత్యబాధలనొందితల్లడించుటకంటె। ఆరామకడకేగుటది క్షేమకరము॥ దనుజకోటులదృంపతాపసులరక్షింప। అవతారమెత్తినయాదివిష్ణుండు॥ తనకుశత్రుండనకదశకంఠుతమ్ముడిని। రక్షింపడామున్ను రాఘవేశ్వరుడు॥ తాటకినిదునుమాడిదనుజకోటులగూల్చి। కౌశికునియాగంబుకాయడానాడు॥ కులహీనురాలనకగుణమెంచిమదిమెచ్చి। శ

బరినిబ్రోవడాజానకీవరుడు ॥ మర్కటుండనక నాయర్కజునికిష్కింధ । పట్టభద్రునిజేసె ప్రజలుబాగడగను ॥ దుష్టులనుశిక్షింపశిష్టులనురక్షింప। నాలాయమైయుండెనార్తరక్షకుడు॥ శరణన్న రక్షించబిరుదునిర్వర్తించ దీక్షగైకొనియుండె దేవదేవుండు ॥ అతడెచిద్రూపకుండపురాణపురుషుం డు॥ అతడెసమస్తలోకాధారవర్తి ॥ రాజాధిరాజగోరాజగమనునిసఖు డు । రాజవంశజుడుశ్రీరాఘవేశ్వరుడు ॥ మూడుమూర్తులకెల్లమూలమ గుదేవుండు। బ్రహ్మాండనాయకుడుభక్తపోషకుడు ॥ దేవాధిదేవుండుదివ్య పురుషుండతడు । పాపపుణ్యంబులుపాలించుకర్త ॥ జానకీనాయకుడుజ గదేకపాలకుడు । పంకజాక్షుడుపరబ్రహ్మస్వరూపి॥ లోకాలోకములన్ని లోలతనురక్షించు।ఘనుడుమనలనుబ్రోవగణ్యమాతనకు ॥ ఘనులార ము నులారకడువేగమీరేగి।శతకకుండోనరించుచందమంతయును ॥ సాంగం బుగాజెప్పిజగమురక్షించుమని। వినుతించుడీమనమువినుపీథినుండి॥ పొడ చూపెదము మీకుపూర్ణకరుణారసము । మనపైనిపుట్టుటకుమునులార పొండి॥ అనిచెప్పియాకాశమునకుసిర్గను వేగ। మౌనిపుంగవులపుడుపైనం బులైరి॥ శాండిల్యగుషిపరుడుజహ్నుమహోరుషీ । కాలయుడుజాబాలిగా ర్గేయమౌని॥ కౌండిన్యుడునుమహాకణ్వుండుమైత్రేయ। మాండవ్యుడును యత్రిమందపాలుడును॥ కపిలభరద్వాజగౌతమజమదగ్ని । మార్కండే యాదిమౌనివరులపుడు ॥ దానవులకెవ్వరికితమరునడచినదారి । గానరా కుండంగగదలిరందరును॥ పరమరహస్యముగ అరణ్యములుగడచి। దిశలు భూములుగడచిదేశములుగడచి ॥ కృష్ణవిష్ణోహరే కేశవాచ్యుతయంచు। జనిరిరయమునపుణ్యసాకేతపురికి॥ లక్ష్మీకటాక్షమైలావణ్యమైపుణ్య। సము దాయమైవెలుగుసాకేతపురము ॥ ద్వాదశామడపొడవుద్వాదశాడనిడు వు। అందముగవిలశిల్లుఅయోధ్యపురము॥ కనిరిమౌనులుకనులకరువుదీ రగనపుడు । కాంచనగ్రహములుఘనరత్నతతులు॥ గంధగజాశ్వములుఅ

ఘనరథోష్ట్రింబులు। భవ్యమాకోటలునుదివ్యభామినులు ॥ మిన్నుముట్టి
పదారువన్నెబంగరుకోట। లాలోననవరత్నజాలమైబరగు॥ మహనీయ్యక
రమైనమందిరంబులుదివ్య । కనకమయశోభితంబునదేజరిల్లు॥ సింహాసన
మునందుశ్రీరామచంద్రుండు। నిండుపున్నమచంద్రుడనపోలివెలిగ ॥ కలి
తపుణ్యచరిత్రకంజాతదళనేత్ర। నీలనీలదగాత్రఫాలాక్షుమిత్ర ॥ కాకుత్థ్స
కులసోమఘనపుణ్యగుణధామ। జగదేకనుతనామజానకీరామ॥ కనిమునీం
ద్రులుచాలకరుణశోభిల్లంగ । మందారపుష్పములుమంత్రాక్షతతులు ॥
హస్తంబులనుబట్టిఆశీర్వదించిరి। భక్తిమీరగరామభద్రుసందరును ॥
శ్రీరస్తుసంకల్పసిద్ధిరస్తుయశోస్తు। విజయోస్తుముల్లోకవిఖ్యాతచరిత ॥ ఆ
రోగ్యమస్తుదీర్ఘాయురస్తుజయోస్తు । భయరోగసంహారభాగ్యప్రచార॥
ధనకనకవస్తువాహననిత్యలాభోస్తు। దీనకల్పద్రుమాభానుకులసోమ॥ అ
నియిట్లుమునులెల్లఆశీర్వదించుచును। వెలయమంత్రాక్షతలువేసిరందరు
ను॥ రయముప్రియమునుజయమునయముభయము బెనంగ । చెలగిముని
వరులంతశ్రీరాముగనిరి॥ ఘనరాఘవేంద్రుండుమునులకునువేశ్వర । వం
దనంబులుజేసివరుసతోనపుడు ॥ అర్ఘ్యపాద్యాదివిధులను పూజగావిం
చి । యుండంగనియమించెనుచితాసనముల ॥ మందస్మితముఖారవిందు
డై యానంద। మాత్మలోనూహింపననిమొవారలతో॥ మీవనంబునగల్గి
మెలగుసమస్తంబు। క్షేమమాయోమౌనిశేఖరులార॥మీరున్నటావునే
మీమహాత్మ్యమువలన। నిత్యోత్సవక్రీడనిలచునెల్లపుడు॥ఫలియించునేవే
ళపళ్లతోతరువులు। వికసించియుండునేవిరులవనములును॥ మావంటివా
రలకునావనంబునగల్గు। మేలునమకూరునుమీదర్శనమున॥ పనిబూనిమీ
రువచ్చినరాకనాతోడ। వేగజెప్పుడివినుటవేడుకైయుండె ॥ దాపేలమీ
కునేదాసుడనుశలవియుడి । సెలవుప్రకారంబునలుపుదునుపనులు ॥ మీ
పాదములసాక్షిమీరుచెప్పినపనులు।తప్పకుండగజేతుతపసివరులార॥ అ

నిరాఘవులుబలుకవినివానివరులెల్ల। పలుమారు దీవించివలికిరిగతిని॥ శ్రీరామరఘురామశ్రీజానకీరామ। రణరంగభీమశ్రీరమ్యగుణధామ॥ రవికులాంబుధిసోమరంజితగుణస్తోమ। పరమపావననామపాహిశ్రీరామ॥ మీకటాక్షముచేతలోకములకన్నిటికి। క్షేమమేవర్తిల్లుచెలువుమీరగను॥ జయమెసమస్తంబుజయమెప్రపంచంబు। జయమెప్రకాశించుజగముకంతటికి॥ నీచల్లదినమునానిఖిలలోకములెల్ల। క్షేమంబుకాదెమిశ్రీరామచంద్ర॥ జగములకపకారియగురావణాసురుని। పుత్రమిత్రాదులతోవుడమిగూల్చితిరి॥ ఘనవీరులగుకుంభకర్ణాదిదైత్యులను। తృణముగరణములోత్రుంచివేసితివి॥ శరణన్ననావిభీషణునిలంకారాజ్యపట్టణాధిపుజేసిపాలించినావు॥ లోకకంటకుద్రుంచిలోకములురక్షించి। కాపాడిబ్రోచితివితాపసోత్తముల॥ అఖిలాండనాయకుండవుపుణ్యపురుషుడవు। పరమాత్ముడవులోకపాలకుండవుగ॥ సృష్టింపరక్షింపశక్తజనంబులణగింప। పరగునిత్యానందబ్రహ్మంబువీవె॥ నీమూర్తిచంద్రుండునీమూర్తిసూర్యుండు। నీమూర్తిసర్వంబునీలవర్ణుండ॥ పార్వతీశుడవీవెభారతీశుడవీవె।నిగమార్థములునీవెనిఖిలంబునీవె॥ నీవుగానిదిలేదుభావించిచూచితే। మూలకుండుడవునీమూర్తిసర్వంబు॥ భారతీశుడుశంభుఫణిరాజుమొదలైన। వారలేనీమహిమవర్ణింపలేరు॥ మిమ్ము వర్ణింపంగమేమెంతవారము। భువనరక్షకపుణ్యపురుషశ్రీరామ॥ ధర్మంబునాల్గుపాదములుదప్పకయుండు। నీవుజగమేలేటికాలంబునందు॥ సకలలోకంబులకుసౌఖ్యంబుగాకేమి। క్షేమంబుగాకేమిజయముగాకేమి॥ గలుగుసౌఖ్యంబులుగలుగుభాగ్యంబులు। గలుగుకామ్యములునీకరుణారసమున॥ దశముఖుండునుమొదలుదైత్యులందరుగూలె। యికదైత్యబాధమాకెందులేదనుచు॥ సకలజగములసురలుసన్మునిస్తోమములు। ఆనందమయులమైయెలమిబొందితిమి॥ రావణునికంటెదుర్మార్గవంతుండగుచు। శతకంఠుడనునిశాచరుడుఉగ్రతను॥ కాలకుద్రు

నిఖోలిగర్వాంధతనుమీరి। పనిబూనివాడుమాపట్లముందుగను ॥ మహినిదశకంఠుజ్జేమంచివాడనితోచె । యీదైత్యుజేసేటిహింసదలచగను ॥ వాడుదశకంథరుడువీడుశతకంధరుడు। పదివంతులెక్కువాబలపరాక్రమము॥ లంకితనిదిప్రతాపలంకాతనిదివాని। పొంకమీరీతిగాభువినొప్పియుండు॥ అతనికితనికివేయుహింసలెక్కువయుండు। ఘనబలిమిజూచినాధనముజూచినను॥ ఏవిధినిజూచినాయేనూరువంతులు। రావణాసురుకన్నలావైనవాడు॥ కఠినదైత్యుడుజేయుకడుబాధకెవ్వరము। భరియింపగాలేముపలుమాటలేల॥ ఘనుడురావణుడుగూలినమాటవిన్నాడు। తనజ్ఞాతులనుజంపతానెంతవాడు॥ తనవారిగూల్చినావినికోపమునగుంది। మీపైనిపగబూనిమీరిరాక్షసుడు॥ మీపైనికోపంబుమాపైనిజూపుచును। బాధబెట్టదొడంగెపాపఖర్ముండు ॥ పూనిజేయుచునున్నవానికోపంబెల్ల । పట్టశక్యముగాదుబ్రహ్మాండమెల్ల ॥ బడుగుదైత్యుడుజేయుబాధపడగాలేక। దొలగిసురలునుమేముదూరముగబోయి ॥ అతడుజేసినబడలికంతకంతకుదేలి। రాక్షసుడుజేయుదుర్మార్గసంగతులు॥ తమసముఖమునవిన్నపముసేయవచ్చితిమి। బలుదైత్యుబాధలకునిలువజాలకను ॥ శరణుశరణనుచునంబరవీధినున్నారు। ముక్కోటిదేవతలుమోదాత్ములగుచు ॥ ఆనిమునులుబలుకంగఅంబరముపైవైపు। శ్రీరాఘవులుజూచెచిత్రమొందుచును॥ పారిజాతపువిరులుశ్రీరాఘవులపైని। గురిపించిరపుడు ర్జరులువేడుకను॥ నిర్జరులువిరివాననిండారగురిపించి। తమనివాసంబులకుదర్లిపోయిరిగ॥ ఇదియేమివింతరాయనుచురఘునాయకులు । మదికొంతశంకించిమనమునని ట్లనియె॥ పదితలలరక్కసునిబరిమార్చగాలేక। కానలోజానకీపోయెమార్గమున॥ నిష్కారణమునవాలినిజంపికోతుల! మరుగుజొరవలసెనుమానంబులేక॥ అతిప్రయాసముచేతనారావణునిజంపి । లోకమేలుచునుంటిశ్రీకరముగాను॥ నూరుతలలునుగలుగుఘోరరాక్షసునెట్లు। దునుమాడు

టకునాకుదుర్ఘటముగాద॥ అనిమనంబునగుందిఅమ్మునీంద్రులజూచి। ఘ
నులారఅతడుమెవ్వరికొమారుండు॥ యేరీతిజన్మించెయేమికోరికపైని। వ
రములన్నియుగొనెనువనజభవుచేత॥ తెల్లంబుగానాకు తెలుపుడీమునులా
ర। బరిమార్తువానిసంగరములోపలను ॥ భయరాక్షసునిజంపిజయము
బొందెదనింక। భయమునొందకుడినిర్భయులగుచునిలుడి ॥ ఎన్నితలలుం
డినాయెంతబలుడాయినా। పాపబుద్ధులుయుంటెబరిమార్చవచ్చు॥అనిరా
ముపలుకంగఅపుడుఋషివరులెల్ల। హర్షించిమధురోక్తులనుయిట్టులనిరి॥
శ్రీరామజయరామశ్రీజానకీరామ। కాకుత్థ్సకులసోమఘనసార్వభౌమ॥బ్ర
హ్మసుతుడుపులస్త్యబ్రహ్మగర్భమునందు।పుట్టిరిద్దరుసుతులుపాలుపుమీ
రగను॥ విశ్రవసునాశ్రవసువీరులిద్దరుబుట్టి। రందులోవిశ్రవసుయనుమహా
త్మునకు॥ కుపితుండురావణుడుకుంభకర్ణుడువిభీ। షణుడుబుట్టిరటంచునా
శ్రవసుడపుడు ॥ ఇనునిగోరితపంబుగొసిభుజాదండుడౌ। శతకంఠుగనియె
భూజగముకంపింప॥ అతనికిప్రతాపలంకాపట్టణముగట్టి। సురసముద్రము
సడుమసురలుభీతిలగ॥ తనభార్యచిత్రగంధినిశమారునివిడచి। తపమాచ
రించనంతర్వేదికరిగె॥ రావణకుంభకర్ణాదిదైత్యులమీరు। హతముగా
వించినారనుమాటదెలసి॥ శతకంధరుడుమిమ్ముసాధింపగాగోరి। బ్రహ్మగో
రితపంబుప్రళయముగజేసి ॥ బ్రహ్మదైత్యునిమెచ్చిపరగమూడువరాలు।
గోరినట్లుగనిచ్చెనేరీతివనిన॥ పుషవర్గముచేతమరణంబులేకుండ। తన
వంటిరక్తంబుధరబడుటవేళ ॥ నూరుగురుతనవంటిశూరులుదయించుట
కు। జరయుశ్రమదైన్యపరితాపసంచయము॥తనుబొందకుండంగతగవరం
బులుబొంది। తననగరికేతెంచెదనుజనాయకుడు ॥ నిస్సారబుద్ధిచేనెలతల
చేచావు। తనుబొందకుండంగతానడుగడాయె॥ గర్వాంధుడైకళ్లగానక
నుయీరీతి। సాధుహింసలుబెట్టసాగినాడయ్య ॥ మాయాపదలుబాపుమ
మ్మురక్షింపంగ। దిక్కునీవేగాకదిక్కుమాకెవరు॥మీశరణుకేగుమనిమిం

టసురలంపంగ। వచ్చినారమునభయమిచ్చిరక్షించు ॥ అనిమౌనులంద
రునుఅశ్రులొలుకగచాల। కంపముననిలువగాకమలనాభుండు ॥ మధుర
వాక్యంబులనుమౌనీంద్రులనుబిలచి । మెలగినేనుండగా మీకేమిభయ
ము॥ తెగువసీగతిజేయుదేవతాద్రోహిని । సంహరింతునుబ్రోతుజగము
లన్నియును॥ సందేహములుమానిసంతోషమునమీరు। జనుడుమీయా
శ్రమంబులకుమునులార ॥ నమ్మునమ్ముండనుచుముమ్మారుశ్రీరాము । లభ
యహస్తంబువారందరికినిచ్చె ॥ అభయకరమిడివారినందరినివీడ్కొల్ప।
మౌనీంద్రులేగెతమయాశ్రమంబులకు॥ *

రామాదులు శతకంఠునికై యోచించుట.

అంతరఘునాయకుండనుజులక్ష్మణుజూచి। శతముఖునిమహిమలు
నుజన్మసంగతులు॥ వారిధైర్యస్థైర్యవరతపోమహిమంబు। బ్రహ్మచేవర
ములుబడయుచందములు॥ మదినిదలఁచుచుదీనమానసుండై తాను। చిన్న
తనమునుబొందిఖిన్నుడై యుండె ॥ తనమహిమదెలియకనుతానుమాన
వురీతి। శంకాతురుండగుచుసంశయిస్తుండె ॥ పలుమారురాక్షసునిబలప
రాక్రమమెల్ల। దలపోయుచునుమహాధైర్యముసనుండె॥ నలసుమంత్రాది
మంత్రులనెల్లబిలిపించి। తనలోనుమహిమంబుతానెఱుంగకను॥ వారలం
దరువినగశ్రీరామచంద్రుండు। అనుజులక్ష్మణునితోనపుడిట్టులనియె ॥ ఒక
శరధిదాటుటకునుర్విలోగలయట్టి। నగములన్నియుశరధినడుమవైచితి
మి॥ కెరలుచునుదధిఘృతక్షీరసురార్ణవము। లేవిధంబునదాటగావచ్చు
మనము॥ దాటిదనుజునికున్నకోటలన్నియుదాటి। పట్టణంబెటులగ్గపట్ట
గాగలము॥ పట్టియనిలోచాలబలుకోట్లతోనున్న। దనుజవల్లభునెట్లుదు
నుమాడవచ్చు॥ ఏలవచ్చిరిమునులుఏలచెప్పిరిప్రతిన। వేలపలికితినియిది
యేలసమకూడె॥ ఏలతమకించితినిఏలపగబూనితిని। ఏలమునులకభయ
మేలయిచ్చితిని॥ దనుజవల్లభుడెట్లుధరగూలునాచేత । తమకమెవ్వరికిని

తగదుమొంతైన ॥ ఇదియొంతశనియనుచుయతివరులతోడనే। నెందుకు
ప్రతిజ్ఞలుపలబలికితిని॥ తగినబలసామగ్రిదనుజుగూల్చుటకేది। యనిఖి
న్నుడై యుండెనంతలోపలను॥ ఘనుడుసౌమిత్రిగొబ్బునలేచియన్నకును।
ప్రణమిల్లిలేచియిట్లనియెధైర్యమున ॥ అఖిలాండకోటిబ్రహ్మాండనాయక
నీవు। నరునివలెనెవరవొందన్యాయమాతమకు ॥ నీయొక్కమహిమంబునీ
వెరుగంగలేక। మదివిచారించెదవుమానవేశ్వరుడ ॥ తృణమాత్రుడైన
దుర్జనరాక్షసునియట్లు। బరిమార్తుననుచుమరిమరియుబల్కెదవు ॥ తగు
ననీకిటువంటిదైన్యంపుమాటలు। అఖిలలోకాధీశఆపన్నపోష ॥ ఎలమి
గామాదికొండెంతపొడవుండిన। నిప్పుబడవేసితేనిలుచునాక్షణము॥ కుల
గిరీంద్రముబోలికుంజరంబుండినా। సింహమునకెదిరించిక్షణమోర్వగల
డా॥ వాలిబలమననెంతవాడిగర్వంబెంత।వాడిసాహసమెంతవాడనగనెం
త॥ ఒక్కబ్రహ్మాస్త్రమునవసుధపైగూలడా। నిముషంబునీయెదుటనిలు
వంగగలడ॥ చెలగినేనొక్కడినెబలురక్కసునిబట్టి। గండణచిపంపెదను
దండధరుపురికి॥ కబళింతునాదివాకరచంద్రులనుబట్టి। నేలనింగియుబట్టి
ధూళిసేయుదును॥ సప్తసముద్రములజలమంతయునుబట్టి। పుక్కిలించే
తునాపుడిశటనుబట్టి॥ తృణమాత్రుడగుశతాంశునిజంపనేమిటికి। ఘన
పరాక్రమధాముకాకుత్థ్ససోమ॥ చిత్రతపమొనరించిచిత్రరూపముదాల్చి।
దేవేంద్రదేవతులుదివినుండిచూడ॥ లవణాసురునిజంపిలావుమీరినయట్టి।
శత్రుఘ్నుడుండగాసందేహమేల॥ రణమందువైరిఖండనమంత్రమొనరిం
చి। భరతుడుండగవైరిబలమెన్నదగునా॥ రసికులువిద్యలకొరాజభయం
కరులు। కౌశలవులుగలుగగాకొదువేలమనకు ॥ ఉగ్రరణకోవిదులుయురు
భుజపరాక్రములు। జయవిజయులుండంగజంకేలమనకు॥ ఇట్లుస్వాంతంబు
మనకిట్లుండడెబ్బది। రెండువేల్వాలుగొల్వరౌద్రముఖుడగుచు॥ కధనమం
దునరిపులమదమణచువిక్రముడు। ఉగ్రుడగుసుగ్రీవుడుండశంకేల॥ దనుజ

బృందంబడరతరుణీమందోదరిని। కొప్పుచేబట్టీడ్చుకొనుచురావణుఁ॥ మ
దివికలపరచిహోమముభంగపరపించు। అంగదుఁడుండగాయనుమాన
మేల॥ తల్లిదండ్రివిధాతదైవంబుసీవనుచు। జాంబవంతుడుగలుగజడియ
నేమిటికి॥ చండదోర్దండులాశతబలిగవాక్షులును। వాలరాదైత్యసీసం
హారించుటకు॥ గజగవయగోముఖగంధమాదనరుషభ। మైందద్వివిధప
నసమహాలుమొదలైన॥ వనచరోత్తములంతకీనుకతోఁదాకిన। పదునా
ల్గులోకములబరిమార్చఁగలరు॥ మీరువేసినచెట్టుమీయాజ్ఞదప్పదు। ఘ
నవిభీషణుడులంకాపట్టణమున॥ తనబలంబులతోడదర్లివచ్చినశైలము
లుసకలబ్రహ్మాండములుజూరలాడు ॥ చప్పన్నదేశాధిజనవరులీమీయా
జ్ఞ। అడుగుదాటకవత్తురనికిధైర్యమున ॥ ఇంతబలసామగ్రిస్వాంతముండ
గమీరు। అసురుడనుముటకోమనకనుమానమేల॥అంతియేకాకుండఅస
మానబలశాలి। గుణవంతుహనుమంతుగలుగ॥ శంకమనకేమిటికిసామా
న్యుడాఅతడు। వాయుదేవునిసుతుడువరపుణ్యశాలి॥ ఘట్టినప్పుడెచాలబె
ట్టిదంబుననెగసి। పట్టిమ్రింగెనుపూర్ణఫలమనుచునినుని ॥ అసమానబల
ముచేనెల్లకాలువరీతి। దాటజేయలసముద్రంబుకేల్మిడిని ॥ శంకయేమి
యులేకలంకాపురముజొచ్చి। హాతముగావించడాఅక్షయకుమారు॥ కో
పానలాటోపదీపితశిఖాతతుల। గాల్పడేమున్నలంకాపురంబంత ॥ లంకి
ణినిబట్టుకొనిలావెల్లదూలింప। పుడమిపైగూల్పడాపొట్టఖండించి॥ అట్టిజ
గజట్టిఆగాలిపట్టికి। శతకంఠుడననెంతజగదాభిరామ॥ అతడుగలుగగవగ
వనాత్మలోనీకేల। మరచినారాయతనిమహిమలన్నియును ॥ మనలనిద్దరి
బట్టిమైరావణాసురుడు। అలనాడుపాతాళమునకుఁగొనిపోయి ॥ భద్రకాళి
కిమనలబలివేయుటకుదీక్ష। బూనుకాలముసందుఁగానరాకుండ ॥ సూక్ష్మ
రూపునవచ్చిసురలుబెగడొందగా। మత్స్యనాధునితోడమారుకొనితిరి
గి॥ పాతాళలంకానివాసులనుదెగటార్చి। పిదపమైరావణుతోఁబోరుగావిం

చి॥ బలుకోపమునవాని బ్రాణములుపుచ్చుకొని। మనలబ్రతికించినామా
టమరచితిరా॥ రణములోపల నేనురావణునిశరముచే। మూర్ఛాగతుండ
నై మ్రొగ్గుకాలమున॥ సంజీవిదెచ్చియాచంద్రార్కముగనాదు। ప్రాణ
ములురక్షించెపరమాప్తుడగుచు॥ అట్టిప్రాణసఖుండుఅతిపరాక్రమశాలి।
శౌర్యధురంధరుడు సైదోడుగలుగ॥ వేరైమెవర్తింపనేరడెంతైనను। మ
నకువశ్యుడతండుమారుతసుతుండు॥ అదిగాకసకలదేశాధీశులందరును। మ
నతోటివారలేవెనకతీయరుగ॥ సంశయంబికమానిసంగరంబునకరిగి। శ
తముఖునిబరిమార్చిజగమురక్షించు॥ నీలోననీలావునీవెరుంగవదేమి। చె
లగిరణముననీవునిలచినంతటను॥ బ్రహ్మాండభాండంబుపరియలై పోవగా।
నిలచినంతటలోననిముషమాత్రమున॥ కపవుపుడకనుకొండగాజేసుకొని
మీరు। మదిబెగ్గిలించేవుమానవేశ్వరుడ॥ అనుచుతమ్ముండిట్లుతనకుబోధిం
చగా। నరనాయకుడుపిదపలక్ష్మణునికనియె॥ ఇదియెంతపనియనుచునేకా
ర్యమైనను। నిస్సారమొనరింపనెరవేరదెపుడు॥ ఘనకార్యమిదియనుచుమ
నముభీతిలరాదు। ఇదియెంతపనియనుచుమదినినదగున॥ పదితలలరక్క
సునిబరిమార్చుటకుముందు। యంతదుర్ఘటమాయెనెరుగవానీవు॥ అల
నాడుబ్రతికితివియిలజన్మమగురీతి। పొలుపొందవాయుసుతుపుణ్యంబువల
న॥ అంతకంటెప్రళయమైనదనుజుడువీడు। నాలుగుసముద్రములనడుమ
నున్నాడు॥ బ్రహ్మవరములుబడసిబలువిఱ్ఱవీగుచును। మత్తుచేదేహంబు
మరచియున్నాడు॥ తృణమాత్రుడనిచులకదనముచేయగనేమి। ఘలము
దూరమువానిబలమెన్నవలెను॥ చాలయాలోచించిజరుపవలెకార్యంబు।
పట్టినకార్యంబుతుదముట్టవలెను॥ కానితొందరపడుటకార్యహానికరంబు।
కనుగొనవలెమర్మకర్మంబులన్ని॥ గుట్టుతెలియకగానిగిట్టణంచగలేము।
యెన్నిబాణములున్నయెంతబలమున్న॥ పనిబూనియవ్విభీషణునిటకుర
ప్పించి। అతనిచేదెలియవలెనసురమర్మంబు॥ అతడుచెప్పినత్రోవనాకా

ర్యఘటనంబు। జరుపవలెఁగాని తొందరపడుట తగదు ॥ శాంతపడుమని రా
మచంద్రుండు లంకలోనా విభీషణుఁదలఁచె నంతరంగమున॥ తనమదిని శ్రీరా
ముతలఁపు గొబ్బున నాటి। ఉలికిపాటున లేచి యలవిభీషణుఁడు ॥ అనిలుండును
వరుండు వారుఁ జాదిగాఁ గల్గు। మంత్రికోవిదులెల్ల మరి తన్నుఁ గొల్వ॥

### * విభీషణుఁడయోధ్యకు వచ్చుట. *

లంకాపురము దాఁటి లవణసముద్రము దాఁటి । ఆకాశమార్గమున న
యోధ్యకొచ్చె॥ వచ్చి శ్రీరాములకు వరుసతోడుత నూరు । సాష్టాంగదం
డములు సమకొల్పి యపుడు॥ సరసఁగూర్చున్నట్టి సౌమిత్రికిని మ్రొక్కి। బలు
రాఘవుని మహీపాలునిం బొగడె॥ శ్రీజానకీలోల శ్రితలోకపరిపాల। కరుణిం
చు గుణశీల కరుణాలవాల ॥ శరణు రవికులసోమ శరణు దనుజవిరామ । శర
ణు సన్నుతనామ శరణు రఘురామ ॥ శరణు పరమానంద శరణు మూలము
కుంద। శరణు పాపవినాశ శరణు లోకేశ ॥ నాతపంబులు పండె నాకోరికలు
విండె। నీపదంబులుగంటి నేఁడు మాతండ్రి ॥ బహుదినంబులకు నాపై జ్ఞాపక
మువచ్చి। తలఁపుఁజేసితివి మాతండ్రి శ్రీరామ ॥ ననుదలంచను మెట్టిపని యే
మిచెందమో। కరుణతో శలవిమ్ము కమలలోచనుఁడా॥ అనియిట్లు వినుతింప
నప్పుడు రఘునాయకుఁడు। ఘనవిభీషణుని కౌఁగిలినఁబట్టి జేర్చె ॥ మధురవా
క్యంబులు మన్నించి తనవద్ద। నుచితాసనంబున నుండ నియమించె॥ భక్త
పరాయణుఁడు పరమాత్ముఁడాతఁడు। తమతలఁపు యాతనికి క్రమముతో దెలిపె॥
మీయన్న రావణుఁడు నేను రణభూమిలో। భూమి నిర్భయముగా పోరాడలే
ద॥ అతని బాణాతతుల మదిగుంది యుండంగ। మరి నీవు యాతని మర్మక
ర్మములు। తెల్లంబుగా నీవు తెలుపఁగా దునిమితివి। రణరంగమున బట్టి రావ
ణాసురుని॥ అన్న రావణుఁడని యభిమానముంచక । యతని మర్మములెల్ల
యేర్పరించితివి॥ నీవంటి మిత్రుండు నీవంటి భక్తుండు। గలఁడె లోకమునందు
ఘనపుణ్యచరిత॥ ఓ విభీషణ నిన్ను నావగాఁ జేసుకొని। సంగరాంబుధిమీఁద

జూడగంటినిగా ॥ నీమిత్రతనుకార్యనెర వేరితిమినాడు । గడచితిమినాకా
ర్యఘటననీవలన॥ అంతకంటెనుప్రళయమైవార్తొకటినేడు। సంభవించిన
దియావృత్తాంతమెల్ల॥ నీకెఱింగించుటకునిన్నురప్పించితిమి। వినుమిపుడా
నిసాధనముయోచించు॥ నూరుశిరములునుయిన్నూరుచేతులుగలిగి। పే
రుశతకంఠుడటక్రూరుడటమిగుల॥ తాపసులదేవతులయెప్పుడాలసించున
ట। గోబ్రాహ్మణులనుగగ్గోలుజెట్టునట ॥ నిఖిలజీవక్షోభనిత్యంబుజేయున
ట। పాపసంచయములకుపరగబట్టునట ॥ దేవతాస్త్రీలచెఱదెచ్చితా
నుంచెనట । గర్వాంధుడై కళ్లుగానకుండెనట ॥ అతనిబాధలకోర్వకరు
దెంచిమునులెల్ల। వచ్చినాతోజెప్పివగచిరందరును॥ శరణుజొచ్చినము
నులకరుణించిదానవుని। హతమార్తునని వారికభయంబులిస్తి॥ మునుల
వీడ్కొల్పి నేనునుయేమిదోచకను। నీచేనెఱుంగుటకునిన్నురావిస్తి॥ దా
నవునిసద్వర్తమానంబుయీవత్తు। సాకల్యముగజెప్పునాకుదనుజేశ॥ అని
రాముపలుకంగహస్తములుజోడించి। వినుతించిశ్రీరామవిభునకిట్లనియె॥
అమరేంద్రుచేతివజ్రాయుధముతోడను। పర్వతంబొకటెదుర్పడనిలువగ
లదె॥ కఠినవాలాభీలకంఠీరవముతోడ। యెనయిచ్చిపోరుటకునేనుగకువ
శమ॥ ప్రళయవాయువకెదుటబలమెంతగలిగున్న । కొంచెపుమబ్బుమా
ర్కొనినిలువగలదె॥ భూరిప్రచండమహాఘోరానలముతోడ। నెఱిశుష్క
దహనంబునిలువంగగలదె॥ వరములెన్నియుగొనినవాడెంతవాడైన। ని
తోనునెదిరించినిలువంగగలడె॥ పరమాత్మనీఘోరబాణాగ్నిలోపలను।
పొలచిపటుచూర్ణమైపోకనిలవగలడా॥ కానిదైత్యునిపరాక్రమముధైర్య
ముజయము। ఘనసాహసమువిక్రమమునెన్నగాను॥ బ్రహ్మదేవునికైనసహా
టిగాకుండును। పగవానిమీయదుటపొగడంగదగదు॥ అడిగినందుకురా

విభీషణుడు శతకంఠునివృత్తాంతము జెప్పుట.

టుసాధీశువృత్తాంతి। మెరిగింతుమీకునేనెరుగున్నరీతి॥ క్రూరరాక్షసుడు

స్నపూరుప్రతాపలం। కాపురంబదియలకాపురముబోలి॥ నేజైనతొమ్మి
దికోటలునుగలిగుండు। జలపూర్ణమగునగడ్తలుతొమ్మిదుండు॥ బ్రహ్మరు
ద్రాదులకభేద్యమైవర్తిల్లు। అదిగాకమంత్రికోవిదులుపదిమంది॥ స్థూలగ
శదుర్ముఖాసూర్పకర్ణగజాశ్వ। ముఖసింగళాక్షుధూమ్రాక్షురక్తాక్షు॥ యో
జనహస్తుండుయొగిదీర్ఘజిహ్వుండు। మొదలైనమంత్రులుపదిమందిగల
రు॥ అందునొక్కొక్కప్రధానికియేనూరు। కోట్లదైత్యావళులుగొలిచి
యుండెదరు॥ కాలమృత్యువునైనకదలిపోనీవకుండ। బరిమార్పజాలుమ
రుభండనంబునను॥ ఘనభుజాలుమొక్కపెట్టునకదలివచ్చిన। పదునాల్గు
లోకములుబరిమార్చగలరు॥ వారికధిపతియగుచువరములన్నియుబడ
సి। హరిహరాదులత్రృణీకరముజేయుచును॥ చండదోర్దండుడైశతముఖ
నాముడై। అభేద్యుడైయుండునఖిలజగములకు॥ నేనుమిమ్ములగలసినెరి
రావణాదులను। దునిమించినాననుచుదాడరికోపమున॥ ననుజంపవలెన
నుచుమనసునుద్దేశించి। వైరంబుచేనుండువాడునామీద॥ ఎపుడుజను
దెంచునోయెత్రోవవచ్చునో।యనిదిశలపైజూతునన్నివేళలను॥ మదిగుం
డెబెగడుచునుమారొక్కనగజాలకను। తారకాచలగుహలదాగినేనుం
దు॥ ఏవిధినిజూచినారావణుకువానికీ। మదినిదలపగహస్తిమశకాంతరం
బు॥ గానశతకంఠునిగడతేర్పలేరెవరు। నీవుదునుమాడవలెదేవాధిదేవ॥
హనుమంతుమొదలైనవనచరానీకములు। రప్పించువేగమునరకులో
త్తముడ॥ నిక్కముగదానవుడునీచేతగడతేరు। సమరయత్నమువేగజరి
గించుస్వామి॥ అనివిభీషణుపలుకునపుడుశ్రీరాఘవులు। మదికొంతదల
పోసిమరియిట్లుబల్కె॥ పూనిదనుజునిద్రుంపపూనితినినేనిపుడు। ఏవిధంబు
నగూల్తునిలపైనివాని॥ ఈసైన్యములనెల్లనేరీతినడిపింతు। నేవిధిగదా
టింతునీవార్ధులెల్ల॥ ఏలాగురక్షింతునెల్లయోగీంద్రులను। ఇకదేవతా
భయంబెట్లువారింతు॥ అనియాత్మదలపోసియాలక్ష్మణునిజూచి। మనము

శంకింపంగపనిలేదుయికను ॥ అనుచుధైర్యము దెచ్చుకొనిరామచంద్రుండు । ఆంజనేయునిదలచెనాత్మలోపలను ॥ తలచినంతటిలోనతలపుమదిలోనాటి। హనుమంతుగుణవంతుడధికబలవంతు ॥ గంధమాదననగముకడువేగమునడిగ్గి। పరుగునశ్రీరామభద్రుదరిజేరి॥

## హనుమంతుడు రామునికడకు వచ్చుట.

పరుగునశ్రీరామభద్రుసన్నిధిజేరి। పాదారవిందములబడిమ్రొక్కి-నిలచె॥ కరయుగంబులుమోడ్చిశిరముపై బెట్టుకొని। భజనచేయదొణంగెపవననందనుడు॥ ఆదినారాయణాఆపన్నపోషణా। కౌసల్యనందనాశ్రితులుపసంహరణా॥ పరమాత్మబ్రహ్మాదికరుణాపయోనిధీ । దానవసంహారదశరథకొమార॥ ఏమిపనికై నన్నుయిటుతలపుజేస్తిరో। శలవిమ్మునాకిపుడుజానకీరమణా॥ కాలమృత్యువునై నకదసిముక్కలుగోసి। చిడిముడిపాటుతోజిదిమివేసెదను ॥ ఏడువారాశులును యేకముగదాటెదను । కోటిబ్రహ్మాండములుజారలాడెదను॥సకలబలముల నెల్లసప్తసముద్రములన్ని। దాటింతు నాభుజాదర్పబలముననూ॥ ధాతజంధ్యముబట్టితగదెంచి వేతును।కులపర్వతములన్నిగూల్చి వేయుదును ॥ పనియేమినను బిల్వ పరమాత్మశలవిమ్ము। సలుపుదే కార్యంబుసందేహమేల ॥ అనుచుహనుమంతుండుఅసమానవిక్రముడు। పలుకులవలోకించిపరమాత్ముడపుడు ॥ ఆలింగనము జేసిఅతనికుశలంబడిగి। మన్నించివోయిహనుమంతుడానీవు॥ పలుమారునీపరాక్రమము నేనెరుగనా। నీవుజెప్పగవలదునీప్రభావములు॥ ఆత్మబంధుడవుమాకన్ని కార్యములందు। నీవుమాకార్యములునిర్వాహకుడవు॥ ఆలసివచ్చితివినీయలసటంతయుదీర। విడదికరిగినుఖించువిఖ్యాతచరిత॥ అనిచెప్పిబహురత్నకనకగృహములలోకి । హనుమదాహ్వయునని పెఘను దుశ్రీరాము॥ ఆవిభీషణుగాంచిహనుమంతు చేమనకు। సర్వకార్యములిపుడుసమకూడవలెను॥ మనకునాతనిసాటిమరియెవ్వరునుగారు।కార్యనిర్వా

హాకుడుఘనుడుహనుమంతు॥ అనుచునిష్టాలాపములవిభీషణుగూడి। ఆ
రాత్రిప్రొద్దుచ్చియవనినాయకుడు॥ మరునాటియుదయమునమహిమతో
సంధ్యాది క్రియలునిర్వర్తించిరయముమీరగను॥ గురుతుమీరగనగ్ని
హోత్రకృత్యమునెరపి। గురుపిత్రుపూజలుకొమరొప్ప జేసి॥ ధరణీసురుల
కెల్లతాంబూలములునిచ్చి। ఆశీర్వదాక్షతలుఅతిభక్తిగొనుచు॥హితమం
త్రితనపురోహితబంధువుగొల్వ। ననుజాపరివేష్టితుండగుచుశ్రీరాము ॥ న
వరత్నసింహాసనంబుపై గూర్చుండి । హనుమంతుబిలిపించియతిగౌరవిం
చి॥ తానువిభీషణుడుతగముగ్గురునుగూడి। గతకార్యములుకొన్నికలియ
బలుకుచును॥ రావణకుంభకర్ణాదిదానవమహా।ఖండనగతులన్నిపలుమా
రుదలచి॥ మారుతిగొనియాడిమరికొంతప్రొద్దుచ్చి। శతకంఠుసంగతులు
సాకల్యముగను॥ హనుమంతుకెరిగింపుమనివిభీషణుతోడ। కనుసౌంజ్ఞగా
వించెకమలలోచనుడు॥ శతకంఠుజన్మంబుఅతనితపోమహిమ। బ్రహ్మచేవ
రములునుబడయుచందంబు॥ దేవతామునిబాధగావించుచందంబు। అత
నికోటలుపరిఘావిశేషములు॥ద్వారరక్షకగొప్పదానవప్రముఖంబు।బలు
రాక్షసేంద్రుమంత్రులప్రభావములు ॥ కరతలామలకముగఘనుడుతాన
రిగింప। వినిపవననందనుడువినువీధిముట్టె ॥ పెన్నిధానముగన్నపేదచం
దముబోలి। కుప్పిగంతులువేసికొనియాడుకొనుచు ॥ బలుదుశ్రీరాఘవుని
పాదారవిందములు। బడిమ్రొక్కి-పలుమారుప్రస్తుతులుజేసె॥అన్నరాఘ
వనీమహాత్మ్యంబుచేబంటు। నున్నవాడనుదైత్యునెన్నబనిలేదు ॥ శతకం
ఠుడననెంతగతజీవునిగజేసి। పడవేతుమీయెదుటఘడియలోపలను॥ అది
యటన్నవినుండియసలాత్ముడగుశివుని। శక్తినాయందుననుచెలగుచుండ
గను॥ పాయకనునాతండ్రివాయుదేవునివల్ల। జవసత్వబలములునుచాల
గాగలవు॥ అసురుడననెంతమీయాజ్ఞనాతలనుంచి। వానినిముషములో
నప్రాణములుగొందు ॥ శరనిధులుదాటుటకుశక్తిచాలదటంచు। తడబ

గానేమిటికిదనుజసంహారుడ॥ వాలంబుపై నేనవొక్కనిమిషములోన। దా
టింతువారధులుతప్పకుండగను॥ నిజమునామాటలునీపాదములుసాక్షి।
యికమీరుమదిసంశయింపబనిలేదు॥ నారూపమంతయునుమీరుకన్నుల
జూచి। నమ్ముడటుమీదైననారాయణుండ॥ నారాయణుడమిమ్మునమ్మజా
లకముందు। కపిరాజుసుగ్రీవుతపననందనుడు॥ దాఖలాజూచుకోదలచి
మీతోనతడు। విన్నపముగావింపవేవేగతమరు॥ సప్తపాతాళములొక్క
సరసగాదునిమితిరి। దుందుభికళేబరముదూలమీటితిరి॥ ఘనశరంబున
వాలిదునుమాడగలవంచు। నటమీదమిమ్ములనునాశ్రయించెనుగా॥ ఘ
నుడమీవంటివారినినమ్మగాలేక। దాఖలాజూచుకొనెతపననందనుడు॥
రూపబలవిక్రమముయేపాతగనుగొనగ। ననునమ్ముటకుమీకుమనసెట్లు
గలుగు॥ అగపరతునాయందుతగినరూపంబుతా। శలవొసగుమనిరామ
చంద్రుతోననియె॥ రామచంద్రుండంతప్రేమతోశలవొసగి। అంజనీతన
యుడినిఅతిగారవించె॥ మననేకముగజేర్చిఅనలనేత్రునిగూర్చి। బలుత
పంబొనరించెపవననందనుడు॥ ఘటికాదశకమొక్కకరణిశంభోయనుచు।
ప్రార్థనలుగావించెపవననందనుడు॥ తనపుత్రునిపైనిదయబుట్టిశంభుండు।
ప్రత్యక్షమైనిలచెభళిభళీయనుచు॥ ప్రమథగణములతోడప్రత్యక్షమైనిల
చె। పవనునందనునెదుటపార్వతీశ్వరుడు॥ ప్రత్యక్షమైయున్నపార్వతీవి
భుగాంచి। ప్రస్తుతులుగావించెపవననందనుడు॥ శ్రీరాముకార్యంబుజయ
ముగావించుటకు। నేనెచాలుదుననుచునిర్వహించితిని॥ విలయకాలము
నాటివిశ్వరూపమునాకు। తక్షణంబునమీరుదయసేయవలెను॥ అనిపవన
జుడుబలుకనారీతివరమిచ్చి। జనియెకరకంఠుండుతనగిరీంద్రమునకు॥ వర

హనుమంతుడు విశ్వరూపముజూపుట.

మిట్లుగొనిశుభాకరుడగుచుహనుమంతు। వచ్చినిలచెను వేగవసుధీశునెదు
టి॥ తనదీర్ఘవాలంబునినరథంబునకొక్క। కేతనంబుగబెంచెఖ్యాతిమీ

రగను॥ తనమోముసత్యలోకనివాసుడగుబ్రహ్మ । దరిశేరిముద్దాడుకరణి
నుండెనుగా॥ తనదుపటుదీర్ఘదోర్దండప్రభావంబు । దిగ్గజంబులకెల్లబ్రె
గ్గతిలజేయు॥ తనమహాకాయంబుధరణియాకాశంబు । బ్రహ్మాండములు
నిండిపరితపించెనుగ॥ తనమహాప్రఖ్యాతిదనరుముల్లోకములు । తనభార
మునకుభూతలమెల్లవణకె॥ మొలపూసలుగనుచుక్కలుచుట్టునిలువంగ।
నిలచెహనుమంతుండునింగిపొడవునను॥ పెరిగెలోకములెల్లవిరిగెభీతిగొ
నంగ । ప్రళయకాలమురుద్రువగిదిబోలుచును ॥ మరియుపక్షములందు
మాధవుడుముఖమందు। అనలదేవుడుశిరమునమరనాయకుఁడు ॥ చెక్క
లనుఅశ్వినులుచరణూరుమధ్యమున। సర్వనివింపులుసాధ్యకిన్నరులు॥ గ
రుడగంధర్వులుమఘునసిద్ధగణములును। గనుపించిరొక్కపెట్టునను జ్వాల
ముగ॥ అతియపారావారవిస్తారగంభీర। దివ్యదేహుండిట్లుతేజరిల్లెనుగ॥
ఆమహామహారూపమపుడుజూడగలేక । యెల్లజగములుచాలతల్లడిల్లిరి
గ॥ మదివికలపడుచుసుమంతాదిమంత్రులును। నిలువుసీరైపోయినిర్ఘాం
తులైరి॥ తక్కయుండినదొరలుతలవెత్తగావెరచి। కంపముఁనుఁబొందుచు
నుకడుభీతిపడిరి॥ భరతశత్రుఘ్నులుబలులక్ష్మణుండును। యుగ్రరూపము
జూడనోపలేరైరి ॥ రాఘవేంద్రుండతనిరౌద్రరూపముఁజూచి । ఆశ్చర్య
హృదయుడై ఆత్మనిట్లనియె॥ ఇతనిసహాయమునశతముఖునిబరిమార్చి। జ
యమునొందుదునింకసంశయములేదు॥ సంశయంబులుబాసెశతకంఠుడు
నుముటకు। తపనునందనుమహాధైర్యంబువలన॥ ఆకపీంద్రునిజూచిహను
మదానీరూపు। గనిచూడనెవ్వరికిదగశక్యమగునా॥ నీమహోన్నతరూపు
నేనుజూడగలేను। మరియువరునిలగలరుమర్కటేశ్వరుడ॥ నీదిపుట్టినరూ
పునిజముగాగైకొనుము। కార్యనిర్వాహకముకలదునీవలన॥ ఇంతవాడ
వటంచునెరుగనెప్పుడుమదిని॥ కంటినిప్పుడునీదుఘనపరాక్రమము ॥ అని
రామచంద్రుండునతనితోబలుకంగ । తనదుమొప్పటిరూపుదాల్చెహను

మంతు॥ తనదుమెప్పటిరూపుదాల్చిశ్రీరాములకు । దండప్రణామంబువిం
డారజేసె॥ జనులంతతనుబొగడహనుమంతుగుణవంతు । ఆవిభీషణుచెం
తనపుడుగూర్చుండె॥ మానవాధీశుండుమరిమరియుహనుమంతు । మహి
మదెలుపుచునుండెమరియంతలోన॥పవనజుడుతననుమునుపటివలెనుబ్రిం
గునో। యనుచుమహాస్త్రాద్రికీనినుడుగ్రుంకెనుగా ॥ మరికొంతసేపటికిమాన
వాధీశుండు। కొలువుచాలించిదిగ్గునలేచియపుడు॥ అలరుసంధ్యానుష్టఆ
హ్నికంబులుదీర్చి। అనిలజువిభీషణులనపుడుగూడుకొని॥ తానుసహోద
రత్రయముగానవ్వేళ। పఙ్క్తినిపంచభక్ష్యాన్నములుమెసగి ॥ అతిగౌర
వంబుతోనందరుకర్పూర। తాంబూలములుజేసితదనంతరమున॥ సత్కా
రుణతోవిభీషణునిసరగునజూచి। నీవుయీకార్యంబునెరవేర్చవలెను॥ ప
నిబూనిచతురంగబలసమేతుండవై। మార్తాండువలెనీవుమరివేగరమ్ము ॥
నీవురావలెనంచునిర్ణయించియుతాను। దివ్యాంబరంబులనుదెప్పించియి
చ్చె॥ మహనీయతడకనకమణిభూషణంబులును । నమ్మదమ్ముననిచ్చిపొమ్మ
నుచుబలికె॥ శలవుగైకొనివిభీషణుడులంకాపురం । బునకుయతిత్వరగతి
నిజనిమెనవ్వేళ ॥ హనుమంతుగనిమానవాధీశుడావేళ । మేల్మితనకంఠ
మునమెరయుచున్నట్టి॥ దివ్యమణిహారంబుదీసికపినాయకుని । గళమునం
దునువైచెకరుణారంజిలగ॥ నీవుసౌమిత్రియునునేర్పుతోకిష్కింధ । కరిగి
యీచందంబుక్రమముగాజెప్పి॥ అఖిలవానరసమేతంబుగాసుగ్రీవు। నిట
కుదోడ్కొనిరండుయిపుడుజనుదెంచి ॥ అమాటలకుమోదమందిలక్ష్మణ
మూర్తి। అన్నపాదంబులకునతిభక్తిమ్రొక్కి ॥ శలవుగైకొనిహనుమప
హితుడైకిష్కింధ। కరిగిసమస్తరాజ్యములన్నిగడచె॥ తక్కినభరతశత్రు
ఘ్నులబాడగాంచి। మీరిద్దరునువేగవీరాత్ములగుచు॥ కాంభోజమళయా
ళకర్నాటకోసల। కుకురకేయూరాదికురుదేశములును॥ అంగవంగకళిం
గయవనాదిఛప్పన్న। దేశాధిపతులకీతెరగెల్లజెప్పి॥ వారిబలములతోడ

వారిదోడ్కొని వేగ। రమ్మనుచు శలవిచ్చె రవికులాధిపుడు॥ అన్నతో బ్రణమిల్లి భరతశత్రుఘ్ను। లెల్ల రాజులబిల్వనే గిరావేళ॥ అంతఃపురము కేగి అపుడు శ్రీరాఘవులు। హంసతూలికతల్పమందు వేడుకను॥ తత్ప్రకారములు సీతకు దెలియ జెప్పుచును। వయమొప్ప నారాత్రి నాల్గుయామములు॥ సీతాసమేతుడై శ్రీరాముని ద్రించె। అతిచీకటులు బర్వ నంతరిక్షమున॥ కలువలు వికసించె కమలములు ముకుళించె। జారచోరాదులకు సంతోషమయ్యె॥ వెలసె చుక్కలు మింట బలు క్రూరజంతువులు। భూతభేతాళములు భూమిపై వెలసె॥ మరికొంత సేపటికి మలయగాడుపు వీచె। కోమరు మీరంగ వేకువచుక్క బొడచె॥ కోడిపుంజులు గూసె కుక్కురోకోయంచు। కావుకావని గూసె కాకసంఘములు॥ బరువడిని మేతలకు పక్షిగణములు చెదరె। తపనుడును దూరె తూరుపు తెల్లవారె॥ అంతకంటెముందల రాఘవుడు లేచి। కూర్మి వెలయగను దయకృత్యములు దీర్చి॥ గురుమంత్రులకు మ్రొక్కి కోటి బ్రాహ్మణులకును। వెలయంగ కర్పూరవిడియంబులిచ్చె॥ భూషణాంబరములింపొందుగా ధరియించి। మంత్రివర్గము గొలువ మనుజనాయకుడు॥ రత్నాలగద్దెపై రాణింపగూర్చుండి। దనుజబలములు గొలువదగ విభీషణుడు॥ సకలవానరసైన్యచయముతో సుగ్రీవు। ధీరబలములు గొలువ దేశాధిపతులు॥ ఎవ్వడరుదెంతురో యెపుడుగనుగొందునో। యెపుడు శతముఖు బట్టి యేపుమాపుదును॥ అనిపలువిధంబులను గొనినిరీక్షించుచును। దీక్షగైకొనియుండ దేవదేవుండు॥ తనగురువశిష్ఠు చెప్పినరీతి వాక్యములు। వినుచు పేరోలగమునందిరంత॥

విభీషణుడు సైన్యములతో నయోధ్యకరుగుట,

అలవిభీషణుడు లంకాపురంబున కేగి। తనబంధుమంత్రులమతగ బిలిచి యపుడు॥ ఇచటి వృత్తాంతంబు యింపుగా వారితో। నెరిగించి మరియు తానిట్లనుచు బలికె॥ ఈసమయమున మనము యినకులాధీశునకు। వో

డుగయుద్ధముకుదోపగావలెను॥ ద్వాదశాక్షోహిణీదనుజబలములతోడ।
మీరుపన్నిద్దరునుధీరతనువెలయ॥ మంత్రికోవిదులారమానసముదీపింప॥
ధంధణలువెలయంగదర్లుడీవేళ । దారపుత్రభ్రాంతిదనరియుండినవారు।
రాదగదునావెంటరాకుండనిలుడీ । తనయాయుధంబులే తనప్రాణముగ
జూచి॥ నడువజొచ్చినవారునడువంగవలెను॥ బ్రతుకుపైయాసలుబడియు
న్నవారెల్ల। ఖండనంబునకురాకుండుటేమంచి । వచ్చిమరిపోవుటవలదు
యపకీర్తిదియు। మొదటనేరాకుండుటదియమహామంచి॥ అనివిభీషణుడ
పుడుతనమంత్రులతోబలుక। మహిమదీపింపంగమంత్రులిట్లనిరి॥ తగునవి
భీషణాతమరిట్లుబలుకంగ। మానసముభుజబలిమియమ్మునెరుగుదురు । జం
ఝూనిలమునైనసమయింపజేసెదము। మృత్యుదేవతనైనమ్రింగివచ్చెద
ము॥ ఆదిశేషునికోరలటుబెరికివేసెదము। నేలనింగియుబట్టిధూళిజేయు
దుము॥ అసమానబలశాలులముమాకునెదురెవరు। దాటుదుమెమీయా
జ్ఞదానవేంద్రుండ । అనివారుయుద్ధప్రయత్నసన్నాహులై । డంబుగా
ఘోరకాండంబులేర్చుచును । ముసలములుప్రాసములు ముదమొప్పబ
ట్టుకొని। వడివడినిపయనమైగడుముదంబునను॥ కరిరథభటతురగకరవా
లములతోడ। పోరివచ్చెదమనుచుపొంగుచుండిరిగ। భేరీమృదంగగంభీ
రభాంకారములు। జగతీతలంబంతచెలగియుండగను । తమతమధీరతలు
తగచాలజూపుచును। నీలుడునుహరుడునునెరయసంపాతి॥ వజ్రజిహ్వుం
డునువరశూలముఖుడును। కపిలకేశుండునుకపిలవక్త్రుండు । మొదలు
గాగలయట్టిపదియిద్దగనుమంత్రి । వరులాయుధములతోవరుసతోడుత
ను॥ ద్వాదశాక్షోహిణీదనుజబలములతోడ। వచ్చినిలచిరిదనుజవల్లభుని
యెదుట॥ వారినందరిజూచిధీరుడువిభీషణుడు । మదిదయారసమొప్పమ
న్నించిచాల॥ మన్నించిధనకనకమణిభూషణంబులు। దానవులందరికిలొసగి
సట్టులిచ్చె॥ అంతఃపురముకేగిఆలోనతనతల్లి। కైకసికిసమ్రొక్కి-ఘనుడు

దనుజుండు॥ రణప్రయాణం బెల్లవినుపింపకై కేసి। కొమకునకుకనజేర్చికొమ్మతానని॥ శ్రీరాముకార్యంబుజయముబొందగజేసి। విజయుండవై నీవువేగరాకొమరా॥ కదుజయములొదవంగకాంతతాపలుమారు। దీవించియక్షతలుదేవితానిచ్చె॥ దీవనాక్షతలందిదీరుడచ్చటవెడలి। పరమపతివ్రతసరమతనదేవి॥ గనియుద్ధగమనంబుకాంతకునుజెప్పంగ। వినిసరమమహదేవివిభునికమ్రొక్కెడను॥ వేవేగదూర్వాక్షతాపీడియములిచ్చి। కదనమందునజయముగలిగిరమ్మనుచు॥ విజయులై తామిటకువేగమేరమ్మనుచు। దండప్రణామములుతానుగావించె॥ సతినివీడ్కొనిరత్నసహితమౌషోడశ। చక్రశోభితమగుచుచెలువొందురథము॥ అలకుబేరరథంబుననుతానుగూర్చుండి। వందిమాగధులుకైవారంబుసేయ॥ పణవఢక్కావాద్యధ్వనులుచెలగగవెడలె। లంకాపురంబునిశ్శంకతోనపుడు॥ పదియురెండక్షోణిబలములొప్పగనడువ। దినదినక్రమమునాదేశములునడచె॥ ఘనమదరణ్యంబులుమరితటాకంబులు। పర్వతంబులుగడచెప్రౌఢిమీరగను॥నదులునిధులునుగడచినగరభూములుగడచి। దరిజేరిసాకేతపురిప్రాంతమునకు॥ తనరాకరామచంద్రునికెరింగించుమని। తనప్రధానులబంపెఘనవిభీషణుడు॥ దనుజవల్లభునాజ్ఞగొనిమంత్రిపుంగవుడు। జానకీనాయకునిజేరంగనరిగె॥ గద్దెపైగూర్చున్నకమలనాభునిగాంచి। సాష్టాంగదండములుసమకొల్పియపుడు॥ కరుణాపయోనిధికౌసల్యనందనుడ। కాకుత్థ్సకులవంశకమలాయతాక్ష॥ భవదాజ్ఞదప్పకనుబలుడువిభీషణుడు। చతురంగబలముయుద్ధతివెంటగొల్వ॥ ద్వాదశాక్షోహిణీదనుజబలములుగొల్వ। వచ్చినిల్చెనయోధ్యపశ్చిమంబునను॥ అనుచుదైత్యుడుదెలుపనంభోజనాభుండు। కనకమణిహారంబుకంఠంబుపై వేసి॥ అతనికుశలంబడిగిఆదరించెనుగ॥బలములుండుటకొక్కబాహ్యస్థలముచెప్పి। సిఖిలబలములయందునియమింపజేసె॥ ఘనవిభీషణుకొక్కకనకగృహమేర్పరచి।అతని

నుండగ జేసెనవనినాయకుడు॥ ఆరాత్రిప్రార్థించెనమరాధిదేవతల। రామ
చంద్రుండుశ్రీరఘుకులేశ్వరుడు ॥ అఖిలాండనాయకునిఆజ్ఞదప్పకవచ్చి।
ముక్కోటిదేవతలుగ్రక్కునసురాగా॥వారినందరిగాంచిశ్రీరామచంద్రుం
డు। ఓమహామహులార ఓయిసురలార ॥ మీయనుమతంబుగా మేముశత
ముఖునితో। పోరుగావించుటకుపోదలంచితిమి ॥ అఖిలబలములతోడన
రుదెంచవలెగాని। ఒక్కమేమరుదెంచనుచితంబుగాదు॥ అఖిలబలముల
కెల్లహారములుగావింప। సమకూడదేమియునుసమరయత్నమున ॥ నిద్ర
తృష్ణాహారనియమములుగలిగుంటె। బలములనుగదలింపనలవిగాకుండు॥
సంగరంబునజయముజెందుటకశక్యంబు।శతముఖుహరణంబుసలిపినందా
క॥ ఏడాదిపర్యంతమేబాధలేకుండ । క్షుదతృష్ణనిద్రలుబాదవకుండగ॥
అఖిలబలములపై నిఅభిమానముంచవలె। పూనికరుణారసముబొందిమీ
రిపుడు॥ అనిరాఘవుడుబలుకనానందభరితులై। సురవరులందరునుపరమ
హర్షమున॥ అఖిలాండనాయకా ఆదినారాయణ।పుండరీకదళాక్షభువనై
కరక్ష॥ ఏడాదిపర్యంతమెపుడుసేనలకెల్ల। క్షుధతృష్ణబాధలుబాదవవిటు
మీద॥ అఖిలలోకేశమీయాజ్ఞాప్రకారంబు। జరుగజేతుముమేముసంశ
యములేదు॥ అమృతహారులపగిదినన్నిబలములకెల్ల । సంవత్సరముదను
కజరిపితిమిమేము॥ ఆనిపలికిసురలంతనాకాశమునకేగి। రెల్లవేడుకతోడ
నుల్లసిల్లుచును॥ తరువాతశ్రీరామధాత్రీశ్వరుడుతాను। దనుజబలములకే
రెతప్పకుండగను॥ వనచరవర్గములుజనుదెంతురెప్పుడో।యనుచుజూచు
చునుండెనంతలోపలను ॥ హనుమంతులక్ష్మణులుఅఖిలభూములుగడచి।
పరువడినికిష్కింధదరిజేరిరపుడు॥ ఘనుడులక్ష్మణమూర్తిహనుమంతునటు
జూచి। అనిలజనీవేగియతివేగమునను ॥ ఇనసుతునిదరికేగియెల్లవృత్తాం
తంబు। జెప్పుముమనకార్యమొప్పమీరగను॥సకలవానరసేనసమకూర్చు
కనివేగ। రణయత్నసహితముగరమ్మనుచుజెప్పుము॥

## ఆంజనేయులు సుగ్రీవునిదరి కేగుట.

నీవువచ్చినదాక నేనిచటనుండెదను। అతివేగముగబొమ్ము మంజనీతనయా॥ అనిలక్ష్మణుడుబలుకనాజ్ఞబద్ధుండగుచు । జనియెకిష్కింధకును హనుమదాహ్వయుడు॥ వానరులుతనుజూచివందనములొనరించ। ఘనుడువారలనుగౌగలించుచును ॥ ఘనుడుకిష్కింధకునుజనుమధ్యమార్గమున। వనచరవర్గంబుతనుగొలచియుండ ॥ కనకసింహాసనంబున దేజరిల్లుచును। అర్కపుత్రుండుండెహర్షంబుతోను ॥ హనుమంతుగనివేగనర్కపుత్రుండులేచి। యెదురుగవచ్చివేడుకమీరనపుడు॥ తోడుకొనిపోయితప్పకగద్దెపైనపుడు। కూర్చుండగాబెట్టికౌశలంబులడిగి ॥ తనరెండుచేతులునుతలమీదబెట్టుకొని। హనుమంతుతోననియెనపుడుసుగ్రీవు ॥ నాతండ్రిజానకీనాథుండుశ్రీరామ। భద్రుండుక్షేమమాభవ్యగుణధామ॥ అతిపుణ్యగుణధాముడాలక్ష్మణస్వామి। సేవించియుండునేశ్రీరాముపదము॥ బలులుసద్గుణనిధులుభరతశత్రుఘ్నులును । అన్నయాజ్ఞాబద్ధులై యున్నవార ॥ భువనంబులకుమాతపుణ్యసద్గుణోపేత । మాతల్లియగుసీతా మగువక్షేమంబా॥ పతిబాయుదుఃఖంబుబాయుపుత్రులజూచి। తనివినొందిరిగదాదశరథునిసుతులు ॥ అలవసిష్ఠగురుండుఅతిదయారసముచే । మెలగునామార్తాండకులునిసన్నిధిని॥ అవ్విభీషణునేమినన్నేమియెప్పుడైన । తలతురాయొకవేళదయబుట్టిమదిని॥ అనినవినిచిరునవ్వుగొనిపవనపుత్రుండు। అర్కనందనుజూచియపుడిట్టులనియె॥ బలురామలక్ష్మణభరతశత్రుఘ్నులును। కుశలముననున్నారుకొదువేమిలేదు ॥ సీతామహాదేవిజీవితేశునిసేవ। జేయుచున్నయెపుడుక్షేమకరమునను ॥ గరిమకౌసల్యాదికామినీమణులెల్ల। కొమరులందునప్రేమగొనియుందురెపుడు ॥ గురువువశిష్ఠుండుపరమహర్షముచేత। మెలగుచుందురురాముమేలుదెలుపుచును॥ ఘనవిభీషణుడుఅక్కడరామువద్దనే। వున్నాడునేనటనుండివచ్చితిని॥నిన్నెప్పుడునురా

ముడెన్ను చుండును నీవు। పరమభక్తుండవనిపలువిధంబులను॥ అనినవినిర
విస్మితుడు అనిలజువిలోకించి। యేమిమహాత్మ్యుడాయీవింతదోచె॥ ఆవిభీష
ణుదనుజుడా రాముకడనుండు। కేమికారణమతండేలవచ్చెనుగ॥ ఆశ్చర్య
మును భయంబై నాకుగనుపించె। నొప్పగానతడునయోధ్యనుండుటలు॥
ఏమికారణమొకో-ఏనిమిత్తమొకో-। నీవువచ్చినదాకనిజమెల్ల జెప్పు
మా॥ అనినసుగ్రీవుతో నాపవనజుండనియె। వినవోయిసుగ్రీవవింతయేర్ప
డతు॥ రావణునికంటెదుర్మార్గవర్తనుడైన। శతకంఠుడనునిశాచరుడొక
డు వెలసె॥ గోవిప్రదేవతాక్షోభగావింపంగ। శ్రీరాఘవునిచెంతజేరిమును
లెల్ల॥ మొరలువెట్టగవారికరుణించిరాఘవుడు। అభయహస్తంబిచ్చియా
దరించెనుగా॥ శతకంఠుతో గూడిసమరంబుసేయుటకు। సన్నద్ధుడైవిభీష
ణునిరప్పించె॥ తనుసహాయంబురమ్మనిచెప్పనోడబడుచు। లంకాపురముకే
గెలావణ్యుడగుచు॥ నిన్నురమ్మనిరామునన్నులక్ష్మణుబంప। వచ్చితిమినీ
కునావార్తదెలుపుటకు॥ ఘనలక్ష్మణస్వామిమనపూరుచేరువను। ఉపవ
నములోనగూర్చుండియున్నాడు॥ అనిచెప్పిరవిపుత్రుడతితల్లడమునొంది।
ఉలికిపాటునలేచిఉరువడినియవుడు॥ అంతఃపురముకేగిఆతారతోడయా।
విధమంతయునుజెప్పివేగరమ్మనుచు॥ మనలరక్షించెటిమాధవునితమ్ముం
డు। మనవనములోపలను మనపూరుదరిని॥ వచ్చియున్నారనుచువాయు
సూనునివలన। వినియుంటినావార్తవేడుకతో మనము॥

సుగ్రీవుడు లక్ష్మణునిజూడబోవుట.

విస్తారముగరత్నవస్తుజాలములెల్ల। కానుకలుబట్టుకొనికాంతజ
నవలెను॥ హనుమంతుమొదలైనవనచరబృందములు। తనతోటినడువం
గతపననందనుడు॥ వడివడినిశృంగారవనములోనికివచ్చి। కానుకలుదరి
నుంచికడుభక్తిమీర॥ ఆలక్ష్మణస్వామియలచరణయుగ్మమునకు। ప్రణమి
ల్లిపలుమారుప్రార్థనలుజేసి॥ జననాథచంద్రమోదనుజఖండనపుణ్యచా

రిత్రలక్ష్మణాసరసీరుహాక్ష॥ కరుణాపయోనిధీకాకుత్థ్సకులవరద। దాసుడ
నునేనుమీదయకుపాత్రుడను॥ ఎంతపుణ్యమునాకునీవేళమీపాద। ద
ర్శనముప్రాప్తించెతప్పకుండగను॥ కలుషంబులెడబాసిగలిగెభాగ్యము
లన్ని। జన్మసాఫల్యంబుకెందెనీవేళ॥ మీరువచ్చినపనులుయేర్పడగనవి
నాకు। శలవుదయచేయవలెజలజాతనయన॥ అనినరవిసుతుగాంచిఅప్పుడు
లక్ష్మణుడనియె। వినవోయిసుగ్రీవవృత్తాంతమెల్ల॥ శతకంఠుడనునిశాచరు
డుగోబ్రాహ్మణుల। బాధలానరింపగాపరమరుషులెల్ల ॥ కంపితదేహులై
కావుకావుమటంచు। జానకీనాయకునిసరణిజేరగను ॥ ఆదరంబునజూచి
అభయంబుదయచేసి । అలవారికీవిధుణ్ణాలిపెరాఘవుడు ॥ దానవునిబరి
మార్చెదలచివిభీషణుని। బిలిపించిశెలవిచ్చెకలతెరంగెల్ల॥ ద్వాదశాక్షౌ
హిణీదనుజబలములతోడ। జనుదెంతుననిచెప్పిజనెవిభీషణుడు॥ సేనాసమే
తుడై శ్రీరామునన్నిధికి। వచ్చెనో లేకయిదివరకు రాలేదో॥ సుగ్రోడికెప్పు
నుచునను పవనుజనిబంప। వచ్చితిమినీకుయివార్త జెప్పితిమి॥ ఎట్లుజరిగిం
చినాయిటుమీదకపిరాజ। యెల్లభారంబునీదేసుమాయికను॥ అనియూ
రకుండంగఅపుడుసుగ్రీవుండు। కరయుగంబులుమోడ్చిఘనభక్తిననియె॥
ఓమహాత్మానేనువొక్కరుడనేనిలచి। దనుజుబరిమార్చెదనుతప్పకుండం
గ॥ పెక్కువనచరవీరబృందంబులేమిటికి। నింతకొంచపుపనికినేనెచాలు
దును॥ ఒక్కదనుజునికొరకునొకపెద్దకొండనుచు। యింతసమగ్రపుయత్న
మేలజేసెదరు॥ అయినమీశలవునకుఅడ్డుజెప్పగలేను। పిలిపింతువనచర
బృదంబునిటకు॥ మలయాచలమునందుమాల్యవంతమునందు। హిమవం
తమందుమహేంద్రశైలమున ॥ కనకాచలమునందుగంధమాధనమం
దు। నీలాచలముమలయశైలంబునందు॥ శేషాచలమునందుసింధుపర్వ
తమందు। ప్రాకటంబగుఋష్యమూకశైలమున ॥ వనచరోత్తములందు
ఘనముగనున్నారు। వారిరాబనిచెదనువచ్చునందాక ॥ అయిదురోజులు

దనుకనియమమైయిచోటు। నివసించియుండవలెవనజునితోను ॥ అను చుప్రార్థించంగఅప్పుడులక్ష్మణస్వామి। అనుమతించినశలవులందిసుగ్రీవు॥

సుగ్రీవుడు వానరబలముల రావించుట.

వానరభల్లూకసేనావళినిసెల్ల। తనభృత్యవర్గములబిలిచిరమ్మనెను॥ బనిచి నంతటవారుబలుదేశములకేగి। ఆరాముపదములనానబెట్టిరిగ॥ భల్లూక వానరబలమంతటికిజెప్ప। ఆకాశమార్గమునఅతిత్వరితముగను ॥ దిశలు తల్లడమందధీరులై పలుమారు। రాముని బేర్కొనుచుభీమశౌర్యమున॥మ లయాచలమునుంచిమరిసుషేణుడువచ్చె। దశలక్షవానరులుతన్నుగొలు వగను॥ వాలంబులనుశైలవర్గములపెకలించి। అంబరముపై విసరిఅవిబ ల ... నీలాచలమునుంచినీలుండుగోముఖుడు। వచ్చెపదహార్వేలవన చరులుగొలువ ॥ సారెసారెకుచాలశ్రీరాము బేర్కొనుచు । బలు ఘోర ముగమిన్నుపగులనార్చుచును॥ కనకాచలమునుంచిఘనుడుజ్యోతిర్ముఖు డు। బరువడినినవలక్షఫౌంజుతోవచ్చె॥ అతిపరాక్రమశౌర్యలతులప్రతా పులు। వెలయగాతొమ్మిదివేల్వలునుగొలువ॥ ఘనుడైనగవయుండుగంధ మాధనుడును। మలయాళగిరినుండిమరివచ్చిరపుడు॥ పరగనెనబదివేలభ ల్లూకములుగొల్వ। జాంబవంతుడువచ్చెజవసత్వమొప్ప॥ కోమరొప్పగా మూడుకోట్లతోద్వివిదుండు। శౌర్యధురంధరుడుజనుదెంచెనపుడు ॥ రెం డర్బుదములునుద్దండకపులునుగొల్వ । బలుడై పనసుండుబరువడినివచ్చె॥ పద్దకొండక్షోహిణీబలములునుగొల్వంగ। తారకుండును వేగదర్లి వచ్చెను గ॥ పదియక్షోహిణులబలములుద్ధతిగొలువ । వృషభుండువచ్చెతాజ మభిమలతోను॥ అఖిలవనచరులిట్లుఅరుదెంచెకిష్కింధ।తపనపుత్రునియొ క్కదర్శనంబునకు॥ బలములన్నియునుడెబ్బదిరెండువేల్వలై। వెలసినబ లములువివరమెట్లనిన॥ నూరులక్షలకోట్లుధీరవానరబలము। కనుగొన్న యిదియొక్కమొనయనగజెల్లు॥ అటువంటిబలుమొనలుఅరవయ్యేలక్ష

లు। ఘోరయనగా భువినిబరగుచుండగను॥ అట్టిఘోరలనుసాహస్రంబుగూడితే। దళమనంగాఖరగుధరణిలోపలను ॥ అటువంటిదళములు అర్బుదంబై తేను। అంభికయందురుఅవనిలోపలను ॥ అంబికంబులుకోటిఅయితేనుశతవేల్వ। అనదగుమయటువంటిపెను వేల్వలన్ని॥ పదుపదులును రెండుయేకమైలెక్కించ। భానుపుత్రుడువెలసె సేనమధ్యమున॥ ఎచ్చోటజూచివాయేవంకజూచిన। నేలయీనినభంగినిండెకపిబలము॥ తత ఘోరసింహనాదములునక్షత్రముల। వీధినిండగబర్వె మోదమలరగను॥ కాలపాశము బోలువాలములుద్రిప్పుచును । రోషాళంబునకుకపులు కాలుద్రువ్వుచును॥ పర్వతంబులునిమ్మపళ్ల చందంబునను। అరచేతులనుబంతులాడుకొందరును॥ వృక్షజాతములెల్లవ్రేళ్ళతోబెకలించి। గిరగిరనుద్రిప్పుచును గేరుకొందరును॥ పుడమిపై నేగాదుభూనభోంతరమెల్ల। కపిమయంబై యుండెకడుతెరిపిలేక॥ శాఖామృగాభీలసైన్యములజూడగాంచి । ఆశ్చర్యమునుబొందెనపుడులక్ష్మణుడు॥ హనుమంతువీక్షించిఅగచరబలమెల్ల। కంటివాలోకభీకరమురంజిల్ల ॥ ఇందరునుశోకమెత్తసీశోకపుమాకు । వేయువంతులునుమ్మినైయిమాటలేల॥

వానరబలములయోధ్యకువచ్చుట.

ఎల్లిపుష్యమిరుతమటు వేగసుగ్రీవు। పయనంబుగావించురయమునూరగను॥ అనినసుగ్రీవునకునపుడుహనుమంతుండు। దెలుపనాతడుసమ్మతించెనారీతి॥ ఆలక్ష్మణస్వామియతిసంభ్రమమునొందె। నంతసూర్యుడుగ్రుంకెనపరశైలమున ॥ నయముగానారాత్రినాల్గుఝాములుయుండి। జాంబవంతునిగూడిసౌమిత్రియపుడు ॥ ఏకముగయిద్దరునుయిష్టోషవాక్యముల। బ్రొద్దుబుచ్చుచుకొంతపూర్వసంగతులు॥ భువిపుట్టుచందంబుపాపగనగమహిమములు। తరులఘునతలుదేవదైత్యభాషణములు॥ కపులజన్మంబులుకఠినసంగరతతులు। యుద్ధములుముష్టియుద్ధప్రకారంబు॥ శతకంఠు

సంగతులుసమరయత్నప్రభలు। వానిమంత్రులతెరగుపూనికంతయును॥
జాంబవంతుడుతానుసౌమిత్రికేర్పరచి। తెలుపగానంతలోతెల్లవారెనుగ॥
భానుడుదయంబాయెబలుతుసుగ్రీవుండు। తగలక్ష్మణస్వామిదర్శనముజే
సె॥ మత్తవేదండంబుమహిమతోసర్పించి। సెలవుగైకొనిమహాసరభసం
బునను॥ అంతఃపురంబునకునతివేగజనుదెంచి। తానుతారాప్రముఖతరు
ణులకుజెప్పి॥ వారిచేతననుజ్ఞవడసియంగదపుత్ర। పౌత్రాదివర్గములుబల
సికొలువగను॥ పొలుపొందకిష్కింధపురమువెలువడివచ్చి। వందిమాగ
ధులుకైవారంబుసేయ॥ శ్వేతమాతంగములపైతానులక్ష్మణుడు। గురు
తరంబొప్పగాగూర్చుండిరపుడు॥ జాంబవదసుషేణశరభమైందద్వివిధ।గ
జనీలగోముఖగంధమాధనులు॥ మొదలైనవీరులుపదునాల్గురునువారి
బలములతోవెంటబలసికొలువగను॥ ఘనులెల్లతనవెంటకదసియేతేరం
గ। నరుదెంచిరపుడుభూభరముగంపింప॥ మిగలబలములుతోడగగన
మార్గమువెంట। జనుదెంచగానపుడుఘనరవములొప్పె॥ పుడమిగిరగిర
దిరిగెభూధరంబులుగదిలె। సంద్రములుఘోషించెజగముగంపించె॥ ఆ
మహోత్సవమరసిఅపుడురామానుజుడు। కలిగెభాగ్యంబుమీకతనమా
కనెను॥ ఇనసుతునితోబలుకప్రణమిల్లిపలుమారు। నీబంటునటుబలుకనే
లలక్ష్మణుడ॥ సకలంబుమీదెనాసౌఖ్యమెన్నగదగునె। నిజభృత్యుడనుక
రుణనెరవేర్చుస్వామి॥ అనుచుగిరినగరంబులవలీలగాగడచి। పరగశ్రీఅ
యోధ్యదరిజేరిరపుడు॥ వనచరోత్తములతోనినసుతుడుజనుదెంచె। నను
వార్తవినియపుడుజననాయకుండు॥ ఇనసుతునకెదురుగాబనిచెసుమంత్రా
ది। మంత్రిజనములనెల్లమనుజపాలకుడు॥ మరియుకొందరుహితులుమరి
వృద్ధజనముల। బనుపవారలగాంచెభానుపుత్రుండు॥సంభ్రమంబునుబాం
దిచాళవారలనెల్ల। ఆదరంబునజేర్చెనతడువేగమున॥ మత్తమాతంగం
బుమరివేగమునడిగ్గి। బలములన్నిటినచటనిలువమనిబలికె॥ తానుపెద్దల

గూడితగనయోధ్యాపురికి॥ జనుదెంచిశ్రీరామచంద్రుబొడగాంచె॥ పాదారవిందములపై వ్రాలియొకనూరు। సాష్టాంగములు జేసిసద్భక్తివెలయ॥ నగసనుండినభరతశత్రుఘ్నులకుమ్రొక్కి। చెంతనుండినవిభీషణుగౌగలించి। శ్రీరామభూపాలు జేరికరములుమోడ్చి। ప్రార్థించెసుగ్రీవుబహువిధంబులను॥ అఖిలాండకోటిబ్రహ్మాండనాయక వేద। వేదాంతవేద్యయోవిశ్వపాలకుడ॥ దుష్టులనుశిక్షింపసిష్టులనురక్షింప। ధరణిలోరామావతారమైనావు॥ భువనముల్ బుట్టింపపోషింపకర్తవు। నారాయణుండవుననుగన్నతండ్రి॥ అవతారపురుషుండవానందమూర్తివి। నీమహిమలెరుగంగనేరరెవ్వరును॥ పార్వతీపతికైనబ్రహ్మాదులకునైన। పావనమునీనామభజనమార్గంబు॥ హీనమర్కటుడను నేనెంతవాడను। నినుభజనసేయుటకు నోపద్మనాభుండ॥ అనిచాలవినుతించియినకులోద్దాముండు। కరుణాకటాక్షవీక్షణులతోనపుడు॥ ఆదరంబునజూచిఅతనికౌంగిటజేర్చి। కేలుకేలునజేర్చిచాలవేడుకను॥ అతడుతానుసుమంతుడవ్విభీషణుడును। వశిష్ఠసహితముగవెడలిరందరును॥

## శ్రీరాముడు వానరబలంబుల జూచుట.

కడువేడ్కతోడదక్షిణగోపురంబెక్కి। కపిబలప్రముఖంబుకనులజూచిరిగ॥ పుడమియీనినలాగునెడతెరిపిలేకుండ। కపిబలంబంతయుకలనిండియుండె॥ ఎచ్చోటజూచినాయెల్లదిక్కులునిండి। కనుపించెకపిబలముకనులపండువుగ॥ ఒకడునుర్విభ్రమింగనొడిసిలంఘించితే। ఒకడుతుష్టునమాయునొగివానిమీద॥ ఒకమర్కటుడునింగికొకపర్వతమువైవ। ఒకకపీంద్రుడుదానినొగలదన్నగ॥ ఒకవానరుడుతరువులూగించితెచ్చితే। అవిబట్టుకునిపీకులాడునొక్కరుడు॥ ఇగిలించియొకకోతియొగుపళ్లుజూపితే। కరుచునొక్కడువాడువెరచునట్లుగను॥ ఒకడురాఘవుజూచివొక్కరుడనేవెళ్లి। శతముఖునిద్రుంతునాక్షణములోననుచు॥ ఒకడురాఘవుజూచి

వాలమున దెత్తునా। దనుజునిచ్చటికంచు ననికూయునొకడు ॥ ఇట్లుకపివ
రులెల్లయిలశౌర్యవంతులై। పెనుగుచుండగ వింతగనుపించెనపుడు ॥ అ
ఖిలబలములకెల్లనర్కపుత్రునియాజ్ఞ। చెలియలికట్టిగా జెలగుచుండెనుగ॥
అలవిగానగరానిలగచరులకోపములు । బడబానలమురీతి బరగుచుండె
నుగ ॥ భాసురంబుగను సేనాసమర్థంబపుడు । గనియె శ్రీరాఘవులుకనుల
పండువుగ ॥ ఇనసుతుపిబాడగాంచి పెనుగొన్న మోహమున । ఘనుడుర
ఘునాయకుడుకౌంగిటను జేర్చె ॥ మెచ్చితనకంఠమున మెరయుచుండిన
యట్టి। కనకమణిహారంబు యినసుతునకిచ్చె ॥ చాలలాలన జేసిసత్కృపా
వంతుడై। అర్కనందనుతోడనని యె శ్రీరాము ॥ ఏడిజ్యోతిర్ముఖుడు యేడి
కుముదుడుగవయు। ఏడిమైందుడునలుడేడిసుగ్రీవ॥ వేరువేరుగనాకు వేర్వే
ర నెరిగింపు। కపినాయకులనెల్ల ఘనుడసుగ్రీవ॥ అనిరాముబలుకంగ నానం
దభరితుడై । తన వ్రేలుజూపుచును ఘనుడు సుగ్రీవు ॥ బహుకపీంద్రులుత
న్ను బలసి గొలువగ మిమ్ము। గనుచునుండును యడుగో గంధమాధనుడు॥ త
నుచరులు గొలువగా గిరిబోలి కూర్చుండె। గోముఖుండల్లడుగొ కుంభినీశ్వ
రుడ॥ కపులసంఖ్యలు గొలువ కార్చిచ్చుబోలుచును। కూర్చున్నవాడదు
గొకుముదుండుస్వామి॥ అమరవాలంబు పీఠము జేసికూర్చుండె। గవయు
డడుగో చూడు కమలలోచనుడ॥ రణమునేడగల్గువైరముగెల్తుమెపుడను
చు। జ్యోతిర్ముఖుండడుగొ చూడు శ్రీరామ। కపులెల్లతను గొలువ కడువిజ్జ
వీగెటి। నీలుడడుగో చూడు నిఖిలవల్లభుడ ॥ తనసహాయము దెలియ తరువు
చేబెళలించె। పనసుడడుగో చూడు పద్మలోచనుడ ॥ నేలయీనినపగిదిచా
లకపులును గొల్వ। మరిగవాక్షుని చూడుమసురమర్దనుడ ॥ పింగళాక్షుని
జంపి పెంపుమీరినవాడు। శరభుడడుగో చూడు జానకీరమణ॥ తరుచరులు
తముగొల్వదండమిడిమీవైపు। శతబలుడువచ్చి వృక్షము క్రిందస్వామి॥ వై
రిబరిమార్గ్గునని వాలముల్గార్చెటి । వృషభుడడుగో చూడు విశ్వనాయకు

ద్వి॥ కరయుగంబులు మోడ్చి కడుభక్తిమిము జూచు। ద్వివిధుఁడడుగోచూ
డు దేవవందితుఁడ॥ అనియిట్లు వేర్వేర సందరిని సుగ్రీవు। డెరుగింపుచుండగా
తరుచరబలంబు॥ తమకరంబులు మోడ్చి దశరథాత్మజుపాద। దర్శనాపే
క్షచే దర్లి వచ్చిరిగ॥ బహుకాలముల వేత్తభవ్యమార్గప్రవర్త। జాంబవం
తుఁడు వచ్చె స్వామిసన్నిధికి॥ ఘనుఁడు రామాయణగ్రంథ లేఖ్యాత్ముండు। ప
వనపుత్రుఁడు వచ్చె పరమాత్ముకడకు ॥ అసమానవిక్రముండతిభీకరుఁడు గవ
యుఁ। డారాము పాదములు జేర వచ్చెనుగ ॥ ఆరావణాంతకా అవతోద్ధార
క। యనుచు నీలుఁడు వచ్చె నారాముకడకు ॥ అపరాధిన పరాధిననుచు కర
ములు మోడ్చి। పరభక్తుఁడగు మైందవరుఁడు వచ్చెనుగ ॥ గర్వాంధుఁడై నళ
తికొంటుజంపగనెంత। పనియనుచు గంధమాదనుఁడు వచ్చెనుగ॥ బ్రహ్మ ద
నాయకా హాహా దాసుఁడనంచు। ఆసుషేణుఁడు వచ్చె వాసి మీరగను॥ పైరై
నవనచరులు వీరనాయకులెల్ల । జనుదెంచిరొక్కొకను స్వామిమీఁదరికి॥
గాంచి శ్రీరఘురాము కపినాయకుల నెల్ల। చాలమన్నన జేసి సంతోష మొం
దె ॥ తరుచరువీరులకు తగినమర్యాదలును । కట్నములు దయచేసి కమల
నాభుండు॥ కనకమయమణిదివ్యఘనరథాంగంబులును । దివ్యాంబరము
లిచ్చె దేవదేవుండు॥ ఇంతింతయనరాని సంతోష మొసఁగెంచె। హనుమం
తజాంబవంతామహాత్ములను ॥ బహువిధంబుల మెచ్చి ప్రభువారలకొ
క్క! విశ్రమస్థానములు వెలయ నియమించె॥ కరుణతో సుగ్రీవాంగదులన
యూథ్యఖ్యలో। నియమింపగా జేసె నిఖిలవల్లభుఁడు ॥ దేవతాదులొసంగుది
వ్యవరము నవకల। బలములందరు చాలపరితృప్తులైరి ॥ ఆనందపరితృప్తు
లై యుండిరప్పుడును। మరికొంత సేపటికి మహిమమీరగను॥ భరతశత్రు
ఘ్నులతో బలములును సేవింప। కాంభోజపతి నీలకాయుండు వచ్చె॥ యవ
నదేశాధిపతియగు పుళిందుడు వచ్చె । బహుబలంబులు వెంటబలసి కొల్వ
గను॥ వక్కసంబున బలము కిక్కిరిసినడువంగ। సౌరాష్ట్రనాయకుఁడు సౌవ

ర్ణుడొచ్చె॥ బర్బరాధీశ్వరుఁడుబలుప్రదీప్తుఁడువచ్చె। వింతవింతగఘోంజావొ
ట్టగొలువగను॥ నెరయుపాంచాలపతినీలకేతుఁడువచ్చె। చతురంగబలము
లుద్ధతివెంటగొలువ॥ అటమురాటకర్ణాటగౌళపుళింద। గాంధారరాజ
లునుగదిలివచ్చిరిగ॥ చతురంగబలములుచక్కఁగాననుగొల్వ॥ ద్వాదశా
క్షోహిణులుదర్లివచ్చిరిగ॥ వారినందరినివేర్వేరమన్ననజేసి। తగినవిడిది
లనుంచెదశరథాత్మజుఁడు॥ తానుమరునాఁడుయుద్ధాభిలాషచెలంగ। విద్వ
త్కవివసిష్ఠవిబుధులునుగొల్వ॥ జయమొందభూసురాశీర్వాదములుశెల
గ। రఘుకులాగ్రేసరుఁడురామచంద్రుండు॥ సూర్యసిద్ధాంతులచెశుభము
హూర్తముదెలసి। భేరీమృదంగములుబోరట్టిల్లగను॥ తనతమ్ములునుపు
త్రులునుపౌత్రులునుసుమా। తాదిమంత్రులువిభీషణుఁడుహనుమంతు॥సు
గ్రీవయుంగదసుషేణజాంబవ। భల్లూకవానరబలశాలులంత॥ తనవెంట
నడువంగదనుజవనచరమునుజ। సేనమధ్యముకేగెశ్రీరాఘవుండు॥

### రాముడు సేనానాయకుల నేర్పరచుట.

గజగవయగోముఖగంధమాదనవృషభ। మైందద్వివిధపనసము
ఖులనేర్పరచి॥ శరభనలనీలకేసరిమొదలుగాగల। కపినాయకులనెల్ల
గాంచిరాఘవుఁడు॥ అయిదేసివేల్వేలకునమరంగనొక్కొక్క। రాజుగా
నేర్పరచెరఘుకులోత్తముఁడు॥ బలుపనసాగ్గురికిపట్టంబుగట్టించి।
వారికినందరికీవరుసతోడుతను॥ సమరప్రయత్నంబుజేయుమనిజాంబవుని।
నియమింపగాజేసెనిఖిలవల్లభుఁడు॥ అందరినికాపాడుమని హనుమదాం
వ్వాయుని। చాలప్రతిష్ఠించెజానకీవరుఁడు॥ ఆదండనాయకులకామహాసే
నలకు। చెలగిసుగ్రీవునధిపతిగాజేసె॥ భువిజనుల్బాగడంగయువరాజ్య
పట్టంబు। అంగదునకర్పించెనవనినాయకుఁడు॥ ఆమహామొనచుట్టునను
రనాథునిసేన। భద్రముగనుండుమనెఁబద్మలోచనుఁడు॥ చప్పన్నదేశాధిజ
నవరులబలమెల్ల। మూఁడుమొనలుగజేసెమోదంబువెలయ॥ తగమూల

బలములుతగముప్పదక్షోణి। ఆమూడుమొనలలోనమరంగ జేసి॥ ఆమూ
డుబలములకునాథరతలక్ష్మణ। శత్రుఘ్నులనురాజశేఖరుల జేసె॥ వారికి
దోడుగావరపుత్రపౌత్రాది। వర్గములనియమించెవనజలోచనుడు॥ వారికి
దోడుగావరతురంగసహస్ర। చయములనియమించెజగతిరక్షకుడు॥ వా
రికిదోడుగావరభద్రగజములు। రథసముదయములును పృథివినియమిం
చె॥ సకలసేనలనెల్లజవముతోనడిపింపు। మనుచువేడ్కనుసుషేణునిని
యోగించె॥ అన్నిబలములకుతానధిపతిత్వమిూఱి। పట్టభద్రుండగుచు
భాసిల్లెస్వామి॥ ఆమహారవములకునాకాశమల్లాడె। బ్రహ్మాండములుపటా
పటపిగిలిపోయె॥ భరముకోర్వగలేకఫణిరాజభీతిల్లె। తలవంచుకొనెర
సాతలముక్రిందికిని॥ ఆమహాఝాంకారమరసిసగమైపోయె। శివుడుజాలిని
బొందిచింతింపదొణగె॥ కాలమరయుచునుండెకమలసంభవమూర్తి। త
లగిలపమృత్యువుతల్లడించెనుగ॥ కలగెసప్తాంబుధులునిలరాలె తారక
లు। నంతనూర్యుడుగ్రుంకెనపరశైలముకు॥ జానకీవరుడప్పుడుసర్వకృత్య
ములను। సలిపిసంగరమహోత్సవమువెలయుచును॥ బహుకాలవేత్త
జాంబవునిదగ్గిరబిలచి। చాలమన్ననజేసెజానకీవరుడు॥ ఏపుతోనతుల
ప్రతాపలంకాపురికి। గలుగుమార్గములన్ని తెలియంగనడిగె॥ మార్గము
నగలిగేటిమహిమంబులన్నియును। వింతలన్నియుదెలసెవిశ్వపాలకుడు॥
అసురమర్మములెల్లహనుమంతుకెఱిగింప। భల్లూకకులరాజవల్లతాదెలి
సె॥ తమ్ములునుతానుయంతఃపురమ్మునకేగి। భక్ష్యాన్నములుమెసగెపద్మ
లోచనుడు॥ విడియములుగావించివిలయగానారాత్రి। నిద్రించిమరునా
టియుదయకాలమున॥ ఉచితకృత్యములన్నిఒప్పుగాగావించి। తనగురుం
డగువశిష్ఠునిబిల్వబనిచి॥ తానునాతడుసహోదరచయంబులుగూడి। గో
ష్ఠస్థలముకేగిగూర్చుండియచట॥ శతకంఠుపురికేగుసాధనంబులువాని।
దునుముయంత్రంబులుఘనపరాక్రమములు॥ తరుచరమహిమలుతగుపరా

భవములు । సకలదేశాధిపులసాహసంబులును॥ ఇన్నికనుగొనియాడుచు
న్నసమయమునందు। పరమపాతివ్రత్యభవ్యగుణవేత్త॥ సీతామహాదేవిజ
విశేషనిపలుకు। లాలించియచటికినిలావణ్యమొప్ప॥ వచ్చికేళంబుకవా
టంబుచాటున। నిలచికరములుమోడ్చికేలాలివేణి॥ మోదమొప్పతిలం
గమృదుమధురవాక్యములు। ప్రాణవల్లభునితోబలికెముద్దుగను॥ ప్రాణ
వల్లభనీవుపఙ్క్తికంఠునితోడ। బోరుకాలమునందుభూరిలాఘవముజ
రణిమీరినబాణసంధానచతురత।రథగతిక్రమముసారథిచమత్కృతియు॥

సీత యుద్ధమునకువచ్చెదనని రామునికోరుట.

ఉత్తరములకుప్రత్యుత్తరములుచిత్ర । మనిచెప్పగావాటినానా
టనుంచి॥ వెలయంగయుద్ధంబునటువునప్పుడుచూడ। గోరియుంటిదన
ఘునశ్రీరామచంద్ర ॥ ఎపుడుసమరముగల్గు నెపుడునేగనుగొందు । నని
యుందుఖలిఱంచెనయ్యనావ్రతము ॥ మీజయమునుగాంచుటకుమీవెం
టనేవత్తు। అడ్డుచెప్పకశిలవునానతీవలయు ॥ మీరుశతకంఠుడునుభూరి
నిర్భరముష్టి। పోరాడువేళమీవీరులిద్దరును ॥ కరికరియుగిరిగిరియుకంఠీర
వము ఘోర। కంఠీరవంబులకరణినుందురుగా ॥ కనులపండువుగానుగాం
చెదనుశలవిమ్ము। రావచ్చునేనుశ్రీరామమీవెంట॥ శోభనగృహములకు
శృతులువినుచోటులకు। నింపారయజ్ఞమొనరించుటావులకు॥ ఘనయుద్ధ
భూములకుకాంతామణులగూడి। జనవచ్చురాజులుజగతిలోపలను॥ వి
శ్వపరిపాలనీవెంటనేరావచ్చు। ననుమీరువెంటదోడ్కొనిపెళ్లవచ్చు॥
పరగసందేహింపబనియేమియును లేదు । దయజూచిశలవిమ్ము దశరథా
రామ॥ అనినవినిరాఘవుండద్భుతహృదయుడై । వనజాక్షిగాంచియిట్లని
యెమోదమున॥ వనజాక్షిరోకలహవాంఛనీకెటుబుట్టె। నెవరుజెప్పిరినీ
కునీలాటిబుద్ధి॥ అల్పబుద్ధులు స్త్రీలవనినిజముజెప్పెదరు। యిట్టియాత్రకు
వాంఛనేలబొందితివి॥ చిలుకపలుకులకుమదియులికిపడుకోమలివి। ఘన

హరాద్భుటవృత్తివినినిలువగలవ ॥ ఎదురెవ్వరాడిననుమదిగుందుకోమలి
ని। ప్రత్యగ్రభావములోబడినిల్వగలవ॥ నెలతవెన్నెలకాకనిలచిమోర్వక
సీవు। యుగ్రభానార్చులకునోర్చినిల్వగలవా॥ పటికంపుసోపానసంక్తివి
ల్వగలేవు। బలురథంబునవెట్లునిలువంగగలవు॥ పలపలికితివినీవేలాలకిం
చితివి। కలహాగతులేలయీగమనంబులేల॥ పూనిశతముఖుడంపివానిలో
కమునున్న। వస్తువలుగానితెచ్చివనితకిత్తు॥ వాయించుటకువీణావా
ద్యములుగావు। భటహుంకృతులుమదికిభయకరంబగును॥ వాసిం
చుకుంకుమావాపనంబులుగావు। రుదరక్తజంబాలమయముచూడగను॥
మల్లికాపర్యంకమార్గంబియిదిగాదు। భయదరాక్షసకబంధములుపంకజా
క్షి॥ మురిపెములుయిదిగావుమృత్యుముఖములుగాని। పరగసుఖములు
గావుప్రళయయుద్ధములు॥ ముదితలోనీరాకమోసంబుసమకూడు। నా
మాటవినుమికచవాలికవయసు॥ ఇట్టిదుర్ఘటగమనమేలతలపెట్టితివి। పణ
తిలోసివాక్టిలంగాడుగాము॥ అనుచుపతిబలుకంగనవ్వరుసీతాదేవి। కన్ను
లందునభాష్పకణములొలుకగను॥ తనదుమాటమనక్రేలుతగనేలరాయు
చును। చీరకొంగునదుకన్నీరుదుడుచుచును॥ మగనియాజ్ఞకుతానుమా
రాడగాలేక। గడగడవడకుచునుకడుభీతిపడుచు॥ గణవాంఛలనమనంబు
పచాలవెనగొనుచు। తిరిగిచెప్పగలేకవెరపునొందుచును॥ ఖిన్నురాలైత
నదుకన్నీరుదుడుచుచును। భక్తిజెన్నొందతనపతికట్టులనిరమె॥ ప్రాణేశనీ
పాదపల్యారంభమమరగు। బట్టినేనుండగాభయమేమినాకు॥ తమప్రాపు
నుండంగదనుజాళికరగదె। గణ్యమగునానాథకరుణాపయోనిధి॥ సమర
భూస్థలికునద్దుచెప్పదగ్గముగాదు। చాలయభిలాషనుజెందియుంటినిగ॥ క
రుణాంచితపువిమ్మకరుణాపయోనిధి। దీనరక్షకదేవదేవసర్వేశా॥ అడికనిత
రముబుట్టలేనవిభునిపాదములు। బడిలేకకుండగాభామతానుండె॥ పదము
లనబడియున్నభామలేవగనెత్తి। దయమనంబునవెనగదశరథాత్మజుడు॥

వలెనున్న వాశిష్ఠు వెనుక జానకిజూచి । గమనవాంచలు మీరు గంటిరా యి
నుతు॥ ఇంతియిట్లనగో రనిందు కేమి తెరంగు। వలదన్న మానదీ కలదా యీ
తాతి॥ కానియాంత్రకువాంఛగలిగి తల్లడమంది । వలదంటు శోకించుకళ
వేమి చెపుడి॥ అనినఘనుడు వశిష్ఠు తన తపోమహిమచే । వెలయు భూతభవి
ష్యద్వర్తమానంబు॥ సర్వమహిమలు దెలసి జానకీమహిమంబు। వలనకశత
కంఠుండు ఖలగూలుననుచు॥

వశిష్ఠు సీతనుయుద్ధముకు తీసుకొ వెళ్లమనుట.

సంశయము లేకుండ సర్వంబు దెలుసుకొని । శ్రీరాము విజయంబు చి
త్తమునగోరి॥ జ్యోతిస్వరూపియై సీతామహాదేవి । తనకు దృశ్యంబుగుటగ
నివశిష్ఠుండు॥ రాముమీ సతిగోరు రాకవద్దని పలుక । తగదయ్య సీత చేజ
యుండు తెగును॥ జయము సమకూరు నిక సత్యంబుగా నమ్ము॥ అదియెటన్న వి
నండి యాదికాలమున॥ శతకంధగుడు ఘోరతపము బ్రహ్మనుగోరి మేలు
గానొనరింప మెచ్చి పరమేష్ఠి॥ పురుష వర్గంబు చేమరణంబు లేకుండ । వర
మిచ్చెదను జానకుసారసభవుండు॥ స్త్రీల చేమరణంబు జెందకుండగ వరము
గొనడాయెదను జెందుమనుజవల్లభుడ॥ అదికారణంబుగా నతివ సీతా దేవి
శతముఖుని దునుముటది సిద్ధమని నమ్ము ॥ అతివ సీతకు గమనమద్దు చెప్పగవ
లదు। రాని మ్ముని వెంట రఘుకులోత్తంస॥ కేవలాంగనగాదు భావించి చూ
చితే। ఆదిపరంజ్యోతియతివసీతమ్మ॥ నిజముగ నాయమ్మ నివ్వాళి నన్నిముల॥
చందురుడు సూర్యుండు జగతి రక్షకుడు ॥ ఏకముగ విలసిల్లు నెల్ల బ్రహ్మాండ
ములు । ఆటపాటైయుండు నాయమ్మకెపుడు ॥ దాసదాసాదులై తగను పు
త్రాదులై। హరిహరబ్రహ్మలు నాయమ్మకలరు ॥ ఆయమ్మ యంశువుల నమ
రంగబుట్టిరి మూడుమూర్తులు జగన్మూలమాయింతి ॥ వసిలె నామాన్య
రాలని బుద్ధి దల్పకుము। రమణితో గూడి యుద్ధముకరుగు దెంచు॥ రక్కసు
డుగడ తేరు రమణి చేనిక్కముగ। సందేహపడవద్దు యిందు కేమియును॥ అ

నుచుపలుమారుదీవనలుతానొనరించి । యావశిష్ఠమునీంద్రుడావధూవ
రుల॥ ఎల్లిపుష్యమిసమరయాత్ర కేగుటమంచి । మధ్యాహ్నమునసూర్య
మండలము వేళ॥ అనుచుగురువునశిష్ఠుతనతోడజెప్పితే। సమ్మదంబునబొం
దెజానకీవరుడు॥ జానకిగమనముకుసమ్మతంబునుబొంది। మంచిదేయనిప
ల్కెమగువతోనపుడు॥ ఘనుడువశిష్ఠుండుతనయాశ్రమము కేగె।తమతమ
విడిదిలకుతాము నేగిరిగ॥ రఘునాయకుండంతరమణిసీతయుతాను । సం
తోషభరితులై శయన మొందిరిగ॥ మరునాటియుదయమునమనుజవర్య
ు లేచి। యుదయాదికృత్యములునొప్పగాదీర్చి॥ భూసురవందనంబులు
జేసివారిచే। దీవనలుతా నొందిదివ్యపురుషుండు॥ సంగ్రామయత్నములు
నలుపుటకూహించి। మేలుముస్తాబయ్యెమహిపాలకుండు॥ బాలార్క తే
జంబుభాసిల్లురత్నాల । మకుటంబుధరియించెమనుజనాయకుడు॥ కోటి
సూర్యులభంగినేటిల్లు కౌస్తుభ। రత్నంబుధరియించెరామభూవరుడు॥ క
టుకగద్దగితమకాకర్ణకుండలములు। కర్ణములధరియించెకమలలోచనుడు॥
కనకనవరత్నములుదనరుహారములెల్ల। కంఠమునధరియించెకమలలోచ
నుడు॥ ఘుమ్మఘుమ్మనతావిజిమ్మంగకస్తూరి। తిలుకంబుధరియించెనలిక
భాగమున॥ తళుకుబంగరు మేల్మితళతళుకుజెన్నొంద। పీతాంబరముగట్టె
సీతావరుండు॥ వజ్రాయుధముకన్న వాడిమీరినయట్టి । ఖడ్గంబుధరియిం
చెకమలలోచనుడు॥ పదునాల్గులోకములబరిమార్పగాజాలు। గదచేత
ధరియించెకమలనాభుండు॥భూతేశుచాపంబుబోలివెలయుచునున్న। చా
పంబుధరియించెజగతిరక్షకుడు॥ విలయార్కబింబంబు వేడిమీరినయట్టి।
చక్రంబుధరియించెజగతిరక్షకుడు॥ దనరుబత్రీసాయుధాధరుండై వజ్రక
వచంబుధరియించెఘనుడుశ్రీరాము॥ పతిభక్తితనకెల్లాభరణంబులనిదల
చి। జీవితేశునిమొకుటసీతావధూటి॥ మేఘంబు వెలువడిన మెరుపుచందం
బున। శ్రీరామభూపాలు చెంతనిల చెనుగ ॥ అగ్రజునితోగూడియాలక్ష్మణ

స్వామి। భరతశత్రుఘ్నులు పైనంబులై రి॥ పుత్రులగుకుశలవులుభూరిదో ర్దండులై। పైనంబులై వచ్చెరయముమీఁరగను॥ భువనుడగువిజయుండు మహిమరెట్టింపంగ। రణగమనుఁడై నిలచెరఘురాముఁడెదుట॥ వారితోడు తగూడిశ్రీరామచంద్రుండు। యంతఃపురము కేగిమొలమితోడుతమ ॥ కౌ సల్యసూమిత్రకైకమొదలైనట్టి। తల్లులకుబ్రణమిల్లిదండములుపెట్టి॥ సీ తామహాదేవిజీవితేశునిరీతి। వందనంబులు జేసెవారికందరికి॥సౌమిత్రియు నుభరతశత్రుఘ్నులునుగూడి। అన్నగతిప్రణమిల్లిరపుడుతల్లులకు॥ కుశల వులువిజయుడునుకోరియవ్వలకెల్ల। కడుభక్తిదండములుగావించిరపుడు॥ రణవిజయులై వేగరకటునిబరిమార్చి । తగవేగరమ్మనుచుతల్లులందరు ను॥ దీవించివారలకుదీవనాశులిచ్చి। శలవులిచ్చిరివారుశలవుగైకొనిరి॥ అంతఃపురము వెడలిఆస్థానమున కేగి । ఆసుమంతాదిమంత్రులవిలోకించి॥ మంత్రిపుంగవులారమానీంద్రులనుగాయ । నభయమిస్తినివారియాపద లుదొలుగ॥ శతముఖుహరణంబునలుపుటకుజనుదెంతు। మెల్లసేనలగూ డియీవేళమేము॥ శతముఖుహరణంబుసలిపిక్రమ్మరవత్తు। మందాకభూ భారమంతయునుమీఁరు॥ పరిపాలనమొనర్చిప్రజలందరకునొకట । సమ ముగాజూడుడుసద్ధర్ములగుచు॥ ధర్మంబునాల్గుపాదములుదప్పకనుండ।పా లించుడీజనులపరమహర్షమున ॥ పాలించుడనిచెప్పి పంకజాక్షుడురామ। చంద్రుండురఘువరుడుజానకీవరుడు॥ కదనగమనంబునకునిదిసమయమని చెప్పి। తనగురువశిష్ఠునకుదండములుబెట్టి॥ పలుమారుశుభమనుచుపలికి వశిష్ఠుండు। దీవనలుగావింపదేవదేవుండు॥ శ్రీగస్తుభూపాలశేఖరాయనిస ర్వ । గీర్వాణగణములాశీర్వదింపగను ॥ శుభమస్తురాజన్యచూడామణి యంచు। విప్రవర్గములుదీవించుచుండగను॥ ఎలమిసర్వగ్రహాములేకాద శస్థాన। ఫలమబ్బుననిజ్యోతిష్కులుబలుకగాను॥ అభ్యుదయపరంపరాభి వృద్ధియుగలుగు। ననికవీశ్వరులెల్లవినుతిజేయగను॥ కాంతలందరుహేమ

కలితసౌధములెక్కి। చెలువుగాముత్యాలుచాలగాజల్ల॥ ఘుమ్మఘుమ్మన
వీరకాహళులుమ్రోయంగ। పూర్ణకుంభద్వయంబులుమొదరుకొనగ॥ఘ
నఘంటికాపటహకాహళమృదంగములు। పూరటిల్లుచుమింటభోరునను
చెలగ॥ ఈకేదులోకాలుఈవలావలగాగ। తరచుదుందుభిధ్వనులుజెల
గుచుండగను॥ మంగళపాటకసంగీతములువెలయ। వేల్పువెల్లనువువ్వ
వృష్టిగురియగను॥ రయమొప్పమాతలిరథముదోల్కొనివచ్చి। మెలమి
తోశ్రీరామునెదుటనిల్పెనుగ॥ ఘంటాకలితమగుచుగగనంబుపొడవునా
కోటిధ్వజంబులుకొమరొప్పుచుండ॥ కనకనవరత్నములుదనరుషోడశచ
క్ర। నహితమైసుందరముచాలమీరుచును॥ సాహస్రఘోటకచయము
రంజిల్లంగ। ముజ్జగంబులకెల్లమోదంబువెలయ॥ దివ్యరథమొప్పంగధీ
రుడై శ్రీరాము। గనియందరికిజెప్పిఘనతమీరుచును॥ త్రిపురపురములు
గాల్చునపుడుతేజముమీర। గౌడుతోనుస్ఫటికరకంతుపగిది॥ మెరుపు
తోగూడున్నమేఘంబురీతిగా। జానకితోగూడిజలజలోచనుడు॥ రవికోటి
తేజుడై రణరంగధాముడై। జగదేకవీరుడై జానకీవరుడు॥ భానుడుదయా
చలముపై నెక్కుచందంబు। రథమెక్కివెలుగొందెరాఘవేశ్వరుడు॥ చ
ల్లగాఘనతావిజల్లుచునువొకవింత। మలయానిలముజల్లెబలముపై నవు
డు॥ జయజయధ్వనులతోచాలవేడ్కలుమీర। మంచిశకునములయ్యె
మహిపాలునకును॥ గరుడపగడలుమొదలుగాగల్గుపేరైన। జండానిశానీ
లుపోగముందరను॥ పసిడిఘంటలువెలయబలువైభవముమీరి। మదగ
జంబులుదర్లెపదిలక్షకోట్లు॥ బారుమీరినయట్టిపేరైనజాల్మతీ। గుఱ్ఱాలు
కోటానకోటులేదర్లె॥ ధరణిగంపింపంగ తెరిపిలేకుండంగ। రాజితంబుగ
కోటిరథములేదర్లె॥ వీరుడై సింధుగంభీరుడై కనకాద్రి। ధీరుడై భరతుం
డు తేజుడై వెడలె॥ వసుధతల్లడమొందిదిశలుమ్రొగ్గతిలంగ। పిడుగుపాటు
నుబోంది వెడలెలక్ష్మణుడు॥ శత్రుసంహారణక్షత్రియప్రభువైన।శత్రుఘ్ను

డునుదర్లైసాహసంబునను॥ సీతాసతీగర్భసింధుసంభూతులౌ। లవకుశులు
నుదర్లైలావణ్యముగను॥ తంద్రికుశుఁడొప్పంగ తాతరాముఁడుమెచ్చ। పుడ
మికంపమునొందవెడలెవిజయుండు॥ మూఁడుదశాహిణులమూలబలమే
దర్లె। దివ్యాయుధములతోదిశలుగంపింప॥ రణవీరులిటువేగరాగిడికినో
ర్వక। పుడమిపరాగంబువడినపుడువేచె॥ ధరణిభయపడిమింటఁదాగబో
యినరీతి। గలశెనుయాకాశగంగలోనపుడు॥ నీలమేఘముతోడనిలచిన
మెరుపువలె। వెలశెసీతాలక్ష్మివిభునిచంగటను॥ ఆయమ్మసౌందర్యమంత
కన్నులఁజూచి। పురవాసులంతతలపోసిరీగతిని॥ ఆమేనివయ్యారమావింత
శింగార। మమరకాంతలయందునైనజూడముగ॥ నీలమేఘముచొప్పౌన
లతకుకురులొప్పు। అర్ధచంద్రునిబోలుఅతివనెన్నుదురు॥ అద్దములుచెక్కు-
ళ్లుఅబ్జములునేత్రములు। సరగొప్పనాసికముసంపెంగమొగ్గ॥ శ్రీకారము
లుభామచెవులుముద్దులుగుల్కు। మోవిపగడపుతీగెమురిపెములమించు॥
నవ్వువెన్నెలనిగ్గునలినాక్షిదంతములు। ముక్తాఫలంబులు మోముచం
ద్రుండు॥ గళముశంఖంబింతికలరుభుజములుతూళ్లు। కాంతకరతలములు
కడుపల్లవములు॥ వీపుకదళీదళము వెలదికుచములుగిరులు। కాంతనాభిక
సుడికౌనుగగనంబు॥ కటిప్రదేశముపుడమికామినీపెందొడలు। అరటిబో
దెలమించునతివిచిత్రముగ॥ పద్మములుపాదములుపంకజాక్షిశరీర। మె
ల్లతొలకరిమెరుపువనితాక్షిరూపు॥ పనిబూనిచేసెనొబహుకాలములుబ్ర
హ్మ। పరగముద్దులగుమ్మబంగారుబొమ్మ॥ బొమ్మగాదదిమించిపాలుపైన
కెందమ్మి। తమ్మిగాదదిమించితావిపూతిలుక॥ తిలుకగాదదిమించితీరైన
చంగల్వ। కలువగాదదిమించిఘనమైనచిలుక॥ చిలుకగాదదిమించిచిగు
రుపువ్వులబంతి। బంతిగాదదిమించిప్రద్యుమ్నదంతి॥ దంతిగాదదిరతీతరు
ణిమెప్పులకుప్ప। కుప్పగాదదిమించికుదురుపూదండ॥ కానున్నయింతచ
క్కదనమెటుగలిగె। చూడశక్యముగాదుసుందరీమణిని॥ కనలేదుయిటు

వంటికాంతనేలోకమున। వినలేదుయిటువంటివెలదులుండుటకు॥ దిద్దిచే
సినలాగుతీర్చివ్రాసినలాగు। చిత్తరువుబొమ్మవలెచెలియగనుపించె॥ కాం
తనిలచినచోటకలువతామరలుండు। కోలనూలై యుండునుకొదువలేకుం
డ॥ సురయరంభోర్వసీమేనకాంబుజముఖులు। వనితసౌందర్యమునకెన
కాలేరు॥ అనియిట్లుపురవానులంతగొనియాడంగ। పురమువెడలెనఃపు
ణ్యపురుషోత్తముండు॥ సాకేతపట్టణప్రాకారములుగడచి। పైటబలము
లగాంచెపద్మనాభుండు॥ నేలయీనివక్రింగినిఖిలభూములునిండి। పి
గినయట్లుయీలాపునిండి॥ పర్వతంబులయందుబలుతటాకములందు। అ
ఖిలదిక్కులయందునాబలమువెలసె॥ వట్టజాలకయుండెబ్రహ్మాండభాండ
ములు। ధరణిలోనిసుమంతతెరిపిలేకుండ॥ మున్నూరుయోజనంబులువెడ
ల్పునుగల్గి। అంతియొపొడవుగానాబలములమరె॥ బలములన్నియుజూచి
పరమాత్ముడగురాము। ఘనవిభీషణుమొదలుఘనులనందరిని॥సుగ్రీవఅం
గదసూషేణజాంబవ। వరులనెల్లనుగాంచిపరమహర్షమున॥ నేటికిచ్చట
మనమునిలచిరేపుదయమున। నాయుద్ధయత్నముకునడువంగవలయు॥ అ
ఖిలసేనలెరుంగనన్నిదిక్కులవేగ। సాటించమనిచెప్పెసార్వభౌముండు॥ వ
రవాళ్ళరప్పించిబహుబలములెరుగంగ। సాటించెనావేళసాహసంబునను॥
నరవరుడుకదనసన్నాహవేదుకనుండె। నంతటనుసూర్యుండుమస్తాద్రికరి
గె॥ దళములన్నియుతమస్థానములనియమించె। నంధకారముబర్వెనఖి
లదిక్కులకు॥ ఆవేళభేరీమృదంగతూర్యరవంబు। నొక్కపెట్టునమ్రోగ
నుజ్వలంబుగను॥ అఖిలబలములసింహనాదములుఘోరముగ। బరగ
దిక్కులకెల్లభయకరముగాను॥ అశ్వఘోషారవములరయుచున్నినము
ట్టి గంధగజబృంహితములందందబరగ॥ రంగుననికామ్మకఠంకారము
లుమీరె। భల్లూకకులరవముప్రళయమైబరగె॥ రథనిష్ఠురస్వనములదరె
బ్రహ్మాండములు। విలయకాలంబయ్యెవిశ్వమంతటికి॥ వస్తసంభ్రమములో

క్కసరణిగా ఘోషించె। నంతయుదయాద్రిపై యర్కుడుదయించె॥ అటకుండె మేల్కాంచిఆరాఘవేంద్రుండు। ఉదయకృత్యములన్ని వొప్పగాదీర్చి॥ ఆవిభీషణసుగ్రీవాంగదజాంబవ। మొదలైనవీరులనుముదముతోబిలచి॥

## రాముడు యుద్ధమునకు వెడలుట.

మణిభూషణంబులును కనకాంబరంబులును । తగినరీతిగనిచ్చె దానవాంతకుడు ॥ తమ్ములనుపుత్రులనుతగపౌత్రులనుబిలచి । సకలనృపులనుగూడిజనుదెంచుమనియె ॥ దేశాధిపతులంతధీరులైతమతమ । బలములకుసాటించిపైనంబులైరి ॥ కరవాలముసలముద్గరప్రాసపట్టస । పరిఘగదాశూలబాణములతోడ ॥ గజహయాందోళికఘనబృందముల నెక్కి । మెరయుచుండిరిమింటసురలుమెత్సగను ॥ కపివరబలమంతకదు నొక్కపెట్టుగా । జయజయధ్వనులతోజెలగుచుండిరిగ ॥ చుట్టుముట్టడివేసినట్టివిభీషణు । బలమురాక్షసులంతబలసియుండిరిగ ॥ బలములన్నిటినియేపారకన్నులజూచి । హనుమంతుగుణవంతునతిపుణ్యవంతు ॥ తనకరంబులురెండుతలమీదకట్టుకొని । శ్రీరామజనపాలుచెంతనిలవెనుగ ॥ వచ్చినిలచినయట్టి వాయుపుత్రునిబట్టి । కౌంగిటనుబంధించెకమలలోచనుడు ॥ కరయుగమ్ములుమోడ్చిఘనుడుహనుమంతుండు । విలసిల్లుశ్రీరామువిభునికిట్లనియె ॥ ఇలసేనలన్నియునుఇలమీదనడచితే । పట్టజాలవుయెల్లబ్రహ్మాండములును ॥ ఎల్లలోకములిపుడుతల్లడముబొందవా । నిలువగలవాయెల్లగిరులునగరములు ॥ సారదిలోకములెల్లచూర్ణమైపోవవా । యేదారినడచేదుయీబలంబెల్ల ॥ విశ్వములునిర్మింప వెలయుజగములుబ్రోవ । కొత్తగానవతారమెత్తవలెనీవు॥ అదియుపాయముగాదుఆదినారాయణా। విన్నవించెదనొక్కవృత్తాంతమిపుడు॥విజ్ఞాకృపారసముచేమీమునింగినిముట్టి । పెరిగెదనుబలములను ధరియించు।

కొరకు ॥ అఖిలబలములమేనునపురించుకొనినేను । నడచెదనుమీయా
జ్ఞనాతలలనుకొట్టి ॥ బలములన్నియునేనుధరియింపలేనన్న । గన్యమేమి
యులేదుకమలనాభుండ ॥ అనివాయుజుడుబల్క విని రామచంద్రుండు
వరమహర్షంబునను పవనజునకనియె ॥ పవనజయీకార్యభారమంతయునీ
దే। నినునమ్మికార్యముకునేనునడచితిని॥ మరినిదలవుచువాడలుమాటనిక్క
ముగాని । యేయుపాయంబునేనూహింపలేదు ॥ ఇతరబలములనమ్మినే
ననడువగలేదు । నయుమొప్పనీబలమునమ్మినడచితిని ॥ ఎట్లుజరిగించినా
యేరీతినడచినా। నీదికార్యముగానిమాదేమిగాదు ॥ ఎట్లుదాటింతువో
యీబలములన్నిటిని । యెల్లలోకంబులునుయెల్లవార్ధులు॥ అంజనీపు
త్రుండవనమానబలుడవు। నీకులక్ష్యములేదుయేకార్యమైన॥

హనుమ సకలబలములను తనశరీరమునదాల్చుట.



అనిరాఘవుడుబలుకునప్పుడుహనుమంతుండు। పెరిగెబ్రహ్మాండము
లంపిక్కటిల్లగను ॥ తనమోముఆకాశమునుదూసిబ్రహ్మాండ । మునకేగి
బ్రహ్మతోముచ్చటాడగను ॥ తనహస్తములుపూర్వధరణీధరేంద్రంబు ।
హస్త్రాద్రితోవియ్యమందుచుండెనుగ ॥ తనవాలమవలీలతనుచంద్రమండ
లము । మాసిధృవమండలముతోచెలిమిసలుప ॥ తనరోమకూపములు
తగనొప్పెనతుత్ర । పక్షులకుజొజ్జములుపరవునట్లుగను ॥ తనరవానికి
వృత్యుతతులుతల్లడరంగ । నిలచెహనుమంతుండునిఖిలేశుకెదుట॥ భూ

రినక్షత్రములువ్రాసలయ్యెను మొలకు । కమలబంధుడుబొడ్డుఘంటయ్యె
లఘు ॥ ఆరీతిగా నిలచిఅపుడుహనుమంతుండు । దశరథసూనులకుదండ
ములు బెట్టి ॥ ఆరథముతో బట్టిఅవలీల నెత్తుకొని । సీతామహాదేవిశ్రీరా
మవిభుని ॥ తనశిరోమధ్యమునదాల్చెనిద్దరివధూవరులకానందంబుబరిఢ
విల్లగను॥ఘోరమునిదేవతలుపుష్పవర్ష ముగురిసి॥ రావధూవరులపై హను
మంతుపైని॥తనభుజంబులనిలిపెతగభరతలక్ష్మణు। శత్రుఘ్న కుశలవులసం
తోషమునను॥రెండవభుజంబునారీతివిజయాదులను। అర్కపుత్రాదులన
మరనిలిపెనుగా॥ తనశిరంబునభుజంబునబలులనమరించె। శేషించియున్న
ట్టిసేనలన్నిటిని॥ పేరుపేరునబిలచిబీరువోకుండంగ।తనదేహమంతటనుదా
ల్చెఁజలములను॥తనరోమకూపములుఘనవృక్షమూలములు।గాదళంబుల
కెల్లనాధారమయ్యె ॥ మున్నూరుయోజనంబులవెడల్పునుగలిగి । ఆంతె
యెపొడవుయైయఖిలబలములను ॥ హనుమంతుదేహమునసమరియుండె
రిసేన। చెరుకుముక్కకుమూగుచీమలపగిదిని ॥ సకలసేనలనిట్లుసమకొల్పి
దేహమున। భారమేమియులేకపవననందనుడు ॥ ఘనముగజయజయధ్వ
నులుమిన్నంటంగ । భేరీమృదంగములుఘోరుకొనిచెలగ ॥ సూరుడగుసు
షేణుదారిముందరజూప। నడచెహనుమంతుండుపుడమిగంపింప॥ చుక్కల
లోచంద్రుశోభగాఁవెలుఁగొందె । సకలసేనలలోనజానకీవిభుడు ॥ ఎంతపు
ణ్యాత్ముడో యెంతధీరాత్ముడో । యనుచుమింటనుసురలువినుతిసేయగను॥
క్రమక్రమంబునగొప్పవనముతటాకములు । పర్వతంబులుగడచెపవనవం
దనుడు॥ నదులునిధులునుగడచినగరభూములుగడచి । ధీరుండుదేశాది
దేశములుగడచె॥ ఘనసేనభారంబుగణ్యమేమియులేక । దూదికొండవి
ధానతులదూగినడచె॥ ముజ్జగంబులకెల్ల మొగిభయంకరముగా। వీరరూ
పంబుతోవీగుండునడచె॥ హనుమంతుడీరీతినఖిలబలములనెల్ల। తనమేన
నమరించుకొనుచునడువగను ॥ శతకంఠుచారులుజనుదెంచిహనుమంతు

గాంచివిభ్రాంతులై కళవళనుబడిరి ॥ కళవళంబడియుందునిలువజాలగలే
క। ఘనతప్రతాపలంకాపురికి జేరి॥ నవరత్న సింహాసనమునశతకంఠుండు।
నదయుడై కూర్చున్న సమయమందునను॥

చారులు రామునిరాక శతకంఠునికి జెప్పుట.

చారులంతటవానిచరణంబులకు మ్రొక్కి। వెలయునభవారంతవి
నగనిట్లనిరి॥ దనుజకులవర్య సీపనుపువను మేమెల్లను। వార్తలెల్లను దెలసి
వచ్చియుందుదుము ॥ ఏముచందమొగానియీవేళమాకొక్క । విపరీత
చందంబువిఖ్యాతమయ్యె॥ లంకాధిపతియైన రావణాసురుజంపి। జయము
బొందినయట్టిజానకీవరుడు॥ దేవమీతో పోరుగావింపగాదలచి। ప్రళయ
కాలమురుద్రునిగిదివచ్చెనుగ॥ మున్ను కపులబలంబువిన్నార మేగాని॥ వె
లసినప్పటికన్న విస్తారముగను॥ తగనాటికన్న విస్తారంబుగనపడును। బ
లము లెన్న గదుర్లభంబుగానుండు॥ ఆబలంబులబింకమది యేమిటోగాని
జగములన్నిట్రింగజాలినట్లుండు ॥ చుక్కలిన్ననియుని లెక్కసంగగవ
చ్చు। ఇసుకనైనను లెక్కసెన్నగావచ్చు। వానచినుకులనైనవర్ణింపగావ
చ్చు। నారాముబలమెన్నవలవిగాదయ్య॥ అందులోపలనొకడుహను
మంతుడనువాడు। మేరుగిరిచందమునమిన్నుపొడవుగను॥ పెరిగిబలుసేన
నందరినెత్తుకొనివచ్చి। కాలమృత్యువుబోలిఘనుడుహనుమంతు ॥ ఆవా
యుజునకెదురనమరులోపగలేరు। రూపింపమీమదికికోపమొదవునుగ॥
కటకటాబుద్ధిమీకెటుదోచునోగాని। పోరశక్యముగాదువారితో నెవరు॥
ఎవరికగపడకుండ మేమురసివచ్చితిమి। ఘనబలమువిక్రమముగాంభీర్యమె
ల్ల॥ ఉగ్రుండుబలములకుసుగ్రీవుడనువాడు। ఆధిపత్యముమీరిఅలరుచుం
డెనుగ॥ అపుడుసేనలకెల్ల నారామచంద్రుండు। పట్టభద్రుండగుచుప్రబ
లుచుందునుగ॥ తమ్ములిమ్ముగగొల్వతనవధూమణితోను। మెలమితోహ
నుమంతునెక్కివచ్చిరిగ ॥ రామచంద్రునిసుతులు రణరంగధాములై ।

కుశలవులు తండ్రితోఁ గూడి వచ్చిరిగ॥ మనవిభీషణుఁడెల్ల మర్మముల్ దెలుపు చును॥ మనుజవర్యుని మేలు మదిని దలచుచును॥ మిమ్ము దూషించుచును మీ హీను దెలుపుచును। నరవరుని గోపంబు పురికొల్పుకొనుచు॥ వంశాభిమానంబు వదిలి దుర్మార్గుఁడై। రామచంద్రుని గూడి రాదొణంగెనుగ ॥ అదియటుండగ నిమ్ము అత్యద్భుతంబుగా। జనకరాజకుమార్తె జానకీదేవి॥ నీలమేఘముగూడి నెరితీగె మెరుపువలె గోరి నిజవిభునితోఁ గూడి వచ్చెనుగ॥ ఆయింతినను గొప్పనాథ గద్దగి తంబు। ఆమి వారి యొయ్యార మానసతికిదగును ॥ చారులను భయపడగ దూరముగ బోగదిమి। కోపమున దానవుడు కొలువు దిగనాడి॥ అంతఃపురము కేగి అచ్చటికి తన ప్రధా। నులనెల్ల బిలిపించి పలికె రావణుసుడు ॥ రాముడను నొక్క భూరమణుండు నామీద । యుద్ధసన్నద్ధుడై యొందు దెలియకను॥ తమ్ములను పుత్రులను తన వెంట జేర్చుకొని। తరుచర బలమెల్ల తన్ను గొల్వగను॥ మీరియంతింతయని మేర లేకుండంగ। వచ్చుచున్నాడట వగపేమి లేక॥ వారినందరినెల్ల వక్కడే హనుమంతు। తన మేన దాల్చుకొని తర్లి వచ్చెనట॥ మనుజనాథుని కెల్ల మర్మముల్దెలుపుచును। జనుదెంచుచుండె నట మనవిభీషణుండు॥ ఇందు కేమి తెరంగు యేమియాలోచన। చెపుడు నాతో మీరు చెప్పినట్లుగను ॥ కార్యంబునకు నడువగలవాడ నట మీద। చెప్పుడీ నాతోడ శీఘ్రంబుగాను॥ అనిన విని చిరునవ్వుగొని మంత్రివరులెల్ల। పలికిరిట్లుగ దనుజభర్తతో నపుడు॥

మంత్రులు తమపరాక్రమములు జెప్పుట.

యుద్ధమెన్నడు మాకు నోదవునో యనుచును। మామనసు నెప్పుడు మోదమందుదుము॥ మాకోర్కె సమకూడె మనుజనాథునితోడ। కయ్యమొక్కటి జేయగలిగె భాగ్యమున॥ మీరు మెచ్చేలాగు మేము రణమున కేగి। అతిపరాక్రమవిక్రమం తజూపెదము॥ కులద్రోహియైనట్టి ఘోరదుష్టుండైన। మనవిభీషణు బట్టి దునిమి వేయుదుము॥ అతని ముందుగ జంపి ఆవెను

కపిహనుమంతు। బరిమార్చితరువాతబలములనుగూల్చి॥ తనయసహోద
రత్రయము శ్రీరాముని। కడతేర్చివత్తుమీకరుణవచ్చుటకు॥ అతనిభార్య
యైనయాజానకినిదెచ్చి। కానుకిత్తుమునీకుదానవేశ్వరుడ ॥ మమునెరుగ
వామృత్యుమూర్కొన్న జాలుదుము। సమరముకునీకింతసంతాపమేల॥ ఆ
దిశేషునికోరలటుబెరికిదెత్తుము। వుక్కిలింతుముమహాంభోరాసులెల్ల॥ పి
డచేతలోజేతవుడమియాకాశంబు। తప్పటలువేతుముధరణిభీతిలగ॥ మ్రిం
గివత్తుముపోయిమృత్యుదేవతనైన। కూలదన్నుదుముదిక్కుంభికుంభము
ల ॥ బాధించివత్తుమాపవనసూనునిబట్టి । కూలంగవేతుమాకులపర్వత
ములు॥ తృణమురీతినిరాముడునిమియాతనిబలము। సమసిపోజేతుముక్ష
ణములోపలను ॥ వారిసైన్యంబెంతవారినందరిదెచ్చు । మారుతాత్మజ
డెంతమాకుజూడగను ॥ నిజముగామాకొక్కనిముషంబుపనిగాదు । స్వ
ల్పకార్యముకింతసందేహమేల॥ అనిప్రతిజ్ఞలుబలుకుదనమంత్రులనుజూ
చి। సంతోషమునుబొందెశతకంఠుడపుడు॥ భండనాయత్తుడై బలువిక్రవీ
గుచును। భటకోటిరప్పించెప్రౌఢిమీరగను ॥ తనఅగడ్తలురసాతలము
ముట్టగజలము। నింపించెకోపాగ్నినెలకొనంగగను॥ బరువడినితనసవప్రా
కారములయందు। సరదార్లనుంపించెచాలజాగ్రతను ॥ కార్చిచ్చులను
బోలికడువిక్రవీగేటి। దానవులపదికోట్లద్వారకాపుంచె॥ మొగసాలవా
కిటనుతగనూరుకోట్లతో। కాపులుంచెనుస్థూలకంఠదానవుల ॥ తేటగా
నగరువీధిద్వారములయందు। క్రూరదైత్యులనుంచెనూరర్బుదములు॥బ
లములన్నియుమహాతెలివితేటలుగ్రమ్మ । ఘోరముగప్రస్థానభేరివేయిం
చె॥ ఇట్లుజాగ్రతపరచియెల్లదిక్కులయందు । సరదార్లనందరినిసర్ధించు
మనెను॥ భద్రమనుచునుజెప్పిబలుడుశతకంఠుండు। తనతల్లియగుమహాత

శతముఖుడు తల్లితో రామునిరాక జెప్పుట.

రుణీలలామ॥ చిత్రగంధినిజేరిచెలువొప్పతాబలికె। తామసమువిూరంగ

దైత్యనాయకుడు॥ ఓతల్లి వింటివాయొకవార్తయీవేళ। ఆశ్చర్యకరమాయెనంతరంగమున॥ మనరావణాసురునిదునుమాడిపోయెనట। దశరథునికొడుకుసీతారాముడొకడు॥ తనదేవితోగూడితనసోదరులుగొలువ। సకలసేనలతోడసాహసమువెలయ॥ హనుమంతుపైనెక్కియరుదెంచియుండెనట। నాలావెరుంగకనన్నెరుంగకను॥ నరుడువాడననెంతనాతోటిపోరుటకు। కొలదిమెరుగకమేనుక్రొవ్వివచ్చెనుగ॥ కడుచిచ్చుజొరబాఱుమిడుతలపోలికను। ఘోరబాణాగ్నిలోగూలుటెరుగరుగ॥ ఒక్కశరమువనరునిముక్కలించినేనిపుడు। వానిభార్యయైనజానకినితెత్తు॥ మునుపుదశకంఠుండుగొనిపోవుటెరుగడా। యిపుడుసీతనుగూడియేలవచ్చెనుగా॥ తెలియనేరనినరుడుదిక్కుయికతనకేది। పట్టితెచ్చెనువానిప్రారబ్ధమిటకు॥ నాఘోరబాణాగ్నివనిలోనగూలుటకు। బ్రహ్మాస్త్రమైనువానిఫాలమందునను॥ అనుచునీగతికొడుకుతనతోడబలికితే। కటకటాయనిచిత్రగంధితాబలికె॥ ఓరినాతండ్రినీవంటివెంతటిమాట। తల్లిజానకినిట్లుధర్మంబుదప్పి॥ ఆయమ్మలోకమాతనిమాట తెలియక। యెంతపాపపుమాటయిపుడుబలికితివి॥ తలపసామాన్యుడాదశరథరాముడు। ఆదినారాయణుండవతారమూర్తి। మూడుమూర్తులకెల్లమూలమగుదేవుండు। బ్రహ్మాండనాయకుడుభక్తపాలకుడు॥ అతనికినీవార్ధులన్నియనగానెంత। నీపరాక్రమంబెంతనీవనగనెంత॥ కోటిబ్రహ్మాండములుజూరలాడెడుసామి। కడ్డమాయీలాటిఅల్పకార్యములు॥ కమలజునివరములకుగర్వింపపనిగాదు। అతనికడ్డముగావుఆవరములన్ని॥ పురుషవర్గముచేతమరణంబులేకుండ। కోరితివి స్త్రీలచేకోరవైతివిగ॥ అదియిపుడునాగుండెనదలియుండునుపుత్ర। ఆదికారణంబుగానారఘువరుండు॥ జానకినిసతిగూడిజనుదెంచెనాయమ్మ। ఆదిపరంజ్యోతిహాతమార్చునిన్ను॥ నామాటసత్యంబునమ్ముకలహముమాను। మెదరుగాజనిరాఘవేశునశరణొందు॥ కాచునిక్కంబతడుకరుణాసము

ద్రుండు। జగదభిరాముండు జానకీవరుడు ॥ అనితల్లి బలుకంగ నామాట లేమియును। తనయాత్మ బట్టకను దనుజనాయకుడు ॥ రోగిపథ్యాంతము వరుచిలేని చందమున। తల్లిమాటలు యేమితనకు సైపకను ॥ ఆచటనిలువక లేచి అసురబలములు గొల్వ। యుగ్రుడై సమరప్రయత్నమున నుండె ॥ ఆచట శ్రీరఘువరుండఖిలబలములు గొల్వ। పూర్ణచంద్రుని పోల్కి పొలుపొందుచుండె॥ పొందుమీరగ వాయునందనుని శిరముపై । తేజరిల్లెను దశరథేశ్వరునిసుతుడు॥ హనుమంతుడంతంత నఖిలభూములుగడచి । చెలువొగా క్షీరాబ్ధిచెంత జేరెనుగ॥ అఖిలబలముల మేననమరశైలమురీతి। నిలచె నాదుగ్ధాంబునిధిచెంతనపుడు ॥ తనకునడ్డంబైన ఘనసముద్రము జూచి। బలముతో లంఘింపపనిగాదుయనుచు॥

హనుమంతుడు సేనలను తోకమీదను
పాలసంద్రమును దాటుట.

శరధిపై వాలంబు బరపి సకలబలంబు। దానిపై నడిపింపదలచి తానపుడు॥ తనశిరముపై వెలుగు దశరథరాముని। జనకతనయను యిద్దరి నివధూవరుల॥ తగరథము తోడించి తనభుజములందున్న । భరతలక్ష్మణుల చేబట్టిదించెనుగ॥ శత్రుఘ్నకుశలవులసరసతో సుగ్రీవ। అంగదాదులనెల్లనవనిదించెనుగ॥ తనదేహమున వెలయుఘనబలంబులనెల్ల। పట్టిదించెనుచాలభద్రంబుతోడ॥ అఖిలబలములనెల్లనబ్ధివద్దునదించి। అఖిలేశునకుమ్రొక్కి హనుమంతుడపుడు ॥ కరయుగంబులు మోడ్చి కడుభక్తినిలువంగ। గని జానకీవరుడు కరుణారసమున ॥ పవనజా నీవంటి పరమబంధుడు నాకు। వెలయలోకమునందు వెదకినాలేదు ॥ ఏమియిచ్చిన తీరునింపారనీ ఋణము। దీవింతు వర్ధిల్లు దివ్యకీర్తులను ॥ అనుచుపతి బలుకంగ నపుడు సీతాదేవి। హనుమంతు వీక్షించి అప్పుడిట్లనియె ॥ అన్న పవనజ నీమహాత్మ్యంబు వర్ణింప। తరమె యెవ్వరికి నీధరణిలోపలను॥ ఆవేళ రావణుండాశోకవనమం

దు। కఠినదైత్యస్త్రీలకాపునాకుంచి ॥ బాధగావింపంగపతిని బాసినయ
ట్టి దుఃఖంబుతో నేనుదూలియుండగను ॥ అట్టిసమయమున నీవరుదెంచి
శ్రీరాము। జయమునాతో జెప్పిజీవనమునిల్పి ॥ రావణునిదరికేగిరామచం
ద్రుడునిన్ను। బరిమార్చుతాడనుచుప్రజ్ఞ బలికితివి ॥ మరలరఘువరునకు
మార్గమంతయుజెప్పి। కడువేగవారాశిగట్టించినావు॥ దశకంఠుమొదలై
నదానవులజంపించి। జనవరుని చేవిభీషణుబ్రోవజేసి॥ నన్నునావిభుగూర్చి
నావన్న నీవంటిబరమబంధుడుమాకుధరణిలోగలడ ॥ అనుచుజానకిబలు
కనావాయునందనుడు। కడుమోదమునుబొందిఘనుడుతాబలికె॥ అవివే
కిమర్కటుండనునన్ను పలుమారు। వినుతిసేయగదగునఘనులుమీరిట్లు॥
మీమహిమచేగదామేలుబొందితినేను। సర్వకార్యములందుజగతిలోప
లను॥ మీయాజ్ఞతలనుంచిమీయనుమతినియెంత పనియైననేసాధ్యపర
చజాలుదును॥ ఇపుడుమీశలవంగియెల్లసేనావళుల। వాలముననడిపింతు
వారధులుదాటి॥ చతురంబుధులుదాటిచెలగివాలంబుపై। నడిపింతుబ
లుసేనగడిచిపోవుటకు॥ ఇందుకేమియుమీరుసందేహపడవద్దు। చూడు
మాతల్లిరో చోద్యంబుగాను॥ అనిపల్కిహనుమంతుడావధూవరులకు॥బ
ణమిల్లియాజ్ఞగైకొనిభక్తినిలచె॥ అపుడుకపులెల్లహాహాకారములుసేయ।
చెలగిదేవతులుపువ్వులవానగురియ॥ మిన్నుముట్టంగతనమేనునంతటబెం
చి। బలువైనతనప్రభావంబువెలయగను॥ ఘోరివాలముదుగ్ధవారాశిపై
జూపి। అంతకంతకులావుఅధికమైచెలగె॥ పొడవులతోమడనిడుపునూతా
మడ। పెంచితనవాలంబుబీలంబువెలయ ॥ ఘనవాలమునుబెంచిగదచేత
తాబూని। కనకమేరువుభోలిఘనుడుహనుమంతు॥ నింగిపొడవుననిలిచెని
ఖిలబలములనెల్ల। కదలినడువుడియనుచుకడుఘోరమునను ॥ పెద్దకేక
లువేయప్రియముతో శ్రీరాము। జానకీముగములక్ష్మణుమొగముజూచి॥
కనుగొంటిరామీరుహనుమదావ్వాయుమహిమ । యెంతబలవంతుడో

యీమహోత్సవాలుడు॥ ఈశ్వరసమానుండుయీపుణ్యచరితుండు । ఇతని
మహిమ మెఱుఁగనెవ్వారితరము॥ అనుచుపలుమారునాతనిప్రభావంబెల్ల।
వినుతిగావింపుచునువిశ్వనాయకుడు॥ పతివధూమణిగూడిహితమతితోన
డచె। వెనకభరతుండులక్ష్మణుడునడచిరిగ॥ ఆవెనుకశత్రుఘ్నుడావిజయు
డునడచె। నావెనుకసుగ్రీవుడంగదుడునడచె ॥ తరువాతజాంబవంతా
దులునుశేనయును। నయమొప్పనడచిరానందములువెలయ॥ జయజయ
ధ్వనులతోఁ జెలగుచునడచిరి। సకలబలములుమిగులసంతోషమునను॥
సకలసేనలుమహాసంతోషభరితులై। వాలంబుపైనడచివక్కఁ పెట్టునను॥
జనుచుకొందరుగుశేలునసముద్రముకురికి। అరసిజలములుజల్లుకొనుచు
కొందరును॥ గగనవీధికిగొందరెగసిపక్షులరీతి। మొగిచిపత్తురుకొందరగ
చరావళులు॥ వాలంబుపైనుండివారధికిలంఘించి। యీదులాడుచుప
త్తురిలమిగొందరును। కొందరేగిరిపెక్కుచందములవెలయుచు। హను
మంతుబాగడుచునందునాడుచును॥ కొందరరిగిరిచాలకోలాహలంబుగా।
శంకేమిలేకనిశ్శంకతోడుతను॥ ఆరీతిగాసేనలందరునునడువంగ। పరమ
హర్షమునొందిపద్మలోచనుడు॥ సీతాసతికిజూపెశ్రీరామచంద్రుండు। సా
గరములోనున్నజలచరంబులను ॥ కర్ణాటకంబులురచ్చకంబులుచాల।
జూపించెజానకీచోద్యమొందగను॥ ఇట్లుజూపించుచునుయెల్లసేనలునడు
వ। శ్రీరామచంద్రుండుజగతిరక్షకుడు॥ క్షీరవారధివద్దజేరినిల్వగసకలబ
లములన్నియువద్దపైనిలచిరపుడు ॥ సకలరాజేంద్రులునుసకలరాక్షసబ
లము। గంధసింధురఘోటరథచక్రములను ॥ అఖిలబలములుజేరెనాం
జనేయులుదక్క। దేవతానీకములుదీవనలుజేయ ॥ బలములన్నియులో
కపైదర్లిపోవంగ। నతిసంభ్రమమునొందెనంజనీసుతుడు॥ తానుయెప్పటి
రీతితనవాలమంతయును। క్రమ్మరదీసుకొనికడుసాహసమున.॥ పరమహర్ష
ముననొకగిరిశృంగముననిల్పి। రామరామాయనుచురంజిల్లుకొనుచు॥ మొ

గముమీఁదికినత్తిమోముతోఁబిగియించి। సరిపాదములునిల్పితరుచరవ
రుఁడిదు॥ బాహులూయ్యనమాపిబలు కేకవడివేసి। పర్వతమువణుకంగపవ
నజుఁడురొయిగాసె॥ ఎగసిబలువడిదాఁటెనెలమితోఁక్షీరాబ్ధి। బలురెక్కలున్న
సురపర్వతమురీతి॥ పాలసంద్రముదాటిపవనజుండేతేర। ఎదురేగివనచరు
లుయెల్ల వేడుకను॥ తనకెదురుగనువచ్చువనచరానీకముల। కౌంగిలినిబం
ధించెఘనుడుహనుమంతు॥ శ్రీరామచంద్రులకుసీతకునుబ్రణమిల్లి। బలు
నుతుల్ గావించిభక్తివెలయగను॥ కరయుగంబులుమోడ్చితరుచరుడు
నిలువంగ। అత్యంతకృపజేసియాదరించిరిగ॥ శ్రీరామచంద్రుండుసీతామ
హాదేవి। పలుమారుదీవించెపవననందనుని॥ అఖిలబలములనెల్లనలసట
లుదీరంగ। నిఖిలేశుడచ్చోటనిలచెనవ్వేళ॥ ఆవేళచటనిలచిఆమరుచటి
రోజు। నేతిసంద్రంబపుడునేర్పుతోఁదాటె॥ అరయమూడవనాడు పెరుగు
సముద్రముదాటి। రెల్లసేనలుచాలయుల్లాసమునను॥ ఘనుడునాల్గవనా
డుకల్లుసముద్రముదాటి। క్రమముగానపుడిట్లుకమలలోచనుడు॥ పవనజ
నివాలంబుపైనాల్గుసంద్రములు। యెలమిమీరగనడచెఇనకులేశ్వరుడు॥
అఖిలసైన్యములతోనచ్చోటనిలువంగ। పరగతొల్లింటివలెపవననంద
నుడు॥ ఆమూడువారాసులవలీలగసుదాటి। జానకీరామునకుజేరిప్రణమి
ల్లి॥ రథముతోజానకీరాములనుముందుగా। తనశిరముజేర్చుకొనితాను
వేగమున॥ ఆరాముసోదరులుఆపుత్రపౌత్రులును। తపనపుత్రుడుమొద
లుకపిబలమునంత॥ తొల్లింటిరీతిగానెల్లసేనలనపుడు। తనమేనదాల్చు
కొనితరుచరోత్తముడు॥ మేరుశైలమురీతిమీరుచునుముందుగా। గని
యెప్రతాపలంకాపట్టణంబు॥

రాముడు ప్రతాపలంకఁ బ్రవేశించుట.

శ్రీరామచంద్రుండుసీతామహాలక్ష్మి। అఖిలబలములుగనిరిలను
రేశుపురము॥ గగనంబుపొడవుగాగలవుమేలిమిపసిడి। కోటలునుతొమ్మి

డిసేటుమీరగను॥ ఘనముగవాళయుప్రాకారములుతొమ్మిది। జలపూర్ణ
ముగనగడ్తలుతొమ్మిదుండు॥ ధర్మనిర్మితమైనబలుగోపురంబులు। గజర
థభటతురంగాంధోళికములు॥ లంకాపురముకంటెలావణ్యమైనది॥ లం
కాపురంబనుచురామభూవరుడు। ఆశ్చర్యమానసుండై పురముదరిడాసి॥
వనచరేంద్రునిజూచితనుయిట్టులనియె॥ అసురపట్నముచేరువయ్యె నీవి
చోచ్చేట॥ నిలచిదించగవలెనుబలములన్నియును॥ అనిరాముబలుకంగన
దుగుదాటకనిలచి॥ పాహినారాయణాపరమాత్మయనుచు॥ రథముతో
ముందుగారామభూపాలూని। జనకపుత్రినిదించెఘనభక్తివెలయ॥ తన
భుజములందున్నఘనభుజాలనందరిని। పట్టిదించెనుచాలభద్రంబుగాను॥క
డువిశాలస్థలముగనిదేహమందున్న। నిఖిలబలములనెల్లనియమించెనచ
ట॥ ఘనుడురాముకుప్రదక్షిణపూర్వకంబుగా। ప్రణమిల్లితానిలచెపవన
నందనుడు॥ సకలభూములయందుసకలదిక్కులయందు। వెలసెబలము
లుచాలవిఖ్యాతిమీర॥ సకలబలములుయిట్లుశతకంఠుపురిడాసి॥ భేరీమృ
దంగములుబోరుకలరంగ॥ ప్రణవఢక్కాశంఖబహుతూర్యనాదములు।
ఒక్కరీతినిమ్రోసెనుజ్వాలంబుగను॥ చదలుముట్టగపశిడిజండాలుయెత్తి
రి॥ వేలాములోపలనువేలకొలదిగను॥ వనచరభల్లూకమనుజదానవబల
ము। తమకుదగుచోటులనుతగనిలిపిరపుడు॥ అలవిభీషణసుగ్రీవాంగద
ముఖ్యులు। రాముబరివేష్టించిప్రేమనుండిరిగ॥ సరసముగలక్ష్మణభరత
శత్రుఘ్నులు। కుశలవులువిజయుండుకొమరుమీరుచును॥ జానకీసహితు
డౌమానవనాయకుని। యెలమిబరివేష్టించికొలచియుండిరిగ॥ అసురనా
థునిపట్నమపుడుముట్టడివేయ। నాత్మలోనూహించెనరనాథుడపుడు॥ సు
గ్రీవయంగదసుషేణజాంబవ॥ హనుమద్విభీషణులయనుమతంబునను॥బ
లరినొకరినిబిలచివరుసతోశలవిచ్చె। కరుణాసముద్రుండు ఘనుడుశ్రీరా
ము॥దక్షిణద్వారమునదక్షిణేశునిరీక్ష।బలములక్షలుగొల్వబరిధవిల్లగను॥

పురముమై టపసనెక్కసురవై రిరాకుండ। చలముతోఁ దుంటనీవృవిలువృమా ఘునుచు॥ కంతమాలికయిచ్చికడుగౌరవము జేసి। అంగదునిబనిపించెనా రాముడపుడు॥ భల్లూకసేనయునుపదివేలుగొలువంగ। నసురకోటులనిం డవలయునుద్ధతిని॥ పడమరవై పుభద్రంబుగామందుమని। జాంబవంతుని బంపెజానకీవరుడు॥ అగచరోత్తములునూరర్భుదంబులుగొలువ। భయ దరాక్షసకబంధముభీతికొనగ॥ తూర్పుదిశనుండుమని నేర్పుతోఁ గోముఖ పనసవృషభులనంపెబలుడుశ్రీరాము॥ ఆమిగిలియున్నట్టి అఖిలబలముల తోడ। కడువైరిబృందములుకలువరింపగను॥ ఉత్తరమువై పునానుండు మనిశలవిచ్చె। సుగ్రీవునంపిబంపెసుజనరక్షకుఁడు॥ కడువిభీషణుపొందుగ నికోటకొమ్మలను। నిలచియుండుమటంచుబలికెరాఘవుడు॥ పురికోల్పియ ల్లవానరులగావప్రధాన। చయములనియమించెజానకీవరుడు॥ చెప్పన్న దేశాదిజననాయకులబిలచి। బలములల్పముచోటనిలుమంచుబలికె॥ ఆ రాముశలవొందిఅఖిలజనములుగదిలి। శలవుప్రకారంబుజెందియుండిరి గ॥ గొల్లుమనిదానవునికోటముట్టడివేసి। లగ్గకెక్కదొణంగెనగ్గజంబుగ ను॥ కోటకొమ్మలుబట్టికూలంగవేసిరి। ప్రాకారములునేలపాలుజేసిరిగ॥ జలములేమియుయగడ్డైలులోనలేకుండ। పౌరుషవంతులై పారజల్లిరిగా॥ కోటతలుపులుబట్టికూలంగదన్నిరి। పంటపైరులనేలపాలుజేసిరిగ॥ కడు తటాకములెల్లఖండితంబుగజేసి। యెల్లవృక్షావళులుపెల్లగించిరిగ॥ పర వీరగర్భములుపగులంగనార్చిరి। లగ్గకెక్కుచుచాలలావణ్యులగుచు॥ ఆ సమయమునరాముడావిభీషణుజూచి। అతనియనుమతముగాహనుమం

ఆంజనేయుని రాయభారమునకు బంపుట.

తుబిలచి॥ పరమపావనపుణ్యలావణ్యగుణగణ్య। వాయునందననీదువర కృపాంబుధిని॥ సేనలనుమమ్ములనుజేర్చినావిచ్చటికి। తగనిపనులన్నిదిగ్జ యమాయెమాకు॥ నిటుమీదికార్యంబులేరీతిగానైన। సాధ్యమొనరిం

చెదనునందేహామేల॥ శతకంఠుమనసులోచందంబుమనపైని। యేరీతిను
న్నదోయెరుగరాదయ్య॥ తెలియకుండగవారిబాలియింపగారాదు । గు
ననులోనంగతికనుగొనగవలయు ॥ రాయభారముదెలిసి రావయ్యపోవ
య్య। నీవల్లకార్యములునెరవేరవలెను ॥ ఎల్లిపుష్యమియాత్రకేగుటకు
మంచిది । జయముచేకూడునుసిద్ధముగనమ్ము ॥ జయముగానీపేరచంద్ర
తారాబలము। గలిగియున్నదియిపుడుకదువేగజనుము॥ శతకంధరునిగాం
చిఅతనిమతముగ్రహించి। మనరాకయెఱిగించిమార్గమొనరించి ॥ వనజ
సంభవుడిచ్చువరములకుతనమదిని । గర్వించవద్దనుచుఖండితముచెపుమ॥
పోరినాచేగూలిపోయిరావణకుంభ। కర్ణులవిధంబెల్లగనియుండుమనుమి॥
జగతిపురుషులచేతచావులేకుండంగ। తగవరముగొంటివనితాబలికితేను॥
జానకీదేవితోజనుదెంచినామన్న। వార్తదెలిసుండమనవయ్యకపినాథ॥వె
రపుమదిలోబుట్టిశరణుతాజొచ్చితే। రక్షింతుమనిచెప్పరాక్షసేశ్వరుని॥
శరణుజొచ్చినవెనుకధరణీసురలకుబాధ । జేయుటకుసైపసనిచెప్పుముం
డుగను॥ జాగుసేయకవేగజనివారిచందంబు। గనివేగరమ్మనుచుఘనుడిట్లు
పలికె॥ హనుమంతుబలవంతునధికవిద్యావంతు। ధనవంతుగుణవంతుత
గనీతివంతు॥ ప్రణమిల్లిరామునకుబహువిధంబులమ్రొక్కి। దీవనలుతా
బొందిధీరుడైయపుడు॥ అచ్చటనువీడుకొనిఅర్కపుత్రునిగాంచి । శ్రీరా
మచంద్రుండుశలవిచ్చుగతులు॥ సర్వమతనికిజెప్పిసకలబలములచాలు జ
యజయధ్వనిసేయశలవుగైకొనుచు॥ ఘనతప్రతాపలంకాపట్టణముజేరి।
ఆకోటపైభవంబంతబాడగాంచె ॥ ద్వారకావలినున్నదనుజావళులనెల్ల।
బరికించిఅందులోపలగానరాక॥ కోటలంగళ్లనుకొమరొప్పగావిడిచి। త
నమహోన్నతరూపుదానపుడుదాల్చి॥ తనమహాకారంబుగనివెరచురా
క్షసులు। జూచినవ్వుచుమదినిచోద్యమందుచును ॥ అరయవచ్చేవారలను
హుంకరింపుచును। వీరులనుగొందరినివెరపించుకొనుచు ॥ చనిపట్టణము

జొచ్చిఘనవైభవం బెల్ల। నావిలాసంబంతనాత్మ నూహించి ॥ ఆమహో
న్నతపదవినాభోగభాగ్యంబు । లావైభవములన్ని ఆరసిశోధించి ॥ దేవ
నాయకుబోలిధీరుడై యీతండు । యీలాటిపట్నంబు నేలుకొనియుండె॥
తనులజూచితిలంక ఘనవిలాసములన్ని। అరయనీపురిసహస్రాంశమునులే
దు॥ ఇతడెంతధన్యుడో యితడెంతపుణ్యుడో । కాకున్న యబ్బునే ఘనవై
భవములు॥ కలిమిగలిగినకొద్దిగలుగవలెనుగుణములు। పురువడిగియుండ
దరుయుత్తమోత్తములు ॥ ఘనతగలిగినచోటవినయంబుభూషణము।
ఆదితలంపకయున్న హానివచ్చునుగ॥ కటకటాయీభాగ్యగరిమచెడిపోవు
టకు। నేలబుట్టెనుదనుజకీలాటిబుద్ధి ॥ విభవమెల్లనుయనుభవించడాయె
నుగదా। చెడుబుద్ధిదలుచుకొనిబలుదురక్కసుడు ॥ దుఃఖితబుద్ధులుయేల
దోచెనీదనుజునకు । అయ్యయోయనుచు తానరుగుచుండగను ॥ తనకు
ముందరమహోతనివిజెన్నొందుచును । గగనంబుపొడవునా ఘనతమీరు
చును ॥ నూరుశిరములునుయిన్నూరుచేతులుగలిగి । ఘనముగామిన్ను
ముట్టినపొడవుగలిగి॥ గరుడకిన్నరయక్ష గంధర్వకింపురుష। సురసిద్ధులను
బారదరిమేటిజయము ॥ ఘనతలాటంబుతాఘూటంబుగాద్రొక్కి । గ
ర్వాంధుడై కళ్ళుగానకుండగను ॥ చెరలుబట్టెను దేవసతులు కన్నులుబా
ష్ప। కణములొలుకగ నేమికనికరము లేక ॥ తగుపనులు జెప్పుచునుతనప్ర
ధానులుతాను। కొలువున్నశతముఖునిగురుతెల్లగాంచి॥ అత్యద్భుతంబం
దియతనిధైర్యస్థైర్య। ములుగాంచిహనుమంతుజాలమితోడుతను ॥ అ
తిధైర్యగాంభీర్యశాలియైదనుజుదరిడాసి।అతనికినెదురుగాహనుమదాహ్వయు
డు॥ తివిరితనవాలంబుదివిసోకగాజుట్టి । ఆదానవునికంటెనధికపొడవున
ను॥ కుదురుగాగూర్చుండికోరిదనుజునివైపు । చూచిచూడనియట్లుచూ
చితానుండె॥ భీకరాకారముననాకసముపొడవున। దనుజునకునెదురుగా
తానుగూర్చుండె ॥ అపుడుశతకంధరుడుఆమహాత్మునిమహా । కారంబునీ

తించిరకదుభయాంబోదవి॥ ఆశ్చర్యమునుశోషిమభీమానమునుశౌర్యమూ త్మలోనూహించియుండిట్టులనియె ॥ ఏమిరావానరాయేలాగువచ్చితివి। ప్రాకారములుదాటిభయమేమిలేద॥ దాటివచ్చుటగాకతప్పకనునాయ డుట। నిలచుటకునీగుండెనిలచెనేరీతి ॥ ఎవ్వడునినుబంపెనేలాగువచ్చితి వి। యెవరునీపేరునీవెవరిపుత్రుడవు॥ ఎవడునీకీరూపుయింపారగానిచ్చె। నే మార్గమునసీవుయిటకువచ్చితివి॥ ఇచ్చటదానవులుహింసింతురెకనన్ను। బాధకోర్వగలేవుపారిపోరోరి॥ ఎవ్వడునినుబంపెనవరిగొల్తువునీవు। చె ప్పరానాతోనుశిక్షింబుగాను ॥ నేనిటుబిలచితేనీవటుజూచేవు। గర్వ మానీకింతగడునుతనమటరా॥ కోతిముండాకొడకగురుతుతెలియకనీవు। వచ్చితివినీకర్మవశముదప్పకను॥ ఇకనెందుబోయెదవుయేతెరవునీకికను। నీకుదిక్కెవ్వండునిన్నుజంపెదను ॥ పట్టితెచ్చినవినిప్రారబ్ధమిచ్చుటికి। క ర్మవశమునసీవుగదలలేవికను॥ మదమత్సరముచేతమాటలాడెదవేమి। క ళ్ళగానకనోరికవికులాధముడ॥ అనిరాక్షసుడుబలుకనతిమహాశూరుడగు। మరునందనుడుశంకమదినేమిలేక ॥ నీచరాక్షసువైపుచూచిచూడకమది ని। రాకరింపుచుబలికెభీకరంబుగను ॥ ఓరిదనుజాధమావోరియధమాంధ మా। వినరోరిశ్రీరామవిభునిచందంబు॥ ఎరుగవానీసహోదరునిరావణు శిరము। లవనిపైబడగూల్చునతులప్రతాపు॥ కుంభకర్ణునిబట్టికూలనేసిన యట్టి। మహానీయునెరుంగవామంకురాక్షసుడ ॥ ఇంద్రజిత్తునుబట్టియిల నుగూల్చినయట్టి। ఘనభుజానెరుగవాకపటదానవుడ॥ ముందుగాశూర్ప నఖముక్కుచెవులునుగోసె। పరగపుణ్యచరిత్రునెరుగవానీవు॥ ఘనవిభీష ణకులంకాపట్టణముగట్టి। తొలమిబొందినరాము నెరుగవానీవు॥

హనుమ తన్ను శతకంఠున కెరింగించుట.

ఖరదూషణాదిముఖ్యరరాక్షసులనెల్ల। బరిమార్చినాసామినె రుగవానీవు॥ అట్టిమహానీయునకునతిపుణ్యచరితునకు। బంటునౌదునునే

నుపలుమాటలేల॥ వాయుదేవుడుతండ్రివర్ణింపనాతల్లి । అంజనీదేవిరా
యకనిలోపలను॥ హనుమంతునాపేరుయనురుడావిదునేను।శ్రీరాముగొ
ల్తురాజయముబొందుటకు॥ లంకకనుగుచునధికలాఘవముదీపింప । కడ
లిదాటితినొక్కకాల్వచందమున ॥ వనముల్లపెరికి రావణాకుమారునియ
త్తు। నుక్కణగించితినియొక్కనిముషమున। దశకంఠుపురమెల్లదగ్ధంబు
జేసితిని। దివిజాలందరునన్నుదీవనలుసేయ॥ లంకిణినిబట్టుకొనిలావల్లదూ
లించి। నేలగలిపితినొక్కనిముషమాత్రమున॥ తిరిగిసముద్రముదాటితిరు
గిజానకిజయముమై వెలయంగశ్రీరామువిభునకెరిగిస్తి॥ ఇవుడునీచందంబు
యావత్తుదెలియంగ। జూచిపోవస్తిరానీచదానవుడ॥ సేవలన్నిటినినామీ
నధరియించుకొని। వస్తినిన్నటిరోజువరకునిచ్చటికి॥ సాగరంబునాల్గునక
లబలములనెల్ల। వాలమునదాటిస్తివసుసమీరగను ॥ శ్రీరామచంద్రుం
డుజానకీసహితుడై। జనుదెంచెనినుబట్టిదునుమాడుకొరకు॥ బలిమార్చ
నికనిన్నుమరినీకుదిక్కెవడు। ఓరిదుర్మార్గుడాఓరిపాపాత్మా ॥ నీకులమునీ
బలమునీవునిర్మూలమై। కూలిపోయేయంత్యకాలంబువచ్చె ॥ బుర్రలోక
పదిపదులునమ్రాడగలిగెనని। విర్రవీగకురోరివెర్రిరాక్షసుడ॥ క్రొవ్వుమీ
రినగొప్పకొండదాగితే। కోదువేమివచ్చునాకొండకేమైన ॥ జగదీశురా
ముతోపగనీవుజెందితే। హానినీకేగానిఅతనికేమౌను ॥ ఎనుపోతుమదగ
జమునెదిరించినట్టుగా। శ్రీరాముతోనీవుపోరుకోలిపితివి॥

ఆంజనేయులు శతకంఠునికి నీతులు జెప్పుట.

నీమకర్మవశంబునీకిట్టిదుర్బుద్ధి। గావించెనదిరోరికలుషదానవుడ॥
వెఱ్ఱిచేష్టలుమానివినరోరినామాట। చెడిపోయెదవురోరిబడగురక్కసుడ॥
నీభాగ్యగరిమంబునిండారగానాదు। కనులజూడగచాలకనికరంబొదవె॥
కడుభాగ్యమదియేలచెడగొట్టుకుంటావు। ప్రాణభంగంబేలపరచుకుంటా
వు॥ వద్దునామాటవిను వైరంబునీకేల।నిశాచరేశ పతనేమటనిలునా తేమ॥

నీకోటలన నెంత నీపేటలన నెంత । నీమాటలన నెంత నీవనగ నెంత ॥ నిము
షంబుపనిగాదు మిథిలవల్లభదైవ । శ్రీరామచంద్రునకు జగదీశునకును ॥ నీ
వారలై నట్టి రాక్షసాసురముఖ్య । లీసు లందరు గూలు టది మొరుగవటరా ॥
కొలది మొరుగక తమక్రొవ్వ శ్రీరాములతో । కయ్యంబు కదిరించి కాలు
ద్రువ్వదువు ॥ పరమపాపాత్ముడవు దురితవర్తివి నీవు । నరవరుని చేనీకు మర
ణంబు నిజము ॥ ఆదిదేవుడు దేవతారాధ్యుడనఘాత్ము । శ్రీరాములకు నింద
జేసెదవు నీవు ॥ నిమ్నగమనగానరాదు నిజముగా దోషంబు । వచ్చు నిను గను
గొన్న దుష్పుత్రుండ ॥ నెరయ నీకొక బుద్ధి నేనిపుడు జెప్పెదను । భావించి
చూడ తావలు విధంబులను ॥ నీవు యొకపోతేవు నిజముగా శ్రీరాము । గవిని
వాలుగుకట్లు కట్టించినాడు ॥ గట్టిగ నీనగరు చుట్టు ముట్టడి వేసి । యున్నాడు
రౌద్రంబులుప్పతిల్లుచును ॥ నను బిలిచి నీకొక్క మనములో భావంబు । తే
రితిమన్న వోయురి గిరమ్మనెను ॥ ఆ వెనుక కార్యంబులన్ని చక్కగ జేతు । నని
వాకుశలవిచ్చె నా రామవిభుడు ॥ పురుషవర్గంబు చే మరణంబు లేదనుచు । క
మలజా వివరములకు గర్వించబోకు ॥ సీతాసమేతుడై శ్రీరామచంద్రుండు । జ
నుదెంచు మాట నీ మనమునెరిగుంచు ॥ నిను వధించక గాని నిజముగా తన పురి
కి । వెళ్ళడ వప్యంబు వేయు నింకేల ॥ అమరభోగములన్ని అనుభవించుమటం
చు । నీకెరిగించుమనె లోకనాయకుడు ॥ నీ బంధుమిత్రులను నిజముగా రప్పిం
చి । చాలయిష్టాగోష్ఠి సలుపుమీ వేళ ॥ ఆశ్రితులకందరికి నతికరుణ రంజిల్ల ।
కలభాగ్యములతోడ నిలుజార బెట్టి ॥ పుత్రపౌత్రాదులకు భూషణావళుల నె
ల్ల । ముస్తాబు జేయించు మోదంబుగాను ॥ షడ్రసోపేతాన్న సంభోక్తము
లు జేసి । సుఖియించుమా వెనుక సుఖమెట్లు గలుగు ॥ నీదు భార్యాపరమసా
ధుమానావతితో । నంత్యకాలపు భోగమందుమీరాత్రి ॥ దొడ్డయిల్లాలా
మెతో జెప్పివైధవ్య । మొందికల కాలంబు వర్ధిల్లుమనుచు ॥ తల్లితో నీసుతు
నియిల్లడలుగాపించు । నిల్లుబాకలియూశయూనత్తు విడుమ ॥ బయలుదేరు

ముతిరిగిబ్రతికివచ్చేదేమి। లేదుకనికారంబురాదుమూకికను॥ అనియెరిం గింపుమనిఘనరామచంద్రుండు। తెలవుచొప్పున నేనుజనుదెంచితిటకు॥ కరుణాసముద్రుండుకనికరమురంజిల్ల। తిరుగనన్నుబిలిచిమరిజెప్పుమని॥ అన్నివిధములనీకుతిన్నగాజెప్పుమని॥ పరమపుణ్యాత్ముండుభక్తపాలకుడు॥ ఆదినారాయణుండతనిశరణంటివా। వైభవోన్నతిబొందివర్ధిల్లగలవు॥ ఇటుమీదమునిబాధలేకాలమునసైన। గావించితేనిన్నుకాచేదిలేదు॥ అతనుజెప్పినమాటలన్నియువినసత్యంబు। ఆడితప్పనివాడుఆమహారాజ॥ వచ్చితినినీకుఆవార్తలటుజెప్పితిని। యీతుచ్ఛరాక్షసులనికనమ్మబోకు॥ వరుడుగాడతడాదినారాయణస్వామి। కాచునికఠంబతడుకరుణించునిన్ను॥ వైరంబువర్జించుశ్రీరాముకడకేరు। బ్రతుకుపూర్ణాయువనుభద్రముగనీవు॥ బ్రతుకుకైనీమదికిభ్రాంతిలేకుండినను। సంగరంబునకరుగుచావుసిద్ధంబు॥ పురుషులచేచావుబొందననినీకుంటె। జానకివచ్చినజాడమెరిగుండు॥ వేళ్లతోనిన్నునిర్మూలంబుజేయును। అదియెరిగివర్తించుమసురపుంగవుడ॥ మహిలోనుశ్రీరామమహిమప్రభావంబు। తెలియగవలెనంటెతెలియజెప్పితిని॥ స్థిరముగనీతల్లిచిత్రగంధినియడుగు। అమ్మహాదేవిచేనఖిలంబుదెలసి॥ జానకీదేవిచేసిద్ధంబునీచావు। అనియనేకప్రకారములహనుమంతు॥ తెలియజెప్పినగానితెలియకనువులికిపడి॥ ఉగ్రుడైప్రళయకాలాగ్నిచందమున॥

శతకంఠుడు రామునిదూరుట.

చలమునసుదనుజుండు చాలగాకోపించి। హనుమంతుజంపుటకునాత్మనూహించె॥ తగదూతజంపుటకుధర్మంబుగాదనుచు। మదిలోనకోపంబుమానితానపుడు॥ ఆస్థానమునదైత్యులద్భుతంబునుబొంది।వినుచుండసిట్లనియెవికృతరాక్షసుడు॥ ఓరిమర్కటనీవుసారెసారెకునాతో। శ్రీరాములనిచాలజెప్పెవునీవు॥ మనుజకులాధమునిమరిమరియునాతోడ। విన

తులానదిం జెదవు వెఱ్ఱితనమునను ॥ మనుజాతముడు హీనమానవుడునా
తోడ! నోర నెంతటివాడువుడమిలోపలను॥ వాడు జేసినపనులువొక్కడే
నాఘటుడు! శలవిస్తినేసురాత్మగాములోపలను ॥ క్షుద్రమానవునధికను
జ్ఞానవంతుడని! ప్రేలెదవునాయెదుటప్రల్లదనమునను॥ వానిసన్మార్గములు
నే నెరుంగననాకు! మబ్బుబెట్టుచువానిమాట జెప్పెదవు ॥ తానుపిన్నప్పు
డేధర్మంబు దెలియకను! చెలగి తాటకిజంపి స్త్రీహత్యగానెను॥ పరమదు
ర్మార్గుడై హరువిల్లుఖండించి! ఇలమహాదేవునకుయెగ్గుజేసెనుగ॥ తనసతిని
రావణదనుజుండు చెరగొన్న! నెరివాలిజంపెనునిష్కారణముగ॥ హీనకు
లురాలవశనింగితంబెరుగక! శబరియెంగిలిపళ్లుచవిజూచితినెను॥ మాయా
మృగంబనుచుమారీచుడేగగా! గనిజాలగాలేకజనెవానివెంట ॥ రణము
లోపలమూర్ఛగొనినలక్ష్మణుజూచి! చింతించెతానొక్కజనునిచందము
న॥ అట్టి స్త్రీహంతకుండట్టిస్వామిద్రోహి! అట్టియజ్ఞానుండుఅఖిలేశుడట
రా॥ చెప్పనేమున్నదిచెప్పెదవునాయెదుట! సిగ్గుమాలినవానిచేష్టలన్ని
యును॥ ఆదివిరాట్పురుషుడతడై తెసీలాటి ! అల్పపనులకునెట్లుఆలాయ
పడెను॥ నీకతడుదొరయనుచునెరివానిబొగడితివి ! పొగడినంతటరాదు
పూజ్యమెవ్వరికి॥ భయమునాకనుచుదోపపలికితివిసీవిట్లు ! పలికినందునభ
యమువడనించుకైన॥ ఎల్లవారలుజూడయిపుడునిన్నునుబట్టి! చంపింతు
ప్రాణంబుదక్కించుకోర ॥ నాభుజబలిమియునువనునీవుదెలియకను ! బీ
రంబులాడెదవుబెదిరింపదలచి॥ పేర్చిపైబడిభూనిపెరికినలుదిక్కులను! న
డురేయికార్చిచ్చునటియింపనేర్తు॥ సమయింపగావచ్చుజంఝానిలంబు
ను! నెరికదల్చకుండంగనిలుపనేర్తునుగ ॥ అతిసాహసముమీరిఅనుకూల
శుభమంత్ర! సిద్ధిగాజపములునుజేయనేర్తునుగ ॥ కడువేడ్కరథములును
కరితురంగాదులును ! నడిపింపగానేర్తువడియుద్ధమునను ॥ ఇట్టిశక్తియు
నాకునిచ్చెవరములుబ్రహ్మ! యమునైనబరిమార్తునెల్లప్రాభవము॥ అస

మానబలశాలినైననాకెదురిచ్చి । జానకీరాముండుచాలినిలగలడ। నాకు
రువినుసంతసణగు యమదూతలు । సకలభూతగ్రహోచ్చాటనంబౌను ॥
నాభాగదండంబుభూభాగమునగల్గు । వైరిరాజులకెల్లవజ్రాయుధంబు ॥
నాచండకోపంబునర్తకిబ్రహ్మాండ । భారంబునకునెల్లప్రళయకరమౌను ॥
సకలలోకంబులకుచక్రవర్తిత్వమున । పరగుచుండిననధికబలశాలినేను ॥
జానకీరాముండుజానకితోగూడి । ననుగెలుచుననిపలుకనవ్వుదోచును
గ ॥ నాయుద్ధతికినిలువనరునికిశక్యమా । పలుమాటలాడేవుకోలదియొగు
గకను॥ మొనసినిన్నునుబట్టిముందుగాదెగటార్చి । రేవునరనాయకునినే
వుమాలించి ॥ అతనిభార్యామైనయాజానకినిదెచ్చి । భోగభాగ్యంబుల
నుబొందియుండెదను॥ వానరానిన్నునూవారలందరుజూడ। పట్టిమ్రింగె
దచూడుపౌరుషంబునను॥ నీకుదిక్కెదికనునీవెందుబోయెదవు । శాంత
పడితేకోతిజాతిజూపెదవు॥ చనువిచ్చిమాట్లాడజనదుహీనులతోడ। హ
ద్దుతప్పినమాటలాడజొచ్చెదరు॥ నీవెంతనేనెంతనిలచిమాట్లాడెదవు। గు
ణహీనుడానిన్నుగూల్తునీవేళ ॥ అనియాగ్రహంబుననుకనుల్యెర్రగాజేసి।
హనుమంతుపైడాసిఅపుడుశతముఖుడు॥ పెక్కుదనుజావళులబిలచివాన
రుబట్టి। చంపుమనిశలవిచ్చెచండరాక్షసుడు ॥ శలవొందిరాక్షసులుబలు
రుద్రముఖులగుచు। కదసిరిపదికోట్లుఘనునిపవనజుని॥ పటహాంకృతులు
మీరిబలురాక్షసులురాగ। వారినందరిజూచెశ్రీరామభటుడు ॥ తలపూ
చిముష్టాదుతాటించిశతకంఠు। పైజూచియిట్లనియెబలుడుహనుమంతు॥
ఓరిశతకంఠసేనొకడవచ్చితినంచు। పట్టగాగోరితివిబలముదెలియకను॥ ఇ
టుచూడుచూడునాపటుజవంబంతయును। కనపరతునేడునీకనులభ్రమదీ
ర॥ అనిరామునిప్రార్థించిఆవాయువునుదలచి । శంభుమూర్తినిచాలసన్ను
తులుజేసి॥ తనవాలమవలీలమినుమున్నుముట్టగా । ఒరపిబలువిశ్వరూప
మునుధరియించె॥ బలులోకములునిండిబ్రహ్మాండములునిండి । బలసిబలు

మాటలుప్రబలిమోమునను ॥ కాలభైరవమూర్తికరణిరూపముదాల్చి।
గనుపించెనటులున్నదనుజావళులకు ॥ ఆపసిరూపముజూచిఆనిశాచరులె
ల్ల। నిలువజాలగలేక వెలవెలనుబారి ॥ వీరహాంకృతిజూచివెరచిరికొంద
రు। సందుసందులదూరిచనిరికొందరును॥ కంపమొందుచుభీతిగదసిరికొం
దరు। మడిసినట్లుగనేలబడిరికొందరును॥ నెరికరుణజూడుమనినిలచిరికొం
దరును। పలుబాములనుబొందిపడిరికొందరును॥ ఓశతాశ్యానిలువనోపలే
మనికొంద। రాశతాశ్యునిజేరపడుకొందరును॥ అప్పుడుశతకంఠుండుహ
నుమంతుపైజూచి। గుండెలదవయుచునుకొనెచాలభయము॥ తక్కినదా
రలునుతగినప్రధానులును। నిలువుకైరైపోయినిర్ఘాంతులగుచు ॥ ఎల్లరా
క్షసవర్గమచ్చోటనిలవలేక। మూలమూలలజెందిమొరలుబెట్టుచును॥ ద
నుజలోకాధిపునిడాసిహనుమంతుండు। ఆగ్రహంబుననిట్టులనెవానితోడ॥
ఏదినీభీకరంబెచ్చోటికేగెరా। బలపరాక్రమమెందుబాసిపోయెనురా॥ క్రో
ధ్వచేననుబట్టపువ్విళ్లనీకేల। బలిమిగలియుటకింతిపనిదలచితివా॥ చూ
డునాబలమంచుశూరుడైహనుమంతు। ముష్టిహతిచేబాడచెమొనసిదా
నవుని॥ బలుముష్టిచేగుండెపైదానవునినేల। బడగూలగాబాడిచెబలురు
ద్రువలెను ॥ బలుదుబాడిచినేలబడినూరుతలలెల్ల । పగిలినెత్తురులుబ్బి
పారికాలువగ॥ పాలసున్నముగచ్చునైలైనచందమున । రక్తమణుగులు
బుట్టరక్కసునిమేన ॥ దానవుడుమూర్ఛిల్లిధరణిపైబడిపోయె । బీరమెల్ల
నువాలగిపినుకొండవలెను ॥ అతనిసింహాసనంబంతగుండైపోవ । దన్నైన
మురలుచోద్యతనుమింటజూడ ॥ తానంతటనుబోకదానవేంద్రునిబట్టి ।
ఘనతలాటముగుండాగొట్టివేసె॥ అసురునీగతిజేసిఅచ్చోటనిడుకొని। తా
నుమెప్పటిరూపుదాల్చిహనుమంతు ॥ రామరామాయనుచురామునిచే
ర్కొనుచు। తనకెదురైనదైత్యులగూల్చుకొనుచు ॥ సింహనాదంబులు
నుజేయుచునుకపిసేన। ముఖుడగుచుహనుమంతుమోదముసజనియె॥

## హనుమంతుడు రామునిసన్నిధికి వచ్చుట.

సకలబలములుగొలువసన్నద్ధుడై యున్న। సుగ్రీవుజూడగాంచిచోద్యములు దెలిపి ॥ అతనిచేబహుమానమందితానచ్చోటి । వదిలికపివరులంతనెదురుకొనిరాగ॥ ఘనుడువారలనెల్లకౌంగిటనుబంధించి। చాలమన్ననజేసిసంతోషమునను॥ ఎదురుగాతనరాకకెదురుజూచుచునున్న।రామచంద్రునిగాంచిప్రేమమీరగను॥దండప్రణామములునిండారగావించి। పాణితలములురెండుఫాలమునజేర్చి ॥ బహువిధంబులచేతప్రార్థనలుగావించి । వినురాఘవయనుచువినుతింపదొడగె ॥ ఘనతప్రతాపలంకాపట్టణముజొచ్చి। జూచితినచ్చోటచోద్యంబులన్ని ॥ దనుజేసుపట్నంబుతగతొమ్మిదవకోట । లాకసముపొడవుగానమరుచుండగను ॥ కడువింతగులుకుప్రాకారములుతొమ్మిది । గలవుతొమ్మిదియగడ్తలుకోటలోను ॥ నవకోట్లుశివగుళ్లుదివినంటిరంజిల్లు । నలువదార్వేలుండుకొలువుకూటములు॥ మంత్రికోవిదులుమతిమంత్రులొక్కొక్కనికి। దానవులుగొలిచేరుయేనూరుకోట్లు॥ హోమహితంబుగానెల్లదిక్కులుబరగు।హోతలచేనొప్పుహోమకుండములు॥ ప్రతియింటవైభవప్రతతిరంజిల్లుచును। హవ్యభుగ్భజనములునమరియొప్పుచును ॥ శివశివయనిసర్వజీవకోట్లందరును । వేదఘోషలతోడవెలయుచుందురుగ॥ అనిపవనజుడుబలుకనాలించిరఘువరుడు। దానవునిబరిమార్పతరముగాదనుచు॥ దనుజసద్వర్తనలుతనుగానకుండంగ । నేలవచ్చితినినింకెట్లువశమాను ॥ పట్టియాసలుదనుజుగొట్టసాధ్యుడుగాడు। పూజాధురంధరులుపురవాసులంత ॥ ఈధనుర్బాణంబులేలబట్టితినంచు। దూరంబునకువిసరిపారివేసెనుగ॥ పారవేసినధనుర్బాణంబులందుకొని। తనచేతబట్టుకొనిహనుమంతుబలికె॥ ఇనకులాధీశ్వరాయీపాటిమాత్రముక। విలుబాణములుపారవిసరేయదగున॥ దైవయత్నమునయీగుణములున్నవిగాని। దుర్గుణంబులుతోడతూగియుండుదు

రు॥ దయయుసత్యంబులతలవులేశంబును। యేదనుజునకు లేదు యేపట్లనై
న॥ మలినదేహులుధర్మమార్గ మెరుగనివారు। సత్యసంధులుగారుసర్వని
ర్దయులు॥ అనగానరఘురాముహనుమంతుచేనున్న। ధనుర్బాణములం
దుకొనిపట్టుకొనియె॥ హస్తములుజోడించిఅంజనీపుత్రుండు। ఎరుగింప
దాణగతానేగువార్తలును॥ శ్రీరామచంద్రమీశలవుగై కొనిసేను। ఘ
నతప్రతాపలంకాపురికిబోయి॥ అచటివింతలుజూచిఅవిభవములుజూచి।
అరయనామదికిబ్రహ్మానంద మొదవె॥ గర్వాంధుడై నశతకంధరునిబాడ
గాంచి। తమరువేంచేయువర్తనలుజెప్పితిని॥ గుణవిహీనుడుచాలకోపించి
నాపైని। కనులెర్రగాజేసికలహించిజూచె॥ పదికోట్లదనుజులనుపైనంబు
గావించి। ననుజంపుడనియాజ్ఞదనుజేశుడిచ్చె॥ శలవుగైకొనినిశాచరులం
తపదికోట్లు। చుట్టబెట్టిరినన్నురట్టుమీరుచును॥ సాకేతపురములోలోక
నాయకమీకు। వెలయంగజూపినవిశ్వరూపంబు॥ తగనేనుధరియించిదై
త్యులెదుటనునిలువ। పారిరొక్కవిధానబలుబొబ్బలిడుచు॥ పారిపోయిన
దైత్యబలములందఱివిడచి। కలుషాత్ముడై నశతకంఠుగవసితిని॥ గవసియు
ష్కరుగుండెగడలంగబొడిచితే। దైత్యుండునేలబడితలలన్నిపగిలిరక్త
ముకాల్వలై పార। మూర్ఛాగతుండయ్యెమొనసిదానవుడు॥ దానవుడు
మూర్ఛిల్లిధరణిపై బొర్లాడె। పెనుకొండవిధమునసుభీరుడై దొలగె॥ అ
సురసింహాసనంబంతగుండై పోవ। తన్నివేసితినగరుతల్లడంబొదువ॥ దను
జుకాళ్ళనుద్రొక్కిఘనతలాటముబట్టి। కొదువేమిలేకుండగుండగొట్టితిని॥
అచ్చోటువీడుకొనిహరిమిమ్ముదలచుకొని। వచ్చితినిమీకునీవార్తజెప్పు
టకు॥ మంత్రతంత్రములుహోమములెన్నిగలిగున్న। నిర్దయుండైయుం
జెసిగ్గించవచ్చు॥ నిర్దయాసత్యంబులేవానిపుట్టిల్లు। సమరమందునవాని
జక్కాడవచ్చు॥ కలనైనదానవునికాచారములులేవు। పరమచండాలుం
డుబహుపాతకుండు॥ కోటలగ్గలుబట్టిమాలంగజేయుటకు। సంశయింపక

వేగశిలవియ్యవచ్చు॥ కఠినచిత్తుడుపాపకర్ముండునిర్దయుడు। తడవుశాయు
కహీనిబడగూల్పవయ్యా॥ పరమచండాలుండుపలికేటిమాటలకా। తడవు
జేయగరాదుదానవారాతి॥ అనిపాదములబడివఅంజలీసేయునిబట్టి। కౌగి
టనుబంధించెకమలనాభుండు॥ శాశ్వతైశ్వర్యములుజెందిచిరంజీవివై।వ
ర్ధిల్లుమనుచుదీవనలొసంగెనుగ॥ జానకినాయకునిచేదీవనలుబొంది। మేలు
గాహనుమంతుమిన్నందియుండె॥ రమ్యముగహనుమంతురాయభారవు
కథలు। పృథమిలోనెవరైనభూరివేడుకను॥ చదివినవ్రాసినాముదమొప్ప
బాడిన। విన్నవారలకబ్బువిష్ణులోకంబు॥ సంపదలుసమకూడుచెలగునై
శ్వర్యంబు। అఖిలసుఖములుగలుగునాపదలుదొలగు ॥ భవరోగహరణ
ములుపాపసంహరణములు। సత్కథాశ్రవణములుసర్వజీవులకు॥

## శతకంఠుడు మూర్ఛ దెలియుట.

అక్కడప్రతాపలంకాపట్టణములోన। పొబనసిశతకంఠుండుమూ
ర్ఛమునుగుచును॥ తలలెల్లబగిలిరక్తముకాల్వలై పారి। కొంతసేపుకుదె
లసిచింతమునుగుచును॥ తనదుసింహాసనములెగచూర్ణమగుటకును। ఘ
నతలాటము నేలగలిసిపోవుటకు ॥ తనుచరవరుడొచ్చితనుదన్నిపోవుటకు।
ఆడలిభయమునుబొందిఅతిచింతనొంది ॥ తనయిరుదెరంగులనుగనుపట్టి
మంత్రులను! హితులబలములజూచియిట్లనుచుబలికె॥ మందుసఖులార
మీరందరునుయుండగా। కోటలన్నియుదాటికోతియొకటొచ్చి ॥ భయ
మేమియును లేకప్రల్లదములాడుచును। మునకెదుటగూర్చుండివెనకతీయ
కను ॥ ఇంతపనిగావించెనిందరునుమీరేమి । చేయగావైరిరిదేయుపా
యమును॥ ఏమిచేయుదునుమిమ్మెలాగునమ్ముదును। ఏలాగుబంట్లుగానే
లుదునుమిమ్ము॥ కోతిమాత్రమువచ్చిగుండెలవయగదన్నె। మీరంతకని
పెట్టిబీరులగుచుండి॥ ఏలాగురఘుపతినినిలగూలనేయుదును। మహాబలను
చుమిమ్మెట్లుమదినినమ్ముదును ॥ అనియిట్లుశోకంబుబెనగుచును నదలుచు

ను। చింతమునుగుచుదనుజశేఖరయిట్లనిరి॥ ఏమిశతకంఠనీకిట్లువెగడొందే
వు। వదినీభీకరంబెచ్చోటుకేగ ॥ ఈపాటిమాత్రమునకిట్లువెరగొందేవు।
తగదునీకీలాగుదానవేశ్వరుడ॥ మర్కటుండననెంతమాకుజెప్పగరాద।
పాతకమణవగలేమపోనియ్యకవాని॥ శలవులేదాయెననినందేహమునుబాం
ది। మేమూరకుండంగమించిపోయెనుగ ॥ అయితేమియిపుడుమాకందరి
కిశలవిమ్ము॥ మర్కటునిరూపెల్లమాపివచ్చెదము ॥ జానకీనాయకునిచం
డాడివేసెదము। మనవిభీషణుబట్టిమడియజేసెదము ॥ ఆరాఘవులగూడి
అరుగుదెంచినయట్టి। జానకీపతిదెచ్చికానుకిచ్చెదము॥ మమ్మెరుగవామృ
త్యుమార్కొనగజాలుదుము। కాలానలమునైనకట్టివేసెదము॥ అష్టది
క్పాలకులహతమారచేయుదము । జలనిధులజలమెల్లజల్లివేయుదుము॥
రాముడనగానెంతరాతపవీరుండ । అధికబలహీనుండుఅల్పమానవుడు॥
కోతిబలములనెల్లగూడుకొనితావచ్చె। తెలసెనాతనియొక్కబలము ప్ర
ఖ్యాతి॥ ముజ్జగంబులకీర్తిమొనసియుంటివిగదా। మర్కటునికీలాగుమతి
గుందదగున। నరుడుమీకడ్డమాసగకుచేయగదగున। తృణమాత్రుడగు
వానిదునుమవలెగాక॥ అనుచుసరదార్లంతతనమనముపురికొల్ప। ధైర్య
మవలంబించిదానవేశ్వరుడు॥

శతకంఠుడు తల్లిదరికేగుట.

మంత్రులనుమన్నించిమరిగౌరవముజేసి। తల్లివద్దకుజనియెదనుజ
నాయకుడు॥ చనితల్లికతిభక్తిసాష్టాంగమర్పింప। గనితల్లివిభ్రాంతిగదు
రనిట్లనియె ॥ అన్ననీమొగమేమిచిన్నబోయున్నది। చింతనొందేవుయే
వింతనీకబ్బె॥ ఏమిచందముబుట్టెనెరిగింతువాలోడ। నెల్లబీరముదప్పియే
పుదొలగితివి ॥ నీచేష్టలకుమదినిరోసియుగ్రాకృతిని । వచ్చెనోరుద్రుండు
వైరంబునతను॥ మునులనేలితివనుచుకినుకతోడుతబ్రహ్మ । శపియించె
నోనిన్నుసాహసంబునను॥ కింకరులతోగూటిశంకలేకనుయముడు। దండె

త్తివచ్చెనోతగనిస్నుజంప॥ శరణాగతత్రాణబిరుదునిర్వర్తించి॥ కోరియే
తెంచెనాశ్రీరామమూర్తి॥ ఏచందమోనీవుమెరిగించునందాక। కడుపు
లోచెయిబెట్టికలిపినట్లుండు॥ చిన్నతనమునుబొందియున్నావునామనసు।
చంచలంబయ్యెనీసమయంబునందు॥ అనిచిత్రగంధిపుత్రునితోడబలుకం
గ। తల్లివినుమనియిట్లుతనయుండుబలికె॥అగచరాధముడొకడుహనుమం
తుడనువాడు।తగకోటలన్నియునుదాటిపురికొచ్చె॥ నాయెదుటగూర్చుం
డినాతోటివాదించి। బట్టివచ్చెనువీరబలులనందరిని॥ వెరపుబుట్టగజేసివి
రరూపముదాల్చి। పొడిచెనుగ్రాకృతినివడిసన్నుబట్టి॥ పొడచిసింహాసన
మువడిచూర్ణముగదన్ని। బిరుదులలాటంబుధరణిగూల్చెనుగ॥ మరలివ
సచరుడేగెమనుజనాథునిగొల్వ। ననిచెప్పమూర్ఛిల్లెనాచిత్రగంధి॥ కొంత
సేపునకుదెలసికొడుకునక్కునజేర్చి। వినుమనుచునిట్లనియెవెలదితానపుడు॥
నీతండ్రినారదునిచేతవినియుంటినని। నాతోడనెరిగించెనోతనూజుండ॥ ఆ
మాటనీతోడనంతనేజెప్పెదను। కోరవినుమామాటకోమరుడానీవు॥ అ
ఖిలలోకంబులకునాధారమైయున్న। ఆదిమహాశక్తిఆనందవర్తి॥ జ్యోతి
ర్మయంబగుచుసుందరముమీరుచును। భువననాయకియగుచు పొలుపు
మీరగను॥

### చిత్రగంధి సీతాదుల మహాత్మ్యము జెప్పుట.

కోరతామీరఓంకారస్వరూపమున। ధరణినిర్మించుటకుతనకళ
లువెలయ॥ బ్రహ్మవిష్ణుమహేశభవులనుబుట్టించి। జన్మపోషకులగుచుచ
రియించుమనుచు॥ వారికానతియిచ్చివారుసుఖయించుటకు। మార్గంబు
వీక్షించిమరినియోగించె॥ తమకళలతోవేగతగప్రసిద్ధిగముగురు। కన్ని
యలబుట్టించెఘనతమీరుచును॥ శారదాయనుసతినిసరసిజోద్భవునకు
ను। నెలమితోవిష్ణువుకునిందిరారమణి॥ పార్వతియనుసతినిభవునకునేర్ప
రచి। కడుప్రపంచంబెల్లదుఖుమనిపలికె॥ అందుతనపూర్ణకళయగులక్ష్మి

నటుబిలచి। యతిరహస్యమునసాయమ్మకిట్లనియె॥ త్రేతాయుగమునందు
సీతావధూటినై। జనియించిశ్రీరామచంద్రునితోఁగూడి॥ మెలగుచురావ
ణాదులుదుష్టరాక్షసుల। హతమార్చుశ్రీరాములాకాలమునను ॥ దురిత
రావణదనుజమరణాంతమందునను। శతకంఠుడనువిశాచరుడుగ్రముగను॥
పురుషులచేతనకుమరణంబులేకుండ। బ్రహ్మావరములుబొందిబలుగర్వము
నను॥ స్త్రీలనిస్సారంబుజేసిగర్వముమీరి। యున్నకాలమువందునోయి
తనయుండ॥ శ్రీరామవిభువెంటసీతామహాదేవి। రూపమునవెల్గుచునురూ
ఢిమీరుచును॥ ఆరామచంద్రునకునాశక్యకాలమున। నరయునాశస్త్ర
ములునీవుధరియించు॥ దనుజుతోఁయుద్ధంబుదప్పకుండగజేయు। మళ్లిదు
నీయందునేనావహించెదను॥ నీచేతశతముఖునినిముషమునజంపింతు। న
నిచెప్పిపంపించెనామహాశక్తి॥ అదికారణంబుగానాయిందిరాదేవి। సీత
యైజనియించెజగతిలోపలను॥ సృష్టిపైవిష్ణుండుదుష్టులనుబరిమార్ప। శ్రీ
రామచంద్రుడైజననమొందెనుగ ॥ వలనొప్పగావిష్ణువక్షస్థలమునందు।
చెన్నొందుమహాలక్ష్మిసీతయైబుట్టె ॥ సరణిభుజములబూనుశంఖచక్రము
లెల్ల। భరతశత్రుఘ్నులైభాసిల్లుచుండె ॥ శ్రీవిష్ణుపానుపైచెన్నొందుశే
షుండు। లక్ష్మణుండైపుట్టెలావణ్యముగను ॥ అతనిగొలిచేకపులుఅమరవ
ర్యులుగాని। నెలకొన్నతరుచరానీకములుగారు ॥ కానరాముడునరుడు
గాడుశక్యముగాదు। వానితోవైరంబువలదువలదయ్య ॥ తండ్రిపూనికె
నుతుడుతప్పించగాగలడె। బ్రహ్మావరములుయేమిపనికిరావయ్య ॥ ఎలమి
శ్రీరామునకెదురుకొనశక్యమా। తగవారితోవిరోధముమానునీవు॥ వా
రిశరణముజొచ్చివర్ధిల్లుపనిదలచు।కలుషజనములపొత్తుకల్లనైనవిడుము॥
తనకెంతబలమున్నతగనెదురుదెలియక। గానిజెబ్బులిపైనికాల్చాచదగ
దు॥ అనిరాముపిక్రమంబలనితమ్ములలావు। తగరామునందనులధైర్యసం
గతులు॥ అవనిజమహిమంబుహనుమంతుచందంబు। సుగ్రీవుఘనతతత్సు

తునిసంగతులు॥ అతనిబలములచలమునతిపరాక్రమములును। పెలుచవి
భీషణుని ఖేదపాదములు॥ తనయొక్కనిఖిల కీర్తిధర్మసంఘట్టనలు। జలగువ
ర్కీర్తియునుసంపాదనంబు॥ పలువిధంబులు దెలిపిబహుగతులబోధించు
ఆగ్రహంబుడుగక నసురుడిట్లనియె॥ తల్లి నీవిట్లాడధర్మమాపగవాని। వ
త్తుమైపలికేల్వ్రపాటు తెలియకను॥ ఆదినారాయణుండసినీవుచెప్పెదవుగ్రాఘు
రుకమాలినమాటలేలపల్కెదవు॥ మనరావణాసురుదుతనదేవిచరగొని
వ పగబూనితక్షణముబరిమార్పరాద॥ మదికత్తబడికోతిమురుగుజోర
గానేల। వందులోగనవచ్చెనతనిప్రఖ్యాతి॥ నరుడువిష్ణుండనుచునా కేల
జెప్పేవు। చెప్పినందునభయముచేకూరునటవె॥ మనుజమాత్రునకింతభ
యమొందగానేల। బడగూల్తువానినేభండనంబునను॥ అతనితరుణిలలా
మనతివేగమునదెచ్చి। యుల్లాసమునబొందియెల్లపేళలను॥ అనిసుమారు
దుబంటుకనామాటలకుచాల। కటకటాయనిచిగ్గరిగంధితానవియె॥ భువ
నంబులకుమాతపాలుపొందగాసీత। కావరంబుననీవు కళ్లగావకను॥ అ
న్యాయముగమాటలాడితివిహరహరా। యనిచెవులుమూసుకొని వనిత
తానుండె॥ జననిమాటలుతనకుసమ్మతంబులుగాక। అచటనిలపైపకను
ఆగ్రహంబునను॥

## ఉభయసేనలు యుద్ధమునకు వెడలుట.

అచటవీడ్కొనిలేచియామ్రులనుమంత్రులను। సరదార్ల రప్పించె
సమరయత్నమున॥ తనకోటముందరనుఘనమైనజండాలు। వినువీధినం
టుగాదనుజుండునిలిపె॥ బలుకోటదుర్గములనలువదక్షోహిణులు। కడుక్రూ
రరాక్షసులకాపుబెట్టినుగ॥ మునుపుకావలియున్నదనుజులకుమద్దత్తు। ప
దికోటులక్షోగిబలములేర్పరచె॥ ధంధణంధణలెల్లతనకోటనిండంగ। పి
కట్టిలగావించెభేరీరవములు॥ చతురంగబలములుధ్ధతిగొల్వపొంగుచు
ను। రణయత్నమునసుండెరాక్షసేశ్వరుడు॥ అటరామచంద్రుండునాఁజనే

యునిబిలచి। యిదిమహాస్త్రముసేనకదిలించుటకును ॥ కయ్యంబుసే యుటకుకదలవచ్చునుగదా। అనుమానమొందుటకేపనులేమిలేవు॥ అని భేరికారవధ్వనులుమిన్నంటంగ। హనుమద్విభీషణులననుమతంబునను॥ నకలసేనలకెల్లసెలవిచ్చెశతకంఠు। కోటపైనడువుమనికోదండపాణి॥ కో టలగ్గలుబట్టికొల్లలాడుమటంచు। సెలవిచ్చెమున్మారుజానకీవరుడు॥ శ్రీ రాముశెలవందిసేనలందరునొక్క। పెట్టునుగ్రాకృతినిభీకులై యనిరి॥ గోవిం దగోవిందగోవిందయనుకొంచు। పొంకమొప్పప్రతాపలంకముఖులైరి॥ ద్వారకావలియున్నదనుజావళులబట్టి। పెడచేతిపిడికెళ్లపొడిచికూల్చిరిగ॥

వానర దానవుల యుద్ధము.

మొగసాలలందున్నతగుబలంబులనెల్ల। కరచుచునుబాదుచుచు నుగాసిఁజెట్టిరిగ॥ ఆయుధసాలలందరినిసందులగలుగు। శరచాపములబ ట్టివిరిచివేసిరిగ॥ అశ్వశాలలుజొచ్చిఅందువెలయుచునున్న। మత్తాశ్వ ములబట్టిమడియజేసిరిగ॥ ఇంతింతయనకధీమంతులై రాక్షసుల। గదసిప లువిధములనుగాశిబెట్టిరిగ॥ బలువడినిపట్టణప్రాకారతోరణ। కేతనంబు లుగాల్చికేకవేయుచును॥ విలసితంబుగసౌధములుగోపురములన్ని। పుడ మిపైకూలగాబాడిచివేసిరిగ॥ మరియనేకవిధాలమల్లాడుచుండంగ। ఖ లుడుశతకంఠుండుతెలసికోపమున ॥ తనుగొలిచియున్నట్టి దనుజావళుల జూచి। గౌరవంబులుజేసిఘనుడుతాబలికె॥ బలులారమనకోటపైగదలి వచ్చిరట। కోతిపొంజాలువారుగొల్లుపెట్టుచును॥ కడువేగమీరేగికడతే ర్చుడీవారి। పొంకములుయావత్తుపొలసిపోవుటకు ॥ అనుచుచతురంగబ లములకెల్లశెలవిచ్చి। కడగిరాక్షసబలముకదిలివచ్చెనుగ॥ దనరుబత్రీసా యుధాధారులైకాల। యమకింకరులరీతియరుగుదెంచిరిగ ॥ ఛండనోద్దం డులైపశ్చిమసముద్రంబు। తెరగుననుసైన్యంబులరయవచ్చిరిగ॥ వచ్చి శ్రీజానకీవరునిబలములుదాక। యేమిచెప్పుదుదొమ్మియుద్ధచిత్రములు॥ గ

దలచేమోదుచునుపదములదన్నుచును। పిడికిళ్ల బొడుచుచును పెల్లుమీ
రుచును॥ మోచేతులనుబాడచిమోసంబుజేయుచును। దీర్ఘదంతంబుల
నుదెరయగరుచుచును॥ సాధులబట్టుకొనిసదమదము జేయుచును। రథిక
లదింపుచునురట్టుజేయుచును॥బహువిధంబులనిట్లుభద్రగజములబట్టి। కుం
భస్థలంబులనుగూలనేయుచును॥ అశ్వసముదాయములనవనిబడగూల్చు
చును। బలురథంబులునేలపాలుజేయుచును ॥ గంధవడియములగతికపి
సంఘములబట్టి। బలుమేనుపై బట్టిసలిపి వేయుచును ॥ పెల్లుమీరుచుచా
లనోళ్ళుదెరచుచువచ్చి। కపివరానీకములగదసిమ్రింగుచును ॥ ఇట్లుదను
జులు ఘోరయుద్ధంబుగావింప। వారిధాటికినిలువవశముగాదనిరి॥ అగచ
రభల్లూకఅసురమానవబలము। విరిగిపారిరిమొల్లవిధులభీతిలుచు। ఒక్క
డైననునిలువనోపంగజాలక। బలములన్నియుపటాపంచలై పారె ॥ విరిగి
పారినబలము తెరగంతయునుజూచి। ఘనుడుసుగ్రీవుండుగర్వంబుదెలిపి॥
పోకుపోకుండనుచుపురికొల్పగనుతిరిగి। గదిసెరాక్షసబలముగగ్గోలుపడ
గ ॥ కదిసిచీకాకుగాకదురాక్షసావళుల। వెతలబెట్టిరివారివిధిచెప్పదర
మా॥ గదలబరిమార్చుచునుకరములనుబాడచుచును। తమకముచెమ
సలములమనుముకొంచవుడు॥ గోళంబులనుద్రొక్కివేళనము జేయుచు
ను। నఖములనుజీరుచునునలుకమీరుచును ॥ వాలములజిమ్ముచునువడి
మీరదన్నుచును। గుర్రంబులనుబట్టిగూలనేయుచును॥ రథికులబోలిసా
రథులబరిమార్చుచును। శరములనుద్రుంపుచునుచాకళింపుచును॥ పదు
గురొక్కనిబట్టిపల్లార్చుచునుసింహ। నాదంబులనుజేసిమోదంబుతోను॥
కేరుచునుమీరుచునుజీరుచునుకరచుచును। గగనంబునకుకుప్పిగంతులే
యుచును॥ ఉక్కుమీరుచునిట్లు పిక్కచందంబులను। కపివరులుయుద్ధం
బుగదిసిజేసిరిగా॥ కపివరులుజేసినాఘనయుద్ధమార్గంబు। కన్నులనుబాడ
గాంచకమలనాభుండు॥ హర్షించితనమదినిఆనందమునుబొందె। కపిబలం

లబడుచు॥ జేకిరిల్లుచుగొండ తెరవులనుజారుచును। కంపమునుబొందుచు
నుకటకటాయనుచు॥ లేచినలుదిక్కులనుజూచిగతిచెడిపోయి। పరుగిడి
డుచునుకపులాబలిసియూర్వ్యగమ॥ ఇటుతిరుగుడనికపులుతొంతపిలిచినగా
ని॥ తిరిగిచూడకమహాత్వరితమార్గమున॥ గిటుగిటమత్తంబుబొటబొట
మడోరుగంగ। కటకటనుగుండెలుమలటలటలుబడుచు॥ దారిదప్పెగుచు
నులేడబాటుమొందుచును। దీనతనుబొందుచును దెప్పిరిల్లుచును॥ అస్సురు
స్సురయనుచునచొప్పెటనచొప్పెట। చలికిలబడుకొంచుజాలిబొందుచును॥
అదుగోవచ్చిరికపులునిదుగోదాకిరటంచు। కంపమునదానవులుకలువ
రింపుచును॥ అల్లదుగోజాంబవుడు పెల్లుగావచ్చెను। నేలసాగిలబడుచు నె
రిభీతిగొనుచు॥ తమమీదరథములంతటదోలవచ్చిరని। పలువరింపుచు
దారిదొలగిపోవుచును॥ ఎందుబోయెదమింక నేదారిమాకనుచు। దిగ్గున
మమూర్ఛిల్లి తెలసిచూచుచును॥ లేచుచునునలుదిశలుజూచి చింతింపు
చును। దుమమూడవచ్చిరని వెనుకజూచుచును॥

హతశేషులు శతకంఠునిదగ్గిరకు బోవుట.

కొలువులోవిమతుడై కూర్చున్నబలుపాప। చరితుడై యున్నట్టిశ
తకంఠుగనిరి॥ గనిపదంబులప్రాలిక్రమ్మరబడిమ్రొక్కి। భోరుననుశోకము
నబొదలియేడ్చిరిగ॥ కపులరాకలుమళ్ళికదసిపీక్షింపుచును। పిలువదిమ్ము
లుబట్టిపలుకకెంతయును॥ తగసారెసారెకునుతమ్ముగావుమటంచు। దిశలు
వీక్షింపుచునుదిక్కునీవనుచు॥ పలువరింపుచునున్న భటగణంబులజూచి।
ఆశ్చర్యమానసుండగుచురాక్షసుడు॥ ఓయిదానవులారవగువంగనేటికి।
న్నల్లమువభయమందియుండనేమిటికి॥ నయముగానేగలుగభయమువిూ
కేటికి। కొదువలేదికమీకుగూల్తుశత్రులను॥ బవరంబులోగలుగువివర
మంతయునాకు। నెరిగింపుడీరిపులబరిమార్తునిపుడు॥ అనుచుపలుమారు
తానపుడుబలుకగదనుజు। మాటుపోలిక తెరిగిమదిదెలసియపుడు॥ అతని

కభిముఖముగానవులుదనుజులునిల్చి। రఖిలమంత్రులువినగనతనికిట్లనిరి॥
దనుజేంద్రమీశౌర్యలవ్రగొనుచుమేమందరము। ఖండదోర్దండతనుసాహస
ముచెలయ॥ కోటలగ్గలుబట్టికొల్లలాడుచునున్న। బలుసేనపైగవసిఖండ
నంబుననుI పోరాడగాపారిపోయిరాకపిబలముI వరునతోకపిరాజువార
లనుబిలచి॥ చెలయశౌర్యముదెలుపవెండియుబురికొనిరి। తిరిగిమ్ముసం
దాకితరుచరావళులు॥ వాలంబులనుజుట్టివడిద్రిప్పివేయుచును। కరుచుచు
నుజసుచుచునుగాసిచేసిరిగ॥ కఠినశైలంబులనుగదుద్రిప్పివైచుచును।సిం
హధ్వనులుజేసిచెలగిదాటుచును ॥ ఉండగానంతలోదండధరునిఁబోలి।
రాఘువుడనువాడురౌద్రాత్ముడగుచు ॥ ఆగ్నేయబాణంబులన్నిసేసలగ
ప్పె। తెరిపిలేకుండంగధీరాత్ముడగుచు ॥ మొలగినబలమేమితొలగిపోవ
గలేక। తగశరాగ్నిలొంగుందిదగ్ధమైపడిరి॥ మేలుకార్చిచ్చులోమిడుతలు
బడురీతి। నారాముబాణాగ్నిసంతమడిసిరిగ ॥ స్తనితబాహుడుచచ్చెశా
ర్దూలముఖుడిగ్గె। మడిసెరక్తాక్షుండుమహిపైనిగూలె॥ కుంజరాంగుడుఁజ
చ్చెకూలెనగ్నిముఖుండు। పింగళాక్షునిపెంపుబలముఁజచ్చెనుగ ॥ నీలకే
తుడుగూలెశూలుండుగడతేరె। కుటిలదంతుడుగూలెకటకటాయనుచు॥
నీల్గెకరాళుండుశూలహస్తుడుమ్రగ్గె। కాలుగర్వంబెల్లగడతేరిపోయె॥చి
త్రుండుకర్కశగాత్రుండుమొదలైన। బంటులెల్లనుపీన్గుపెంటలైపడిరి॥
ఏముకొందరమునీకెరుకజెప్పుటకొరకు। చావుకునుదప్పిమీజాడగంటిమి
గ॥ తలపనేటికినసురవిలయంబునమకూడె। నిట్టిదుర్వార్తలింకేమిజెప్ప
దుము॥ కావుకావుమమ్మునికరముఁరంజిల్ల। నీకుమించినదిక్కుమాకె
వరుగలరు॥ అనుచుశతకంఠరునివెనుకదూరినవారు। బెదురుచునలుదిశ
లువెదకిచూచుచును ॥ అసురుడంతటనట్టహాసంబుజేయుచును। నెయ్యి
దొరగినయగ్నినెరయుచందమున॥లోకంబులన్నియునులోగొనుచుహాం
కృతిని। మ్రింగబూనినకాలమృత్యుపోలికను॥

## శతకంఠుడు మంత్రులతో యోచించుట.

తనప్రధానులహితులదప్పకుండబిలచి । వింటిరాభటులిపుడువివ
రించు తెరగు॥ మర్కటులుదానవులుమారుకొనిపోరంగ । కనులజూడగ
లేకమనుజవల్లభుడు ॥ దానవధర్మముబొందిదానవులజంపెను । దానవుడువ
ప్పుటకుధర్మమార్గంబ॥ తనతోడబోరుటకుదనుజులరుదెంచి రె।బరిమా
ర్పగావచ్చుభండనంబునను ॥ అన్యాయముతుజొచ్చిఅసురులనుబరిమా
ర్చె। కాయరాదికవానిఖండించవలెను ॥ నడువుడీమీరంతతడవు సేయక
వేగ। భండనంబునకరగిప్రఖ్యాతిజూపి ॥ మర్కటావళినెల్లమదమణచిన
రిపుచ్చి। మనవిభీషణుబట్టిమడియంగ జేసి॥ నరపసునితనసహోదరులతో
డునుమాడి। అతనిపుత్రులబట్టిహతమార్చి వేసి ॥ వెనువెంటజానకినివేగ
దోడ్కొనివచ్చి। ఘనముమీరగనాకుకానుకివ్వండి ॥ మీవెంటనేవత్తు
మీకుభయమైయుంటె। శత్రుకోటులనెల్లసంహరించెదను॥ కదనమున
నాయంటిఘనుడెవ్వడున్నాడు। అరయకండలజేతునమరేంద్రునైన॥ మర
ణమానన్నమైతుదెంచెనానరుడు । కాలమృత్యువుఖవానికట్టితెచ్చినది॥
చూడుడీయావేళసురవరులుభీతిల్ల। కదనముందునరాముమదమణంచెద
ను॥ అనిప్రతిజ్ఞలుబలుకనపుడుసరిదార్లంత। తమతమశౌర్యములుదెలు
పనిట్లనిరి॥ దనుజేంద్రమీశలవుగొనదలచితిమిగాని। మనుజవల్లభుడెంత
మాకుజూడగను॥ మృత్యుదేవతనైననెత్తిపైజరచెదము॥ ఘోరానలం
బైనకోరిత్రింగెదము॥ మనుజులునుగినుజులునువనచరులుగనచరులు।అ
ష్టదిక్పాలకొక్క—అరఘడియపనియు ॥ వినుముదనుజేంద్రభండనవేదికే
కపుడు। కోపమునియొదియగ్ని కొనసాగించు ॥ ఎలమివిభీషణునియజ్ఞప
సుపుజేసి పటుతరస్తంభమునభద్రముగనిలుపు ॥ అసిపత్రసమిధలపం
డువోబడవేసి । క్రమముగబడబ్రవేల్చకపిసైన్యములను ॥ రక్తంబునె
య్యిగారమణత నేర్పరచు। ధరపరాగముధూమకరముగావింపు ॥ తన

యభార్యాసహోదరులతోరాముని । పూర్ణాహుతిగవ్రేల్చిభూసముద్ర
ముకిన॥ నవభృతస్నానంబునెలమితోడుతజేసి। అలరవేడ్కనుసోమయా
జియైయుండు। యుద్ధంబనేక్రతువృద్ధింబుగాజేసి । ముజ్జగంబులకీర్తిము
దమొందవచ్చు॥ సమరయజ్ఞమునీవుజరిపితేనేగాని। ప్రఖ్యాతిలోకమున
బరగదెంతయును॥ అనిమంత్రులేర్పరుపఘనుడుశతకంఠుండు । మెండు
కొనిగర్వంబుమిన్నుముట్టగను॥ మనుజవల్లభునొక్కతృణలీలద్రుంతునని।
దుర్మార్గబుద్ధులనుతులదూగుచుండె ॥ కాలంబుసమకూరిగడతేరువా
రలకు। నంత్యకాలపుబుద్ధులమరియుండునుగ ॥ మంచిబుద్ధులుయేలమన
ములోపలబుట్టు। పాపఫలితంబైసప్రాణికోట్లకును॥ మదముమీరినయ
ట్టిమత్తేభమునుబోలి। గర్వాంధకారంబుగప్పియుండెనుగ॥ ఆదినారా
యణుండారామచంద్రుడని। యించుకంతయుభయంబెరుగకుండెనుగ॥ స
మరయత్నముమహాసంతోషగరిమమని। మనమునుప్పొంగుచునుదనుజ
నాయకుడు॥ తనప్రధానులహితులదండనాథులబిలచి। సమరప్రయత్న
ములుసమకట్టుమనియె॥ తనకోటగలయట్టిదనుజకోటులకెల్ల । సమరగ
మనంబుతాసెలవిచ్చిపలికె॥ సేనలెల్లనుగదలజగముతల్లడమంద। వెల
యంగరణభేరివేయించెనపుడు॥

### శతకంఠుడు రామునిపై యుద్ధమునకరుగుట.

పణవఢక్కాభేరిబహుతూర్యనాదములు। బరగెదిక్పాలకులువె
రగుబొందగను॥ బ్రహ్మాండభాండములుపగిలిబీటలుబారె। ఘోరమహాప్ర
స్థానభేరిమ్రోతకును॥ సప్తసంద్రములొక్కసరణిగాఘోషించె। నపుడు
లోకములెల్లవిపరీతముగను॥ గతిదప్పెసూర్యుండుగగనమంతయువణకె।
కులగిరులెల్లనుగూలివరిగెనుగ॥ సమరసన్నాహుడైశతకంఠుడావేళ। కా
లమృత్యువురీతిగందుమీరుచును॥ తళతళనవరత్నతళుకులుప్పతిలంగ।శి
రములనుధరియించెశతకిరీటములు॥ మణిమండలప్రభలుమకరకుండనము

లు। ఘనుడుతనయిన్నూరుకర్ణములదాల్చి॥ కమనీయకరమైనకనకమణి
హారములు। కంఠమునధరియించెకళలుశోభిల్ల॥ దివ్యరథమవ్వేళతేజరిల
గొనితెచ్చి। ముదమొప్పసూతుండుప్రోలనిల్పెనుగ॥ సరగఁగుబ్బునవె
డలిసంతోషముప్పొంగ। ధీరతనుశతకంఠుదివ్యరథమెక్కి॥ దనుజులొక
వెయికోట్లుదట్టముగతనుగొల్వ। రథమెక్కివెలుగొందెరాక్షసేశ్వరుడు॥
ఆదినారాయణుండారాఘవుండనుచు। చెలువుగామహాలక్ష్మిజానకీయను
చు॥ సురలువానరులంచుమరణంబునిజమంచు। తల్లిమాటలుమదినిదల
పడాయెనుగ॥ వైకుంఠమునకేగువడువునరథమెక్కి। కాలమృత్యువు
రీతిగర్జిల్లుకొనుచు॥ దివ్యరథమునమిగులధేజరిలుచుండంగ। వింజామరలు
చాలవిసరుచుండిరిగ॥ నెలమితోరాక్షసులుమలయానిలముచల్ల। ధవళా
తపత్రములుతగకోట్లువెలయ॥ పణవఢక్కాభేరి బహుమృదంగంబులు
ను। శంఖనాదంబులును చెలగిమ్రోయగను॥ ఏదిక్కుజూచినాయేడునూ
రామడ। కడునిశాటులుదర్లెపుడమీనినట్లు॥ గదలుచేబూనుకొనిగజబృం
దములనెక్కి। పదుగురునుమంత్రికోవిదులుదర్లిరిగ॥ కొమరొప్పనేనూరు
కోట్లదనుజావళులు। వొక్కరొక్కనివెంటనొప్పదర్లిరిగ॥ పదిలక్షపదికో
ట్లుభద్రగజములుదర్లె। ఘోటకంబులుదర్లెకోట్లకొలదిగను॥ పవనవేగ
ముకన్నజవమైనఅశ్వములు। కొమరొప్పశతలక్షకోట్లుదర్లెనుగ॥ పురవీధి
వీధులనుతెరిపిలేకుండంగ। బలురాక్షసులబలమువెలయదర్లిరిగ॥బలము
లునడచినడువనిలపరాగంబెగసి। రవిమండలముగానరాకుండయుండె॥
పలుమారుదూతలనువలదంచుపంపంగ। తల్లిమాటలువినకదైత్యుండు
దర్లె॥ భుజముపైశూలంబుబూనుకొనిరాక్షసుడు। వెడలెముల్లోకములు
గడగడనువణక॥

శతకంఠునికి దుశ్శకునములు గనఁబడుట.

ఆవేళనధికగృధ్రావళులుపరవిచ్చి। అసురవల్లభుమీదనాడదొ

ణగెనుగ॥ అరయనెత్తురువానగురిసెసేనలమీాద । పిడుగులుబడజొచ్చె
బెడిదంబుగాను॥ వరదులుదలలెత్తివాపోవగాదొణగె । వెలయగోడుగు
లునేలవిరిగికూలెనుగ॥ పెపుగాపెనుగాలియెదురుగాజనుదెంచె । మేలై
నతురగములమేతలుడిగెనుగ॥ చెలగియడ్డంబుగాచెవులపోతోకటొచ్చె।
అతివిలాపమునొందెనాకాశవాణి ॥ మోదహీనుండగుచు రోదనముసే
యుచును । అంధుడొక్కడువచ్చియడ్డమెసెలచె ॥ మరియుముందరనొ
క్కమలినవస్త్రిముతోడ। విధవయేడ్చెనుపూర్వవిధిదలంచుచును ॥ అ
వశకునములుయిట్లుఅడ్డంబుజనుదేగ । కఠినదైత్యుడువాటిగణుతింపడా
యె॥ కాలమాసన్నంబుగలిగితనకండగా। నేలనవశకునంబులెంచుదను
జుండు॥ గర్వాంధకారంబుగప్పికోపోగ్రుడై।శమనదేవునిరీతిశతకంఠుడొ
ప్పె ॥ ప్రళయభైరవమూర్తిప్రతిబింబమైమహో । అన్నులొదవుచుదర్లిన
సురనాయకుడు॥ కపికులాటవిగాల్పగావచ్చునసలమో। మీారిజగములు
బ్రింగుమృత్యుదేవతయో॥ అనియెరుపాటెమిగొనజాలకుండంగ । కపుల
దరిదరిజేరికఠినరాతిసుడు। దానవులుపెల్లార్పదనుజేసుదుగ్రుడై । కపుల
మూరొక్కనెసమరరిపులుభీతిలగ ॥ మిన్నుముట్టినదనుజకన్నులను బొఢ
గాంచి। కడుభయాతురులైరికపిబలంబంత ॥ గర్వమెల్లనుదూలిగంభీర
ములుడస్సి। గగ్గోలుబెట్టుచునుకపులుభీతిలిరి॥ మానములుచెడనాడిమది
నిమేరలుదప్పి। పారజొచ్చిరిరాముబలమెల్లగదిలి ॥ రూపములుచెడివిక
లరూపములుగై కొనుచు। నిలువకనుకొందరునునేలగ్రాకిరిగ ॥ పారిగిరి
గుహలందుదూరినిల్వగలేక। నచటవీడొక్కనిగుండెలవసికొందరును॥రా
మచంద్రుడుమనలరక్షించుకర్తయని। కొందరరిగిరిరాముగోరిశరణను
చు॥ దానవులబాడగాంచిదండములుబెట్టుచును । కొందరసరులవినుతి
గోరిజేసిరిగ॥ గగ్గోలుపెట్టుచునుకపిసేనయావత్తు। నెల్లదిక్కులకరుగనిన
సుతుడుజూచె॥

## సుగ్రీవుడు కపులకు ధైర్యము చెప్పుట.

వానరావళులార మానంబువిడనాడి । పారదగునామీకు బలవిహీనమున ॥ మనకసాధ్యంబైనదనుజనిబరిమార్ప । నాలాయమైయుండె నార్తరక్షణుడు ॥ రక్షించుకర్త శ్రీరామచంద్రుడుగలుగ । తరుచరవరులార వెరపేమిమీకు ॥ వెరపుగల్గినవారునరకమునిమరుగునను । జేరియుండగవచ్చుచింతింపదగున ॥ పౌరుషవంతులై బలవిక్రమముజూపి । అసురుతోపోరాడుటదికీర్తిమనకు ॥ పోరాడగాలేకపారిగిరిగుహలందు । దూరియుండినమనకుదోషంబువచ్చు ॥ దనుజతోపోరాడతరముగాదనువేళ । కలదుపోరాడుటకుకమలనాభుండు ॥ అడుగమనపాలింటియార్తరక్షామణిజెగదేకవీరుండుజానకీవరుడు ॥ శరణాగతత్రాణబిరుదుడై కొనియుండె । దానవసంహారుడుధరణిపాలకుడు ॥ కాకుత్స్థకులవరుడుఘనపుణ్యచరితుండు । దీనరక్షామణిదేవదేవుండు ॥ తృణలీలదానవునిదునుమాడు వేళ । కోరిదనుజునిచావుచూడండిమీరు ॥ దాపుప్రాపునుతల్లితండ్రియైమనసెల్ల । రక్షించుకర్తశ్రీరాముడుండంగ ॥ భయముమీకేమినిర్భయులగుచుమీరంత । రండిరండిటకుశ్రీరామునసన్నిధికి ॥ అనివేగమరలించెనాసైన్యములనెల్ల । మరలికపులంతధీమంతులై యపుడు ॥ గిరివరత్వాజమ్ములరజేతులనుబట్టి । పెల్లుగానార్చుచునుభీకరాకృతిని ॥ శ్రీరాములకుమ్రొక్కి శతకంఠుదునుమాడి । మరలవత్తుముశరవుమాకివ్వమనిరి ॥ చిరునవ్వువెలయంగ శ్రీరామచంద్రుండు । అంతవారలుమీరకాదురోయనెను ॥ ఉత్సాహమునమీరలిచోటనుండుడని । వచ్చిశతకంధరునిపై ఖరులుగనెను ॥ తననూరుచేతులనుధనవులనుధరియించి । ఘోరశరములుబూనికోదవచేతులను ॥ భుజముపై శూలంబుబూనుకొనిధీరుడై । నింగిముట్టగపాడవునిలచిమాచుచును ॥ నూరుమొగములపై నిభోరునసుయనలములు । వెడలుకాలాగ్నివలెవికృతరూపమున ॥ వచ్చురాక్షసవీరునచ్చెరువనుగాంచి ।

భయముకోపమునాత్మబరిఢవిల్లెనుగ॥ నేమారురాక్షసునివికృతరూపము జూచి। ఆశ్చర్యమానసుండై రామవిభుడు॥ విభ్రాంతచిత్తుడై విభీషణుని బిలిచి। ఈమహాశూరుండెవ్వడో చెప్పుము॥

రాముడు విభీషణునివలన శతకంఠు నెరుగుట.

ఖండకృతాంతుడో ఖండికానాధుడో। కాలమృత్యువో కాకకడు భూతచయమొ॥ ఎవ్వడోవీడు మాకెరుగంగ జెప్పుమా। వీనిరూపము ఘోడవింతమైనోచు॥ వీనిబాహాశక్తివీనిశ్చౌర్యముజూడ। వీనితో సరిబోరుపీరుండు లేడు॥ వీని పేరేమిటో వివరించిచెప్పుమా। పరమాప్తుసవు ప్రాణబంధుడవునీవు॥ అనిరాఘవేశ్వరుడుతనతోడబలుకంగ। కరయుగంబులు మోడ్చిఘనుడిట్లులనియె॥ దేవదేవమహానుభావరఘునాయకా। ఆదినారాయణాయవతారపురుష॥ వీడుశతకంఠుండువిక్రతాకారుండు। బహుమాయవర్తనుడుపరమద్రోహుండు॥ ఇతనిచేమనబలములెల్లనుమృతిబొందు। చలగిరణమునబోరశక్యంబుగాదు॥ వీనిరక్తపుచుక్క వెలసినేలనుబడిన। వీనివలెబుట్టెదరువీరులొకనూరు॥ వారంతవీనివలెపోరాడుచుండెదరు। వనజభవుడిచ్చినవరమహాత్మ్యమున॥ వీనితో బోరాడివీనిధాటికినిల్వ। వనచరులకెవ్వరికివశముగాదనెను॥ ఇలజనులకందరికివితడజేయుండయ్య। తరముగాదెవ్వరికిదనుజుతో బోర॥ నెట్లుజయమొందునో యేమికథజరుగునో। తోచదేమియునాకుతోయజేక్షణుడ॥ వీనిమించినవారువీనిసరదార్లంత। మంత్రతంత్రజ్ఞులుమాయవాదులును॥ ఈరాక్షసునిగూల్పనీవకాలెవ్వరును। భరియింపగా లేరుపద్మలోచనుడ॥ ఇకజాగుసేయంగనేలవిల్లందుకొని। ఆజ్ఞేయబాణంబులందు శ్రీరామ॥ నేలరక్తకణంబురాలకుండగజేయు। మాయశతకంధరుటుమహినిబుట్టరుగ॥ దైత్యేంద్రుమంత్రులకుతగినట్టిశూరులను। మనవారినేర్పరచుమానవేశ్వరుడ॥ అనిరాముతో జెప్పిఆంజనేయునిజూచి। అంజనీనందనాలనమానశౌర్య॥ సమ

యమిదిగో గెలుపునకుఁ గూడ జేయవలె। నరయ మాకందరికి నాత్మబంధుడ
వు॥ దానవుడు నామీఁదఁ గోపమును బూంది। విగ్రహించుచునుండు నాగ్రి
హంబునను॥ ఆగ్రహంబున దనుజుఁ డరుదెంచు వేళను। కాపాడవలె నన్ను క
రుణతో నీవు॥ పవననందనుఁ డనాధార మే నీవనుచు। తన సేవతోఁ దానుదట్ట
మున నుండె॥ రామపార్శ్వమున రంజిలుచు హనుమంతు। వాలంబు ద్రి
ప్పుచును వడిమీఱియుండె॥ భరతుఁడును లక్ష్మణుఁడు మరియు శత్రుఘ్నుఁడు
ను। కుశలవులు విజయుడును గూడియుండిరిఁ॥ సుగ్రీవాంగదముఖ్య కపు
లెల్లను మిన్ను। పగుల నార్చుచు రాము బలసియుండిరిఁ॥ శ్రీరామచంద్రుం
డు చేవిల్లు బట్టుకొని। వారి శాంకృతులెల్ల భోరుకొల్పుచును॥ ఉరుటుగా
బాణములు పొదిలోన బరవుచును। పెక్కువిధముల విజృంభించుచుండెను
ఁ॥ సూపుమొగములయందు భోరుననుయనలములు। మంట లెగయఁగ
చాలకంటకంబునను॥ ఘనుఁడు శతకంఠుండు తనబలంబులఁ జూచి। శలవిచ్చె
యుద్ధంబు సలుపబొమ్మనుచు॥

వానరులు దానవులు పోరుట.

కాలజీమూతంబు బోలి రాక్షసబలము। చెలగుచును శ్రీరామసేన
పైఁ గవిసె॥ శరచక్రములు బూని తరుచరానీకములు। మారుకొని పోరాడె
వీరరాక్షసులు॥ ధరపరాగం బెగయ నురువడిఁ దాటుచును। కపిసేనపైఁ
విసెఘనులు రాక్షసులు॥ కార్చిచ్చువంటి బెగ్గలమైన రూపములు। గనుప
ట్టకపులపైఁ గదసె రాక్షసులు॥ ఏది వానరబలము యేది మానవబలము। అ
నుచు బలములఁ గవిసి రపుడు రాక్షసులు॥ కులశైలముల రీతి కుంజరేంద్రంబు
లను ఢీకొల్పి వానరాధిపుల గదసిరిఁ॥ భూమితల్లడ మొంద భూరజం బెగ
యంగ। కోటులర్బుదములు దీటుకొల్పిరిఁ॥ అవనితల్లడమంద నర్బుదంబు
లుకొద్ది। రథము లుద్ధతి దోలె రాక్షసావళులు॥ కడలేని బాణములు రొడ తె
రిపి లేకుండ। బలములన్నియుఁ గప్పి బలులు రాక్షసులు॥ సింహనాదంబులు

నుచెలగివిన్నంటంగ। సార్వులాదవుచుపోరిరసురవల్లభులు॥గిరివృక్షము
లేబట్టితరుచరావళులెల్ల। నెదురుకొనిరాక్షసులగదసిరుద్ధతిని॥ రారోయి
కపులారరండివేగంబనుచు। వశ్చిమసముద్రంబువగిదిగవసిరిగ॥ కడుశై
లములబట్టికందుకంబులరీతి। వీరరాక్షసులపైవిసరెకపిబలము॥ ధీమంతు
లైకపులుయేమరకవృక్షములు। దనుజకోటులమీాదతరివిఃవిసరిరిగ॥ పె
క్కునేర్పులమీాదనక్కజంబుగపోరి। రుక్కుమీారుచునిట్లునక్కవీశ్వరు
లు॥ తన్నుచునుజీరుచునుతగుముష్టిబాదుచునును। కరచుచునువలుగతు
లగాసిజేయుచును॥ వాలమునజుట్టుచునువడినిబడద్రోయుచును। నేలబె
ట్టేద్చుచునుసింగికెగయుచును॥ ఈరీతికపిబలముపోరాడుచుండంగ। బ
లుకోపులైదైత్యభటులంతలోన॥పరిఘుపట్టిసచక్రకరవాలతోమరముస
లాయుధములెల్లవిసరిరుద్ధతిని॥ మరియుమరియును పెక్కుశరములుద్ధతి
బూని। కపిబృందములగప్పినపుడురాక్షసులు॥ అతితీవ్రశరములుద్ధతిని
మరిమరికొన్ని। వేలులక్షలకొలదివేసిరాక్షసులు॥ దనుజశరములుగాడి
తరుచరబలమెల్ల। బలుగతులమూర్ఛిల్లిబరవశంబైరి॥ శరములరుదుగ
నాటివరవశంబునుబొంది। బడిరిమర్కటబలముబహువిధంబులను॥ వడ
గళ్లవరషంబుపుడమిగురిసినలాగు। రాక్షసులపైగురిసెరాళ్లవర్షంబు॥నే
లైనశైలములుకోటులర్బుదములును। ఒక్కపెట్టునవిసరిరుజ్వలంబుగ
ను॥ నగముచేతులబట్టిగగనవీధికినెగసి। గురిజూచిరాక్షసులగూలనేసిరి
గ॥ కోలాహలముమీారికప్పించిదాటుచును। పిడుగుపాటునముష్టిబాడచి
కూల్చిరిగ॥ రథముపై కెగసిసారథిరథులబరిమార్చి। అశ్వసమదాయ
ములనవనిగూల్చిరిగ॥ మదగజముతోనొక్కమదగజముగూల్చుచును।
గుఱ్ఱముతోగుఱ్ఱమునుగూలనేసిరిగ॥ తరువుచేబట్టుకొనిగిరగిరనుద్రిప్పు
చును। కాల్బలంబులనేలగలియగొట్టిరిగ॥ రథముతోనొకరథమురట్టుబ
డగనుజేసి। దనుజుబట్టుకునొక్కదనుజుగూల్చిరిగ॥ పదుగురొక్కొక్క

దునిపట్టిబడఁగూల్చుచును। కరచుచుఁగొందరినిఁగాసిపెట్టిరిఁ॥ ఎడపకను
వాలములకుఁగాళ్ళపైఁజుట్టి। పడఁద్రోచిగుండెపై బాదచికూల్చిరిఁ ॥ న
డుము పై వాలంబువడిమీఱఁగాఁజుట్టి। ఆకసంబునకెగయనపుడువిసిరేసి॥
భళిభళీయనివచ్చిపట్టిముష్టినిబాదచి। పడఁద్రోచినేలపై బట్టియీడ్తురుఁ॥
పిడుగుపాటునవచ్చిపెడిదముఁగబాదుచుచును। తన్నుచునుజీరుచునుధర
ణిఁగలుపుచును॥ కుంభికుంభంబులనుకూలంగదన్నుచును। కోట్లగజముల
నేలఁగూల్చివేసిరిఁ॥ ముష్టిఘాతంబులకు మొగిసిజెగ్గుర్రములు। గుండెలవ
యుచు నేలఁగూలెఁగోట్లుగను॥ కోరిరథములపై కికుప్పించిదాటితే। గుండ
ఱ్ఱెరథములుఁగూలెసారథులు॥ పుడమిపరాగంబువడిమీఱఁగానెగసి। క
డువడినియాకాశగంగలోఁగలిసె॥ కూలెరాక్షసపౌంజుకోటానకోటులుఁ
తెట్టతెట్టలుగాను తెరిపిలేకుండ॥ తునియలై యమ్ములునుతునకలై చరణ
ములు। పరియలై బాహువులుధరణిపై బడియె॥ నడుములనుమోకాళ్లు
తొడలుఖండితమగుచు। బడిరిదానవబలముబహువిధంబులను॥ ఇట్లుద
నుజావళులుయిల్లపైనిఁగూలంగ। శేషించియున్నట్టిసేననాయకులు॥ బలు
గర్వములమీఱిపంతములుబలుకుచును। కపిబలంబులపైనిఁగవిసిరుగ్రత
ను॥ చేటుపాటుఁగబట్టిచెలరేఁగిబాణములు। కపిబృందములఁగప్పిరపుడురా
క్షసులు॥ పదులునూరులువేలుబహులక్షబహుకోట్లు। బలుశరంబులుఁ
ప్పెబలముకంతటికి॥ శరములురువడిదాకిశిరములును తెగిరాలి। తొడవిరి
గితరుచుఁగాబడిరిమర్కటులు॥ అధికముఁగపటుశరములంకింపవడినేసి। క
పులమిక్కిలిఁగూల్చిరపుడురాక్షసులు ॥ మదగజేంద్రంబులనుమార్కొను
చుడీకొల్పి। ద్రొక్కించిమర్కటులమొక్కణంచిరిఁ॥ అడిదములుచేబూ
నిఅశ్వములనదలించి। కడువడినిమర్కటులకదిసిదునిమిరిఁ ॥ శిరముతెగి
రాలంగసరికిభూమికినాట। సరకద్రోణగిరిఖండతరముమీఱుచును॥ వెల
యుతోలకరిమెఱుపువలెతురగములుద్రిప్పి। కపివరులదునుమాడిరపుడురా

క్షసులు॥ ఝుట్టిమల్లులురాగమట్టిమల్లాడుచును। తలలు తెగనేయుచునుబ
లిమిజూపుచును॥ చేటుపాటుగనిట్లుచెలరేగివానర। బలములనుదునుమా
డెబలులురాక్షసులు॥ పీనుగపెంటలై వానరబలమెల్ల। వేలులక్షలుకో
ట్లుకూలెనవ్వేళ॥ నిలువెల్లబాణములునిండితెప్పిరిలేక। నీల్గిరందరుకపులు
నిలిచియున్నట్లు॥ కూలుకపులనుగాంచికోదువేమిలేదనుచు। వీరసాహస
వృత్తివెలసివానరులు॥ తమమనంబులచాలధైర్యములుదెచ్చుకొని। వన
చరబలమెల్లవక్రముఖముననను॥ పంతమునరాక్షసబలముమీదనుగవి
సి। రేమిచెప్పుదువారితామసములెల్ల॥ కరచుచుననఖములనుకండలుగ
జీరుచును। కడువడినిబాడచుచునుకాళ్ళదన్నుచును॥ ధట్టించిమోకాళ్ళ
దన్నుచునుకరచుచును। పిడికిళ్లబొడుచుచునుపుడమిగూల్చుచును॥ మర
చిపాటునవచ్చిమరియుకలబట్టుచును। పడద్రోచిపొట్టలుబగులదన్నుచు
ను॥ పటువాలములజుట్టిపడద్రోచిత్రొక్కుచును। గిరులుపడవైచుచును
నురుముజేయుచును॥ చరణాగ్రనఖములనుమరిమరియుజీరుచును। పలు
విధంబులబట్టిభంగపరచుచును॥ వెనుకమూరుగవచ్చివీపుపైదన్నుచును।
పడినదనుజునిగుండెపగులమోదుచును॥ కడుశైలములదెచ్చినడునెత్తి
నైచుచును। తలవ్రక్కలైపోవధరణిగూల్చుచును॥ పలువిధంబులనిట్లు
చలరేగివానరులు। దనుజుచేతులుబట్టిధరణిగూల్చిరిగ॥ ఏనుగతుండము
లుమెగసిచేబట్టుకొని। గిరగిరనుద్రిప్పుచునుధరణిగొట్టిరిగ॥ కులగిరులగ
తినేలగూలినడియేనుగులు। వేలులక్షలకోట్లువిద్ధూరముగను॥ కొండలు
పొడవుగాకోటానకోటులు। అశ్వసముదాయంబులవనిగూల్చిరిగ॥ బలు
వుమీరినమహాపర్వతంబులునైచి।బలురథంబులునేలపాలుజేసిరిగ॥ దాం
తులుగగిరులచేబంతులుగబట్టుకొని। కపిబలంబంతయునుగదిసిరుద్ధతిని॥
ఒక్కతీరుగనవిసరిరుజ్వాలాకృతిమీరి। దనుజబలములునేలదగ్ధమైకూల॥ వ
డగళ్లవరషంబుపుడమిగురిసినలాగు। గురిసిరసురులమీదగిరులవరషం

ఉ॥ గిరివర్గ మునజిక్కినసుర వైరిబలమెల్ల। గుండెపిండై నేలగూలిర వ్వేళ॥
అవనినిండగ గూలెనశ్వసముదాయములు॥ మడిసెకోట్లకోట్లందిమడిసెరా
క్షసులు॥ కోటానకోట్లుగాగూలెరాక్షసబలము। పీనుగపెంటలై కానబ
డుచుండె॥ కోట్లకొలదిగవచ్చిగూడిపోరినపోంజు। లెక్కదానవులుండిర
క్కజంబుగను॥ ఎల్లధైర్యములాడి పెల్లార్చుబలమెల్ల। మర్కటవరులచే
మడిసిపోయిరిగ॥ పలుమాంసరాసులుపర్వతంబులపోడవు। కుప్పలై పడి
యుండెకోట్లకొలదిగను॥ పోగులునుమొప్పులునుపోగులై పడియుండ। తె
గినవుణికెలు నేలనగణితంబయ్యె॥ పెదపెద్దమొనలెల్లపీనుంగుపెంటలై।ర
క్తమాంసముగ్రొంపిరణభూమియయ్యె॥ చాలనెత్తురుయేర్లునేలబారుచు
నుండె। మిన్నంటిపొంగుచునుమిక్కుటంబుగను॥ రక్తపుకేటిలోరట్టాడు
కొనిభూత। భేతాళములునిండ వేటాడుచుండె॥ ఈపాటిమాంసంబునెన్న
డెరుగమటంచు। చెలరేగియాడుపిశాచసంఘములు॥ పాటించితాటించి
మేటిమైయుండదందు। తగఢాకినీగణముతాండవంబాడు॥ ఢాకినీసంఘము
లుడాసిమెదడుభుజించి। యీగలింపుచునుండెఢాకినీగణము॥ శాకినీగణ
ములనుఢీకొనుచునెత్తురులు। వాలలాడుగ్రభేతాళరవములును॥ గలిసి
పురివిప్పుచును కేకలాడుచునుండ। కేగికాకులనుగమకించుగద్దలును॥ గ
లిగికావిరిదిశలుగప్పిపగలును రేయి। గానరాకుండంధకారంబుగప్పె॥ అ
భ్రితలమునవిల్చిఅమరాదిదేవతులు। కపులశూరత్వములుగనిసంతసిలి
రి॥ కపులశూరత్వములుగాంచిసంతసమంది। నాట్యంబులొనరించెనార
దామాని॥ కడుపునిండినపోరుగలిగెనిన్నాళ్లకని। గెంతుగెంతునతెంచెఘ
నుడునారదుడు॥ బ్రహ్మదేవుండప్పుడుప్రళయకాలంబనుచు। కాలంబులె
క్కింపగాదోణంగెనుగ॥ ఘనసముద్రమురీతికడువింతరంజిల్లె। గాఢమైర
ణభూమిగానబడుచుండె॥ రక్తోదకముభూతరాగంబునిడి ఘోష।వెలయు
తురంగముల్ వింజామరములు॥ శరములురగంబులుచక్రములుకూర్మ

ములు। వెలయుపీనుంగులువీరమకరములు॥ మీానములుఛత్రములు మెర
యుఘనరత్నములు। బడబాగ్నిచందమునభాసిల్లి యుండె॥ ఆరీతిరణభూ
మిఅంభోధిచందమున। జాలుపారుచుండఁగగనిదైత్యవరుడు॥ సకలదా
నవబలముసరిపుచ్చెకపిబలము। ఘనసముద్రముబోలి కానంగబడెను॥ స
రదార్ఘ్యమాత్రముసముఖస్థులై యుండి। బ్రతుకుటకుయోగంబుపట్టియుం
డెనుగ॥ పరదార్ఘ్లలనేముందుసమరముకుబంపితె। కపిబృందములనేలగ
లిపివత్తురుగ॥ పొరపాటువచ్చెముందరసేనలంపుటయు। దైవయోగంబె
వరుతప్పింపలేరు॥ ఇపుడుమించినదేమికపులజంపింతునని। కడురౌద్రము
నుబొందిఘనుడుశతముఖుడు॥ దీర్ఘజిహ్వునిబిలిచిధీరుడానీవేగి। కపివరా
నీకములకడతేర్చిరమ్ము॥ ఆమీాదరాఘవుఁహాతమార్చెరమ్మనుచు। శలవి
వ్వరాతసునిశలవుగైకొనుచు॥

### భరతుడు దీర్ఘజింహ్వుని జంపుట.

దీర్ఘజిహ్వుండరిగెదిశలుకంపమునొంద। పైకినాలుకచాచిపరు
వడినివచ్చి॥ కాలరుద్రునిఫగిదికపిసేనపైగవిసె। ఏమిచెప్పదువానితామ
సంబెల్ల॥ కపిబృందములపైనిగవిసిపోరుచునున్న। కడురాతసునిజూచిక
మలనాభుండు॥ అటుబోకబోకురాఅసురాధమాయనుచు। తనవిల్లుచే
బట్టెవనజగర్భుండు॥ ధనువుచేబట్టుకొనిదానవులుభీతిల్ల। గుణమెక్కు
గావించికోదండపాణి॥ గుణరవధ్వనులచేగూలెకులశైలములు। భూమి
గడగడవడకెఘోరజంబెగసె॥ దివ్యబాణములందిధీరుడైశ్రీరాము। బర
పెరాతసునిపై తెరపిలేకుండ॥ బాణములురాతసునిమేనుపైగాడంగ। ర
ఘురాములెదురుగారథమునడిపించె॥ అంతలోపలభరతుడడ్డంబుగావ
చ్చి। నిలచిదనుజునిగాంచిబలికెతానపుడు॥ ఓరిరాతసవీరఉగ్రరణమున
నీవు। నిలచినాతోపోరునీపొంకమణతు॥ బాణాగ్నిచేనిన్నుబరిమార్చియ
మపురికి। నిజముగాబంపింతునిన్నుయీావేళ॥ అనినవినిరాతసుడుకనులని

ప్పులురాల। పళ్లుపటపటగొరికిబలికెభరతునితో॥ ఏరమనుజాధమా యెదురుదెలియకనీవు। నాకడ్డమైవచ్చినావుయీవేళ॥ నినుబట్టివధియింతునిజముగానీవేళ। చూడునాభుజబలిమిచూపెదనుయిపుడు॥ నాతోటిసరిబోరనాకేశుశక్యమా। కదసికండలుజేతుమెదలకుండగను॥నిన్ను బరిమార్చెదనునీయన్నరాఘవుడు। వచ్చినాబడగూల్తునొక్కబాణమున॥ ఘనువిభీషణుడువచ్చినవానిజంపెదను। తడయకుండగనొక్కగడియలోపలను॥ శౌర్యమునలక్ష్మణుడుజనుదెంచినాగాని। కూలనేయుదునొక్కకోలతోవాని॥ మఱియెవరువచ్చినాబరిమార్తునవలీల। నజుడువచ్చినగానిహతముజేసెదను॥ అనినభరతుడునవ్వియసురుడాప్రల్లదము। లేలబల్కెదవునీకేమిలాభంబు॥ ఘనశరంబులనిన్నుగడతేర్తునిటుచూడు।మనిదైత్యపైవైచెఘనశరంబొకట॥ భరతుడేసినదివ్యబాణంబుఖండించి। తిరిగిబాణమువేసెసురవైరిబంటు॥ అదితూలగానేసెనారామసోదరుడు। సింహనాదముజేసిగంభీరంబుగను॥ ఘనశరంబొకటందికొనుకోరాయంచు।తగరాక్షసునిజిహ్వతెగవ్రేసెనపుడు॥ తనజిహ్వనష్టమైపెనుగొన్నకోపమున। ప్రళయాగ్నిగతిమండిబలుడురాక్షసుడు॥ రౌద్రాస్త్రమొకటేసిరాముతమ్మునిమీద। కంఠీరవధ్వనులుగదురనార్చుచును॥ ఆబాణమవలీలహతముగాదునుమాడి। అన్నరాముడుమెచ్చహస్తములుదునిమె॥ వానరుల్పెల్లార్వవక్కనిముషములోన। నసురునాలుకకరములవనిబడగూల్చె॥ కరములునుతనజిహ్వకడతేరిపోయెనని। సిగ్గుపడకేమియనుచెనటిరక్కసుడు॥ భరతుబ్రమింగెదనంచుబలుకోపుడై రాగ। నంతలోహనుమంతుడడ్డమైవచ్చి। సిగ్గుమాలినదైత్యనిలువుమనిపల్కి। వానికంఠముద్రుంచెపూనిఖడ్గమున॥ అట్లుఖండనములోనవనిపైబడిదీర్ఘ। జిహ్వుండుకడతే

## శత్రుఘ్నుడు శిఖిముఖుని జంపుట.

రశిఖిముఖుండపుడు। విలయకాలమునాటివీరభద్రునిరీతి। గవిసెభరతు

నిమీఁదఘనుఁడుశిఖిముఖుఁడు॥ అన్నమీఁదనుఁగవిసినట్టిదనుజునిఁజూచి।శత్రు భీకరుఁడైనశత్రుఘ్నుఁడపుడు॥ అర్ధచంద్రాస్త్రంబులవివింటసంధించి। వేసెశిఖిముఖునిపై వీరహంకృతిని ॥ అవియెల్లఖండించిఅతనిపై రాక్షసుఁడు। తిరిగిమైంద్రాస్త్రంబుదాడిగితావేసె॥ దానినడుమనుద్రుంపదైత్యుఁడంతటిలోన। నురగబాణమువేసెసురలుభీతిలఁగ॥ గరుడబాణమువేసెభరతునితమ్ముఁడు।యురగబాణముగూల్చెత్వరితమార్గమున॥ యురగబాణంబిట్లుధరణిఁగూలుటఁజూచి। క్రోధాంతరంగుఁడై క్రూరరాక్షసుఁడు॥ పాశుపదాస్త్రంబుభరతుతమ్మునిమీఁద। వేసెనుర్మదవృత్తినాశరంబపుడు॥ పొగలుమంటలుమింటఁబుగులుకొనిశరమేఁగి। భరతుతమ్మునిదూసెసురలుభీతిలఁగ॥ శరముమేనునుగాఁడిశత్రుఘ్నుఁడావేళ। సొమ్మసిలితాలేచిజూచికోపమున॥ ధీరుఁడై వేగమునారాయణాస్త్రంబు। వింటసంధించిబలుమంటలెగయఁగను॥ ఆర్చిపడిఁనేయంగఆదివ్యశరమపుడు। చెలఁగెమంటలుమింటచెదిరియేగెనుఁగా॥ రిపులుమొఱలుపెట్టితపియింపుచుండంగ। భువనములువణఁకెనంభోనిధుల్ గలఁగ॥ శిఖిముఖుఁడువణఁకుచునుచెలఁగిమొఱలుపెట్టి। చిచ్చులోఁలుకుచువానిశిరముతెగఁటారెఁ ॥ శిరముతెగిదానవుఁడుధరణిపైఁబడిగూలె। దనుజసంఘము[illegible]తల్లడించిరిది ॥ శిఖిముఖుండీరీతిజీవములువెడబాసె। సురలుపు[illegible]వానగురిసిరవ్వేళ॥

[illegible]క్ష్మణుఁడు శూలహస్తుని జంపుట

11061

శూలకంతుఁడువచ్చె[illegible]శూలంబుచేఁబూని। విలయ[illegible]రవమూర్తివేషంబుతోడ॥ గనిలక్ష్మణస్వామిదనుజుకడ్డమునిలచి। [illegible]నాతోఁ బోరి రాక్షసాయనెను॥ కంటకంబు[illegible]చికంటనిప్పులురాల[illegible] పటుదివ్యబాణములుబరపెరాక్షసుఁడు॥ దనుజుఁడేసినబాణ[illegible]ఖండించి। తనబాణతతులేసెఘనుఁడులక్ష్మణుఁడు ॥ బలుఁడులక్ష్మణవీరుపటుబాణములుద్రుంచి। అనలబాణములేసెనపుడురాక్షసుఁడు॥ అసురనాథుండేయునసలబాణము

లెల్ల। వారించెసౌమిత్రివారణాస్త్రమున ॥ కలహించిదానవుడుకన్నులెర్రగజేసి। కూలుమనిపటుఘోరశూలంబువిసరె॥ దానవుడుశూలంబుతప్పకుండగవిసర । అనలములుగ్రక్కుచునాశూలమేగ ॥ భూమితల్లడమందిభువనములుకంపించె। అద్భుతంబునుబొందెనమరాదిసురలు॥ అంతలోహనుమంతుడడ్డంబుగావచ్చి। జనుదెంచుశూలంబుతనకేలనందె॥ రెండుముక్కలుగానుఖండితంబులుజేసి । దూరంబునకువిసరిపారవేసెనుగ॥ హనుమంతువీక్షించియాలక్ష్మణస్వామి । ప్రాణబంధుడవనుచుప్రస్తుతించెనుగ॥ మరియులక్ష్మణసామిమదిరోషమునుబొంది। కౌశికుండిచ్చినాఘనశరముదీసి॥ తనచాపమునబూనిదనుజునిగూల్చుమని । కంఠీరవధ్వనుల్గదలజేసెనుగ॥ అనలములుగ్రక్కుచునుఆదివ్యశరమేగి । దనుజువక్షస్థలముతాదూసిపోయె॥ వక్షస్థలముదూసివ్రాలినేలనుగూలె।స్థూలకంఠుండపుడుసురలుమోదింప॥ స్థూలకంఠుండిట్లునేలగూలుటజూచి। కనలుచునువచ్చెయోజనహస్తుడపుడు ॥ ఆమడామడపొడవు హస్తముల్విసరుచును। ఏడిలక్ష్మణవీరుడేడేడియనుచు ॥ వచ్చిలక్ష్మణవీరునొడసిపొడబట్టుకొని। కదలకుండగబట్టెఘనుడురాక్షసుడు ॥ కదలిమెదలకయుండకట్టునిల్పినరీతి। ఆలక్ష్మణువీరుబలశాలినపుడు॥

శతకంఠునిమంత్రులు యుద్ధమునందుజచ్చుట.

రాహువుపట్టువిధానరాక్షసుడుబంధించె। అభ్రివాసులుభయంబందిచూడగను ॥ గనిచాలకోపమునఘనుడాకుశుండపుడు । వానిచేతులుద్రుంచెప్రాణికోపమున॥ హస్తములుతెగవ్రేయఅపుడుయాదనుజండు।కుశునిమ్రింగెదనంచుకోపమునవచ్చె ॥ తననోరుదెరచుకొని దానవుడుతారాగ। ఘోరశరములునూరుకుశుడుతావైచి॥ మించిమరిమరిశరములెంచివడినేయంగ। తూట్లైమేనంతదునిసిరాక్షసుడు ॥ కదలమెదలగలేకకన్నుదెరువగలేక। యోజనహస్తుండుయొరగెధరపైని ॥ ఇట్లుయోజనహ

స్తుడిలపై నిగూలంగ। గనిదుర్ముఖుండొకడుకనలుచునువచ్చె॥ వచ్చిరా
ఘవసుతునినచ్చెరువనుగాంచి। పోకురాబాలుడాపోకురాయనుచు ॥ హ
గ్రుడై జనుదేరనంతలోపలలవుడు। దనుజుకడ్డమువచ్చిఘనశరము వేసె॥ల
వుడేయుబాణంబులవలీలగాదునిమి । మరియుదైత్యుడు ఘోరశరము వే
సెనుగ॥ దైత్యుశరములుద్రుంచిదనుజారినందనుడు। కాచుకొమ్మనివై చె
ఘనశరంబొకటి॥ శరము మేనుననాటిచాలరోషంబునను। బాలకునిపై ప
ళ్లుపటపటనుగొరికి॥ ఆగ్నేయబాణంబులవివింటసంధించి। వేసెహుంక్రుతి
తోడ వేగరాక్షసుడు॥గనిరామపుత్రుండుకినుకతోడుతదీసి।వారుణాస్త్రం
బేసెధీరుడై యపుడు॥ ఆవారుణాస్త్రంబునాయనలబాణముల। పెల్లుగా
రాకుండచల్లార్చనప్పుడు ॥ ఆగ్నేయబాణంబులట్లుచల్లారెనని । చింతించి
యొకకొంతసేపుదానవుడు॥ ఘోరశరము వేయకూల్చితాలవుడప్పుడు। ఉ
గ్రశరమొకటందిఆగ్రహంబునను॥వింటసంధించిబలుమంటలెగయగవై
వ। ఆదివ్యశరమేగిఆదానవునకు ॥ కరయుగంబులుశిరముకడువేగమున
ద్రుంచి। పదిలంబుగాలవునిపాదిజేరెనప్పుడు ॥ దుర్ముఖుండీరీతిదూలిప్రాణ
ముపీడె। గనిమిగిలియున్నట్టిఘనులుసరదార్లు ॥ శూరతలుదీపింపశూర్ప
కర్ణుండును । పెల్లుమీరినయట్టిపింగళాక్షుండును ॥ త్రిముఖుండురౌద్రంబు
తోడగజోదరుడు। కుశలవులజంపుటకుగూడివచ్చిరిగ॥ భుగభుగనుమంట
లును మొగములనుచెదరంగ। నొక్కపెట్టునగదిసిరుగ్రులై యపుడు॥ జగ
ములన్నిటిక్రమింగజాలుమృత్యులరీతి। రామునందనులపై రాదొడంగిరిగ॥
అట్లువచ్చేవారినారామచంద్రుండు।గనియిట్లురారోయియనివారిబిలచి॥
నాతోటిపోరాడిననిగెల్చిఆపైని। వారిపై మీరుజనవచ్చురండనుచు॥ అ
రయవారందరికినన్నిశరములుపూని। కాచుకొమ్మనివేసెకమలనాభుండు॥
పటుబాణములుసోకిప్రాణములుగడతేరి। దనుజులొక్కవిధానధరణిపై బ
డిరి॥ బలుమంత్రికోవిదులుపదుగురుగూలుటకు । మదిగొంతచింతించిమ

రిశతాననుడు॥ బలములుగూలుటకుపరితాపమొందుచును। మితిలేనికోపంబుమతిదలంపుచును ॥ మధ్యాహ్నమున వెలయు మార్తాండుచందమున। త్రిపురసంహారురీతిదేజరిల్లుచును॥ పదిపదులునోళ్ల తోపళ్లుపటగొరికి। తనమోములన్నిటిని పెనుమంటలెగయ ॥ సప్తసముద్రములొక్క సరణిగాఘూర్ణిల్లు। గతినిఘూర్ణిల్లుచునుకలువరింపుచును॥ జగములన్నిటినమయజేయంగజాలిన। చలపాదియైనకృశానుబోలుచును॥ కన్నులెర్రగజేసి కలహించితలలెత్తి। శ్రీరాముసేనపై తేరిచూచెనుగ ॥ తేరిపారగజూచితీటణంచెదమిక। దిక్కెదితెన్నెదిదీనులకుయనుచు॥

శతకంఠుడు రామునిసైన్యముల దునుముట.

తలయూచిముమ్మారుతాటించిమీపాట్లు। చూచుకొండనితాను శూరతలువెలయ॥ కపిసేనపై తనదుకన్నులెర్రగగజేసి। తనయొక్కప్రఖ్యాతిధరణిగంపింప॥ నూరుచాపములొక్కబాయననుసంధించి। కొదువచేతులశరములుదుటుగాబూని ॥ కాలమృత్యువురీతికలుషలీలలుగ్రమ్మ । బలములన్నిటిపైసిబలుడుశతముఖుడు॥ ధరణియాకాశంబుతెరపిగనబడకుండ। బహుకోట్లబాణములుబరపెరాక్షసుడు ॥ తెరపితెన్నునుతేటగురుతుగనబడకుండ। కపివరానీకములగప్పెబాణములు॥ పరగనమ్ములపొదికిబాణములుచాపుట। వెలయబాణములందివిల్లందికొనుట॥ పరువడినివేయుయేర్పాటుగనబడకుండ। శరమువేసెనునిశాచరుడుధీరతను॥ పలుశరమువేయుయేర్పాటుయెవ్వరికైన। గణుతింపరాకుండదనుజుడేసెనుగ ॥ సకలబలములయందుసకలదిక్కులయందు। బరపెశరములులోకభయదరాక్షసుడు॥ అర్బుదంబులుకొలదినిర్బుదంబులుకొలది। ఖర్వంబులక్షోణికాండంబువేసె॥ వానిభుజలాఘవమువానిశరలాఘవము। పరికింపగానెంతవారుజాలరుగ॥ పొగలుమంటలుమింటభుగులుకొనిచెలగంగ । కడుఘోరబాణములుగప్పెరాక్షసుడు ॥ సకలబలములయందుచెలరేగిబాణములు।

ఘోరదైత్యుడుచాలగ్రుమ్మరించెనుగ ॥ చండవిక్రముడంచుచెప్పినందు కునెల్ల। శాఖాణముగ జేసెదనుజవల్లభుడు॥ బలుదురాక్షస ఘోరబాణా గ్ని వేడిమికి। నెల్లబలములుచాలతల్లడించెనుగ ॥ మానంబువిడనాడిమం దుకై నాగాని। శూరుడై యొకడైనపోరాడడాయె ॥ దనుజుశరములకెదు రుగనుచూచుటేగాని। ధైర్యమునవొకడైనతరమలేడాయె ॥ శైలచయ మొకటైనచేబట్టివనచరుడు। దనుజుకెదురై నిలచిమొనకట్టడాయె ॥ నెది రించినట్లుడెబ్బదిరెండువేల్వలు। జవముచెడినేలపై సాగిలంబడిరి॥ గోత్రె మందలరీతికోటానకోటులు। నేలగూలిరియొక్క నిముషమాత్రమున॥మే టికార్చిచ్చులోమిడుతలుబడురీతి। దనుజుబాణాగ్నిలోదగ్ధమైపడిరి॥బలు డుశతకంధరునిబాణమహిమెట్టిదో । అఖిలబలములుమడసె నరగడియ లోను॥ పేరుకై నాయొక్క వీరుండునిలకుండ। మనుజవనచరసేనమడిసిపో యెనుగ॥ తనచేతబలములుదగ్ధమైకూలెనని। వీరసాహసముచేవెలసెరా క్షసుడు॥ సుగ్రీవయంగదసుషేణుమొదలయిన। దండనాథులనెల్లతాజం పదలచి॥ ఇలగూలియున్నట్టిబలములన్నిటివిడచి। దండనాథులపైకితన రథమునడిపె॥ తనరథమునడిపించిదండనాథులబట్టి । దునుమాడగాజొ చ్చెదుష్టరాక్షసుడు॥ పటుతీవ్రబాణములుపదిపదులుతానేసి। అంగదుని బరిమార్చెనసురవల్లభడు॥ ఏనూరుబాణములనేసెసుగ్రీవుని। గడతేర్చె కపులెల్లగడగడనువణక॥ ఆన్నూరుబాణములనతిబలశాలియా । జాంబ వంతునిగూల్చెచండరాక్షసుడు॥ దక్కయుండినయట్టిదండనాథులనెల్ల। తపుచుశరములుగప్పిధరణిగూల్చెనుగ ॥ చప్పన్నదేశాదిజననాయకుల నెల్ల। బలుబాణములచేతబడగూల్చెనపుడు ॥ బలుడుకొందరిబట్టిపరహ తముగావించె। చెలగికొందరిబట్టిశిరములెగదనివె ॥ ఘనుడుకొందరిన క్త్రిగంహారంబులుద్భంచె। మరియుకొందరిబట్టిమట్టిపల్లాడె ॥ కడువిభీ షణఫౌంజగనిద్వాదశాక్షోణి। బాణములువడినేసెప్రాణములుగొనియె॥

తనకులంబనిమదిని ననుమానమొందకను। కడువిభీషణుబలముమడియ జే
సెనుగ॥ మనుజవనచరదనుజమరణంబుగావించి। పిదపవిభీషణునిబిల్చి
యిట్లనియె॥ నీకతంబునగదానిప్పాకారణంబునను। లంకాపురపుదనుజ
పొంకంబులణగె॥ నీవల్లనేగదానెరిలంకలోగుట్టు। మనుజనాథునికెల్లమ
ర్మముల్ దెలిసె॥ రణరంగమందురావణకుంభకర్ణాది। దనుజహరణముస
లిపెదశరథాత్మజుడు॥ కులద్రోహివగునిన్నుగూలనేసెదనిప్డు। రణభూ
మిలోపలనురాక్షసాధముడ॥ హరిహరబ్రహ్మాదులడ్డమైవచ్చినను। పడగూ
ల్తునిన్నుయీభండనంబునను॥ తారకాచలగుహలదాగితివియిన్నాళ్లు।
యిపుడునీకాభయముయెచటబోయెనురా॥ మనుజవల్లభుగూడిమర్మము
లుదెల్పుటకు। జనుదెంచితివనీవుదనుజులనుగూల్ప॥ అనుచుశతకంఠుండు
అపుడుబ్రహ్మాస్త్రంబు। లంకాధిపునిపైనిబింకముగవైవ॥ జనుదెంచెనా
విభీషణుగుండెలవిసిపడ। గరుడగంధర్వకిన్నరులుభయపడగ॥ అఖిలలో
కములహాహాకారములుబట్టె। చిచ్చులొలుకుచుదివ్యశరమేగుదెంచె॥ చి
చ్చులొలుకుచునేగిశరమువిభీషణుని। అవయవంబులుచించియవనిబడ
ద్రోచె॥ అవయవంబులుదూలిఆరావణానుజుడు। నిదురబొందినరీతినేల
బడియుండె॥ నిదురబొందినరీతినేలగూలెనుగాని। ప్రాణముల్ గొనదాయె
బ్రహ్మాస్త్రమైన॥ ఘనముగాశ్రీరామకరుణారసమువల్ల। చంపనోపగ
దాయెశరమెంతదైన॥ ఘనుడిట్లువ్రాలతక్కినవిభీషణుపొంజు। అక్కడ
క్కడదాగెనతిచింతనొంది॥ ఆవిభీషణుగూల్చియాదానవేంద్రుండు। ఘో
రబాణములందిశూరుడైయపుడు॥ తనయభార్యాసహోదరచయంబుల
తోడ। రామచంద్రునిజంపరాక్షసుడుదలచె॥ మదినిశ్చయముజేసిపదినూ
రుబాణములు। హనుమంతుపైబూనియనియెరాక్షసుడు॥ అగచరానీవు
మానగరిలోపలజొచ్చి। నీపెంకితనమెల్లజూపినావచట॥ దూతలనుజం
పిసెదోషంబువచ్చునని। కనికరించితినందుగవనమొందితివి॥ గవనమున

ములునెల్లగాసిపడజేసితివి। అపుడుజూపితిబింకెమిపుడుకనవగ్చు ॥ నీప్రభ
వుజూడగానిన్ను దునుమాడెదను।చూడరామరకూటాచూడరాయివుడు॥
యుద్ధరంగమునసీవూరుకోకుండంగ। దీర్ఘజిహ్వనిశిరము దెగ వేసినావు॥
మధ్యచారబారిధర్మముదప్పియాభరతు। పత్నిమైసరదారుబట్టిచంపితివి॥
చంపెదనునిన్ను నిర్జరులుభీతిల్లంగ। ననుచుశతకంఠుండుకనులెర్ర జేసి॥పది
నూరుచేతులనుపదినూరుబాణములు। బూనిహనుమంతుపై బాణములు
బరపె॥ భూనభోంతరములనుబాదలిమంటలువెలయ। ఘనశరములేతెం
చిహనుమంతుబాదవి॥ బాణసాహస్రంబుబలుమేనుపైనాటి। విరథుడై
హనుమంతుధరణిపై వ్రాలె ॥ విరథుడై హనుమంతుధరణివ్రాలుటజూ
చి। సింహనాదముజేసెశతకంఠుడపుడు॥ సింహధాటీజేసచెలరేగిదానవు
డు। పెక్కుశరములుబూనిపెల్లుమీరుచును॥ అట్టహాసాధిపుండగుచురా
మునికడకే। నరుదేరగాజూచితరుణిజానకియు॥

శతకంఠుడు సీతనుజూచి భయపడుట.

అసురుభీషణాగమనమంతకన్నులజూచి। తనయాదిమహిమంబుత
లపోసెనపుడు॥ ఆదిపరంజ్యోతిఆయమ్మజానకి। కంటగన్పడనసురుకంపము
నబొందలె॥ పదునాల్గులోకములుపట్టజాలనియట్టి। వీరరూపముదాల్చె వె
లదితానపుడు॥ శతకంధరుడుదక్కజగములోనెవ్వరికి। గానరాకుండంగ
గనుపించెనపుడు॥ విలయకాలమునాటివీరభైరవమూర్తి। తేజమైరవి
కోటితేజమైవెలసె॥ ద్వాదశాదిత్యులునుతగనవబ్రహ్మలును। పదకొం
డుగురురుద్రులుదుటుమీరగను॥ అష్టదిక్పాలకులుఅరయత్రేతాగ్నులు
ను। కోమరుముప్పదిమూడుకోట్లదేవతలు॥ ఈవిశ్వరూపంబువెలయజా
నకిదేవి। గనుపించెదనుజునకుకడుభీకరముగ ॥ కనిదైత్యవల్లభుడుకంపం
బునొందుచును। తనపాలిమృత్యువనితల్లడిల్లుచును ॥ మదిభీతినొందుచు
నుమానంబుదూలుచును। అచటగుండెలునిలువకవనిరాతుసుడు॥ పురము

మొగమైతానుమరలిపారగజొచ్చె। సిగ్గుమాలుచుమదిని చిన్నబోవుచు ను॥ తల్లిరణమునకేగదగదంచుచెప్పుటకు। తగదుష్టశకునములుగనిపిం చుటకును॥ బలములునుతనప్రధానులుగూలిపోవుటకు। విలయరూపము కన్నులనుజూచుటకును॥ చిత్తంబువికలమైంత త్తరంబునుబొంది।చాలదుః ఖంబుచునుశతకంఠుడరిగె॥ కేవలరామునిబట్టియేవె హాలింతునని। తలచు

నమహేంద్రుని సేనమడియజేసితిని॥ అతనిభార్యాతనయులతనితమ్ములుదక్క। కొడువబలములనెల్లగూలనేసితిని॥ తొల్లి హనుమంతుండు ద్రోణాచలము దెచ్చి। బ్రతికించినాడఖిలబలములనువాడు॥ రాముతమ్ముండైన లక్ష్మణవీ రునకు। మూర్ఛదెలియగజేసియుదమునొందించె॥ మున్నువలెహనుమం తుముదముతోసంజీవి। దెచ్చిసేనలనెల్లదెలివినొందించు॥ ఆరీతిగాకుండ నాద్రోణశైలంబు। కడకేగిమీరెల్లకావులుండండి॥ అవుపధాలివ్వవద్దని ద్రోణగిరితోడ। చెప్పుడునేచాలచెప్పినాననుచు॥ అనికోటిదానవులనా ద్రోణగిరిచుట్టు। కాపుగానుంపించెకఠినరాక్షసుడు॥ అంతఃపురంబులోశ రిగెనాశతముఖుడు। అవుషధంబులగిరికియటుకాపులుంచె॥ రామచంద్రుం డచటరణభూమిలోగూలు। కపిబలంబులజూచికటకటాయనుచు॥ బలు చింతనొందుచునునలుదెరంగులజూచి। అవనిపైవ్రాలి నాహనుమంతు జూచి॥ కరుణాసముద్రుండుకనికరమురంజిల్ల। వచ్చియాతనిబట్టిరొుడలె ల్లనిమిరి॥ హస్తస్పరిశచేతహనుమంతుదేహంబు। గాయముల్దారుగంగ కరుణఃజూచెనుగ॥ వజ్రదేహునిజేసివాయునందనుమహా। శ్రమగల్గెనీకు మాసహవాసమునను॥ అఖిలబలములకిపుడుఆపదలుసిద్ధించె। మానిమి త్తముచేతమారుతాత్మజుడ॥ వనచరభల్లూకమనుజదానవబలము। నిదు రబొందినరీతినేలప్రాలెగ॥ మానిమిత్తమువచ్చిమడిసిరెల్లబలంబు। లప కీర్తివచ్చెనోయగచరోత్తముడ॥ అసురుజంపగలేనిఅపకీర్తిగాకుండ। నే

నగూలిననిందశాశ్వతంబయ్యె॥ ఇన్నిబలములజంపియేరీతినయోధ్య। పురముకేగుదునోయితరచరోత్తముడ॥ క్రూరరాక్షసుబట్టిగూల్తునేనేరీతి। దనుజబలమెంచంగతరముగాకుండు॥ అసురుజంపకగానిఅయోధ్యపురమునకు। జనరాదుదునుమాడశక్యంబుగాదు ॥ అఖిలసేనలుమడిసిరనితెల్లవారలకు। యేరీతిజెప్పుదునుయేమిసేయుదును॥ సకలబలములనిప్పుడుసమరంబుపాల్జేసి। చనిపోవుటకునెట్లుమనసురంజిల్లు॥ శతకంఠుజంపుటకుచేతగాదనినేను। యెల్లజనులడిగితేనేమిచెప్పుదును ॥ చండవిక్రమనిశాచరుబలముతెలియక। కయ్యంబునకునేలకాలుద్రువ్వితిని॥ అఖిలలోకంబులకుయపకీర్తివచ్చెగా। నిఖిలబలములజంపనిందవచ్చెనుగ ॥ అనిచాలభీతిచేగనలుచుండినయట్టి। ఇనకులాధిపుజూచిహనుమంతుడనియె ॥ అఖిలలోకాధారఆదినారాయణా। పరమాత్మ నీవిట్లువెరగొందదగున ॥ నిఖిలలోకంబులునీకుక్షిలోనుండు। నీవులోకమునందునిలిచియుందువుగ॥ నీమాయలోకములునివ్వటిల్లుచునుండు। పరమాత్ముడవులోకపాలకుండవుగ॥ నీమహిమగనలేకనీవుమానవురీతి। పరితాపమొందుటకుభావ్యమాస్వామి॥ వెరపుకవులకుగానివెరపనగనీకేమి। నీలోనుమహిమంబునీవెరుంగవుగా॥ నీకుబుద్ధులుచెప్పనేనెంతవాడను। సర్వశత్రువినాశసకలలోకేశ॥ సేనలన్నియుమూర్ఛజెందియున్నారన్న। సంశయంబులుమానుజానకీరమణ॥ తొల్లిచందమునద్రోణాచలముదెచ్చి। తెలివినొందించెదనుబలములన్నిటిని॥ సకలబలములమూర్ఛక్షణములోదెలిపెదను। శలవైతెతెచ్చెదనుసంజీవికరణి॥ తెల్లవారకముందెయెల్లసేనలమూర్ఛ। తెలియంగజేసెదనుశలవునాకిమ్ము ॥ ముదముతోసేనంతమూర్ఛతెలిసినవెనుక। శతకంధరునిబట్టిహతమూర్చవయ్య॥ క్షణములోపనికింతసంశయార్థంబేమి। కపటనాటకసూత్రకంజాతనేత్ర ॥ దివ్యౌషధముదెత్తుతెల్లవారకముందు। బలములన్నిటిమూర్ఛదెలియజేసెదను ॥ అయినులక్షలనలుబ

డామహై వర్తిల్లు। నిక్కడికిద్రోణాద్రియినవంశవర్య॥ అనియిట్లుహనుమంతుతనతోడబలుకంగ। మదిసంశయముబాసెమనుజవల్లభుడు॥ అతనికాగిటజేర్చిహనుమంతుడానీవు। అరయమాకెప్పటికినాప్తబంధుడవు॥ అవుడుబలములకెల్లనాపదనివారణము। గావించుమానిందగలుగకుండగను॥ ఈకార్యసరణినీవేరీతిగాజేయ। భారమాతయునీదెపవననందనుడ॥ పామ్ము వేగముద్రోణభూధరముగొని తెమ్ము। దివ్యౌషధము తెమ్ముధీరతనురమ్ము॥ అనిలోకనాయకుడుతనతోడబలుకంగ। ప్రణమిల్లిముమ్మారుపవననందనుడు॥

### ఆంజనేయులు సంజీవికరుగుట,

శ్రీజానకీవరునిశలవుతాగైకొనుచు। నాకాశమార్గమునహనుమంతుడరిగె॥ పవనవేగముతోడపటుజవంబున నెగసి। అరిగెహనుమంతుండు అఖిలంబుగడచి॥ నదులునిధులునుగడచినగరభూములుగడచి। పర్వతంబులుగడచెపవననందనుడు॥ కాననంబులుగడచికడురాజ్యములుగడచి। ద్రోణశైలముగాంచెవానరబలుండు॥ గిరిచుట్టురాక్షసవరునాజ్ఞదప్పక। కఠినదానవకోటికాపులుండిరిగ॥ అల్లంతదూరమున హనుమంతుబొడగాంచి। తబ్బిబ్బులనుబొందిదైత్యులందరును॥ తందర్లుబొందుచునుదానవావళులెల్ల। వచ్చెనదుగోచ్చాడువాయునందనుడు॥ మొన్నమునసందతినిమోసపుచ్చినయట్టి। ఘనుడువాయుసుతుండుకంటిరామీరు॥ మునపగలుదీరంగమర్కటవరుబట్టి। తునకతునకలుగాగదునుమాడవలెను॥ ఘనభుజబలపరాక్రమముయింకెన్నటికి। పోనీకవానరునిబొరిపుచ్చవలెను॥ ఒకటముఖమైమనముఅక్కపీంద్రునిగదిసి। చెలకనరికినరీతిచండాడవలెను॥ అనుచుదానవులెల్లకనులనిప్పులురాల।భీకరాకారులై పెల్లార్చుకొనుచు॥ హనుమంతునింగదిసిరందురొక్కమ్మడిని। ఘోరరౌద్రాకృతినికోటిదానవులు॥ కాలజీమూతంబుభోలిదానవకోటి। పవననందనుచుట్టుబరిఢవిం

చిరిగ॥ తనచుట్టునీరీతిదనుజావళులుగవయ । చిరునవ్వునవ్వుచుశ్రీరా
ముబంటు ॥ ననుబట్టిచంపంగపనిబూనిమీరంత । గదిసినారామీరుగ
ర్వాంధులగుచు॥ చంపజాలగమీకుశక్యమాయమలోక । పాసుతాటకకు
మీరువచ్చినారిటకు॥ మీపరాక్రమమెల్లజూపుడీనాయెదుట। ప్రజ్ఞావిశే
షములుపలికితిరిచాల॥ అనిదీర్ఘవాలంబువినువీధిముట్టంగ। బరపెదానవ
కోటివెరపునొందగను॥ లోకమెల్లనునిండభీకరాకారంబు। కాలాంతకుని
రీతిగనుపట్టినపుడు॥ తలపువ్వులగుచుచుకల్లెలుజెలంగగమేను। పెంచె
హనుమంతుండుభీషణాకృతిని॥ ఆతనిరూపముజూచిఆనిశాచరులెల్ల । క
డుభీతిగొనిచాలకంపమొందిరిగ ॥ కంపమొందినదనుజగణములనుబాడ
గాంచి। తనవాలమునజుట్టితరుచరవరుండు॥ ఇందాకఠంకంబులెందుబో
యెనటంచు। తనవాలమునజుట్టితరుచరేంద్రుండు॥ తనవాలమునజుట్టిత
రుచరవీరుండు। గుండపిండిగనేలగొట్టినందరిని॥ పెదవులనుగరచుకొనిశి
థిలమైదేహములు। నిఖిలరాక్షసకోటినిర్జీవులైరి ॥ శతకంఠునకువార్తదె
లుపుకొరకైనను। బ్రతుకడాయెనొకండుపలుమాటలేల॥ నిర్జీవులైపడిన
నిఖిలదనుజులవిడచి। ద్రోణశైలముకేగెవానరవరుండు ॥ బలుతేజమున
మతాబాలువెలిగినరీతి। తేజరిల్లెశైలమునదివ్యౌషధములు॥ సంజీవికర
ణులుసంధానకరణులు। శల్యకరణులుగలిగిచెన్నొందెనగము॥ చెలువైన
యాద్రోణశైలంబుబొడగాంచి । పలికెనగ్గిరితోడపవననందనుడు ॥ శత
కంధరునితోడసమరంబుసేయుటకు।శ్రీరామచంద్రుండుజనుదెంచినాడు॥
సేనలన్నియుమూర్ఛజెందిపడరాక్షసుడు। ఘోరబాణములేసికూలనేసె
నుగ॥ ననుబిలచిశ్రీరామజనవరుడునీవద్ది । కరుగుదెమ్మనిబల్కెనగకులేం
ద్రుండ॥ బలములన్నియుమూర్ఛదెలియుటకునీయందు। గలవుదివ్యౌష
ధములెలమిబొందగను॥ శ్రీరామకార్యముకుజాగుసేయకవేగ । దివ్యౌ
షధములిమ్ముధీరతనులెమ్ము॥ ప్రొద్దుదూరకముందుపోవలెనుసంజీవి। త్వర

మీరనిప్పించుగిరివరాసీవు ॥ అనియిట్లుహనుమంతుతనతోడబల్కెనటు।
అతనితోనిట్లనియెవాద్రోణనగము॥ అంజనీవరపుత్రహనుమదాహ్వయు
నాదువిన్నపముగైకొమ్ము విన్నవించెదను ॥ కంటకుడుశతముఖుడుక
పులనెల్లనుగూల్చి తనపురంబునకేగిదానవులబిలిచి ॥ కపులమూర్ఛలు
దెలుపఘనుడుహనుమంతుండు। ఆవుషధంబులకొరకునరుదెంచునిటకు॥
అవుషధాలేమియునుహనుమంతుగొనిపోవ । కుండంగగాపుగాయుండిడి
ఘనుచు ॥ కఠినదానవకోటికాపుంచెవాచుట్టు । దానవునిదివ్యాజ్ఞదప్ప
కుండగను ॥ ఘనశౌర్యగాంభీర్యఘుడియమాత్రములోన । దుష్టదానవ
కోటినణమాడినావు॥ ఆవుషధములిచ్చుటకుఅరపేమియునులేదు। మన
విధ్యొక్కటిగలదువినుముచెప్పెదను ॥ దివ్యౌషధములెల్లతీసిసేనివ్వంగ।
పగబూనినామీదబలుమశతముఖుడు ॥ పగబూనియతిబాధపరుచునాత
డునన్ను। కడురాక్షసునిబాధపడలేనుయికను ॥ కుపితశతకంఠునకుకోపం
బురాకుండ। పొసగంగనేనొక్కబుద్ధిజెప్పెదను॥ ననుబలిమిపెకలించికొ
నిపోయినట్లుగా। గొనిపొమ్మునింధబాయునుపుణ్యచరిత॥ అట్లుగాకుండనే
నౌషధములిస్తినా। పగబూనియుండునాపాపకర్ముండు ॥ పెకలించుకొని
పోయిఅగచరవరులకును। మూర్ఛదెలియగజేసిముదముబొందించి॥ నా
మనవిసైరించినన్నుమన్ననజేసి। వడినన్నుగొనిపొమ్మువనచరోత్తముడ॥
పరమపుణ్యముసీకువనచరవీరుండ । మారుజెప్పకనాదుమనవిగైకొమ్ము॥
అనిద్రోణశైలంబుతనతోడబలుకంగ । కనికరముఱంజిల్ల ఘనుడుహను
మంతు। అవుషధంబులుబట్టిఅరుగుదెంచుటకంటె । కొండతోడుతబట్టి
కుంటబాగౌను॥ కపులమేల్కొలుపంగగావలసియున్నట్టి। ఘనవస్తుజా
లముల్గొనవచ్చుననుచు॥ కొన్నితెచ్చితినంచుకొన్నితేలేదంచు। బలికి
తేనటుకార్యభంగంబుయనుచు ॥ కొండతోడుతబట్టుకొంటె శుభంబను
చు। ఘనుడుహనుమంతుండుతనమదినిడలచె॥ తనదీర్ఘవాలంబుతొకొం

డపై జొచ్చి। పెకలించె లోకములు భీతినొందగను॥ పెకలించి ద్రోణాద్రి దన శి
రంబున బూని। కోటిసూర్యుల భంగి నేటుమీరుచును॥ వాయువేగము కొ
న్న వడిమీర నెగసె। నాకాశమార్గంబునంటి వాయుజుడు॥ ఎల్లభూము
లు గడచి యెల్లదిక్కులు గడచి। దేశభూములు తానతిధీరతను గడచి॥ తన
రాక తిరిదిక్కుగని కట్టియున్న శ్రీరామచంద్రుని గాంచి ప్రేమమీరగను॥ శై
లము చప్పుడదించి సాష్టాంగ మొనరించి। పలుదీవనల నందె పవననందనుడు॥
అచట గల్గిన వార్తలన్ని శ్రీరాములతో। విన్నపము గావించి వేగమార్గము
న॥ శలవుగై కొని ద్రోణశైలంబునందున్న। సంజీవకరణులు శల్యకరణులు
ను॥ సంధానకరణులు సకలదివ్యౌషధము। లన్ని గిరిచే నందె హనుమంతు
డపుడు॥ నిదుర బొందినరీతి నిర్జీవులై నేల। బడియున్న కపిబలము పై జారజ
ల్లె॥ మనుజసేనల పై నిదనుజసేనల పైని। పరగ సంజీవియే పారజల్లెనుగ॥ బ
లములన్నియు మూర్ఛ దెలియంగ హనుమంతు। వేగ దివ్యౌషధము లెల్ల
వేడుకను॥ ఘనయౌషధములిట్లు కలశార జల్లితే। అమృతవర్షము గురి
సినట్లు బలమెల్ల॥ కలకలంబాడుచును కిలకిలారావమున। నఖిలబలములు
లేచి నిలిచియుండిరిగా॥ కోలాహలంబుగను వాలములు ద్రిప్పుచును। సింహ
నాదములతో చెలగుచుండిరిగ॥ అతిసుందరంబుగా నఖిలబలములు లేచి।
ఆనందమయులగుచు నపుడుయుండగను॥ సకలబలముల జూచి జానకీనా
యకుడు। అంతింతయనరాని సంతోషమొదవె॥ సంతోషమొప్పంగ జా
నకీనాయకుడు। కపివరేణ్యుని బట్టి కౌంగలించెనుగ॥ తనకంఠమున మెర
యు ఘనరత్నహారంబు। తీసి కపివరు మెడను వేసి రాఘవులు॥ పవనజా నీవం
టి పరమబంధువుడు మాకు। పదునాల్గులోకముల వెదకినను గలడ॥ నిఖిల
బలముల లేపి నిందదప్పించితివి। లేనిలోకము నందు బూని నిల్పితివి॥ ఆరయ
నిన్నొకని సేనావగా జేసుకొని। సంగరాంబుధి నీద జూడగంటినిగ॥ ఎన్నివిధ
ములనైన యెన్ని దినములకైన। నీరుణము దీర్పంగ నేజాలనయ్య॥ బ్రహ్మ

దేవునికన్నప్రాణులుదీర్ఘాయువును । వర్ధిల్లుచిరకాలవశునైనీవు ॥ సంజీవి దెచ్చియాచంద్రార్కముగసకల । బలములనురక్షించివిఖ్యాతిమీఱితివి॥ నోటబల్కనరీతిమాటపక్కంచుకొని । నిలుపుకుంటివికీర్తినిఖిలలోకముల ॥ అక్కగలయప్పుడాద్రోణశైలంబు । వేగువతోపెకలించితెచ్చియిచ్చితివి॥ తొల్లియుండినచోటద్రోణశైలమునిల్పి । వెల్లవారకమునుపుత్వరితముగరమ్ము॥ అనుచుసాకేతరాముతనతోడబలుకంగ । శలవుగైకొనియపుడుబలుడుహనుమంతు॥ తలమీదద్రోణభూధరముతాధరియించి। అఖిలభూములుగడచిఆవాయుసుతుడు ॥ పరగద్రోణాద్రినెప్పటిస్థలంబుననిల్పి । వచ్చిశ్రీరాములకువందనముజేసి ॥ వందనముగావించుపవనకేంద్రునిబట్టి। కౌగిటనుబంధించికమలనాభుండు॥ నాకుతమ్ములుమువ్వునాలుగోతమ్ముడవు। నీవుపవనాత్మజానేటిసరినుండి॥ అయిదుగురుమాయిమనమన్నదమ్ములమంచు। యెడబాయలేనునిన్నొకనిముషమైన ॥ అనుచుహనుమంతున్నిగానియాడుచునుచాల। వేడుకనుశ్రీరామవిభుడుతా

శతకంఠుడు తల్లిదరికేగుట.

నుండె॥ అంతఃపురముకేగి*అతిబలుడుశతకంఠు। తనతల్లికిసభక్తిదండములుమ్రొక్కె॥ దండములుతాబెట్టితల్లిరోయీవేళ। సమరమునకేగితినిచలముతోడుతను॥ వానరబలముతప్రాలినేలనుగూల। శరపరంపరగప్పిధరణిగూల్చితిని॥ తనతమ్ములనుతానుతనుజాపుత్రులుదక్క। కొదువబలములనెల్లగూలనేసితిని ॥ మరికొన్నిబాణములుమానవేంద్రునిపైని। పూనినంతటిలోనజానకీరమణి॥ వీరస్వరూపంబువెలదితాధరియించి। యుండంగనచటనేనుగ్రరూపంబు॥ సుదతియాకారంబుచూడజాలగలేక। పురముకుమొగమైనేనుమరలివచ్చితిని ॥ అదికాలమృత్యువోఅదియెట్టిభూతమో। గానియాడదిగాదుకడుమాయగాని ॥ అనికొడుకుతనతోడనుడులుచునుజెప్పంగ। కడుభయంబునచిత్రగంధితాబల్కె ॥ వారితోవైరంబు

వలదంచు బలుమారు। బలుకగా యుద్ధమునకు బరుగెత్తితివి॥ నీపురాణమున
కరిగ నేఘాతిబొందుచును। కడువిచారము నొక్కకలగంటి పుత్ర॥ కలగన్న
మార్గంబు తెలియజెప్పెద నీకు। వినుము నాతండ్రి యావిధమెల్ల నీవు॥ శ్రీ
రాఘవుడు నీవు ఘోరరణరంగమున। భూరినిర్భరముష్టి బోరాడలేదా॥ క
నిజానకీదేవితనవిభుని చేనీవు। కూలేది లేదంచు కొమ్మ తా లేచి॥ విభుని చేను
న్నట్టివిలు బాణములు బట్టి। ప్రానినీతో నీతపోదుగావించి॥ నీనూరుతలల
న్ని నేలపై బ్రాలంగ। బడగూల్చె నటవీరభండనంబునను॥ నీదుభార్యా
లంతనిజయుద్ధభూమికిని। జనుదెంచి గటశోకమున బెనంగొనుచు॥ నేనుగ
న్నట్టికల నిజముదబ్బరగాదు। తప్పనేరదు నీకు దాశిలాపడును॥ సీతామ
హాదేవి నీతశరంబుల నీవు। రేపుయుద్ధమునందు నేవుమానెదవు॥ ఒక్కశపి
వనఁడొచ్చియుక్కుమీరగనిన్ను। నెరిముష్టితో బాడచేసి రొమ్ముజగుల॥ నీ
దుసింహాసనము నేలపాలుగ జేసి। ఘనతలాటముగుండగా ద్రొక్కివేసె॥ నీ
కన్నతో జూచి నీవు బొందినపాట్లు। యొర్గినవితలువవిం కేమందు నిన్ను॥ మ
ర్కటావళిశక్యమా నాల్గుసంద్రములు। దాటివచ్చుటలు యేనాటికి నిగల
వా॥ మానవులశక్యమా మహిమతో నీలంక। నగ్గలంబుగ మూగి లగ్గబట్టు
టకు॥ అసమానబలులైన ఆరాక్షసుల బట్టి। ఇలగూలనేయుటకు యెవరితర
రమగును॥ శ్రీరాఘవుండాదినారాయణస్వామి। సీతామహాదేవి శ్రీమహా
లక్ష్మి॥ హనుమంతుడీశ్వరుండఖిలవానరబలము। సురకోట్లు నీమదిని శో
ధించిచూడు॥ వలదు శ్రీరాములతో వైరంబు కలనైన। కరుణించుమనియు
తనిశరణుగై కొనుము॥ వద్దు నాతండ్రి వినువాదంబు కోరగాదు। బ్రతుకు
ము శ్రీరామభద్రునిం జేరి॥ అనిపలువిధంబుల నాతల్లి పలుకంగ। కనలిబలు
కోపుడై కఠినరాక్షసుడు॥ తల్లి వనితలచి నేతాల్మి బొందితిగాని। కొదువెవ్వ
రాడినా కూలనేతునుగ॥ పరగంగ స్త్రీబుద్ధి ప్రళయాంతకంబన్న। మాట
నిజమైతో చెమనసుకీవేళ॥ ఎరుకమాలిన మాటలిట్లేల పలికేవు। వెలదుల

మాటలనువినువెఱ్ఱిగలడ॥ నరుడువిష్ణుడటంచుసురలువానరులంచు। హ
నుమంతుడీశ్వరుండనుచు చెప్పెవు॥ జానకీసతిమహాశక్తిస్వరూపంబు।దా
నిచేమరణంబుదప్పదనియేవు॥భయపెట్టుటకునిట్లుపలికితివిగానియా। మా
టనిజమనిమొట్లుమదిననమ్మదును॥ పగవానిపక్షమైపల్కితివినీవిట్లు । త
గదునీవిట్లాడతల్లివైయుండి॥ ఇకనీకునాసంగతెరిగింపగాదగదు। పగవా
రిగతినిన్ను బాలించవలెను॥ అనియిట్లుతాడితంబైనసింహమురీతి। పదహ
తంబైనట్టిపాముచందమున॥ పరగనెయ్యనిదోగుప్రళయాగ్నిచందమున।
మిట్టిపడిమొగముమిరిమిట్లుగొలుపుచును ॥ తల్లిమాటలువినకదనుజుడా
గ్రహమునను। అచటనిలువకలేచిఅధికశౌర్యమున॥పటహాదిరావములు
బ్రహ్మాండములునిండ। విలయకాలాంతకునివిధమునీరుచును॥

## శతకంఠుడు మరల యుద్ధమునకు వెడలుట.

శేషించియున్నట్టిసేనలనుగూర్చుకొని । పొడుటుగామరునాడువు
దయకాలమున॥ రథమెక్కి-వెలుగొందెరాక్షసావళులంత। బలుకోట్లుత
నవెంటబలసిగొలువగను॥ ప్రళయాగ్నిచందమునబలుడుశతకంఠుండు।క
పిసేనమ్ముఖుడగుచుగదలివచ్చెనుగ ॥ వచ్చుదానవుజూచివసుమతీనాయ
కుడు। వెలయంగలక్ష్మణావీరుడిట్లనియె ॥ అదుగొశతకంధరుండరుదెంచె
మున్నువలె। సంగరముజేయుటకుసాహసోద్ధతిని ॥ వానితోసరిపోరవశ
ముగాకెవ్వరము। నిన్నపోడిమిదప్పిమిన్నకుంటిమిగ ॥ ఎంతవారలకైన
హెచ్చుతగ్గులువచ్చు। అదిదలంపగరాదుఅన్నివేళలను॥ తగ్గిమనముం
టిమా।దానవుడుమిడిసిపడి। వచ్చుమునుపటిరీతివాడుగ్రుడగుచు ॥ చండ
దోర్దండతనుపరిపోరగావలయు । రాక్షసునితో ఘోరరణరంగమునను॥
వానిభుజలాఘవమువర్ణింపబనిలేదు । ధీరతనువానితోపోరగావలయు॥
అఖిలసేనలగూడిఅసురునొక్కనిడాసి। పల్లార్చవలెవీరభండనంబునను॥
అనుచురఘునాయకుండనుజుతోబలుకంగ । నన్నతోలక్ష్మణుండనియెన

వ్యూచుము॥ దేవయీవేళనాలావృదైత్యునిలావు । పరికించిచూడుడీఖండ
శంబునను ॥ దివ్యబాణావళినితేటగారక్కసుని । బరిమార్తునిక్కముగ
సురలుబాగడడగను ॥ బరిమార్పలేకున్నబవరమునవానిచే । నిలగూలెద
నుగాకతొలగిపోనెపుడు॥ అనిలక్ష్మణుడుబలుకనాభరతశత్రుఘ్ను । లన్న
తోడుతబలికిరవుడుపంతమున ॥ దేవమేమిద్దరముధీగతనురాక్షసుని । నే
డుయమలోకంబుజూడబంపెదము॥ కాకున్నవానిచేకడితేరిపోయెదము।
గానితొలగేమాటకలనైనలేదు ॥ అనిచాపములుబూనిఅతిశౌర్యవంతు
లై। భరతశత్రుఘ్నులునుప్రౌఢిమీరగను॥ కుశలవులుయిద్దరునుకోదం
డపాణులై। లగ్రాడగాజొచ్చిరతిశౌర్యులగుచు ॥ సుగ్రీవుడత్యంతశూర
త్వముప్పొంగ। దట్టముగనిలచెనంతశనిచందమున ॥ అంజనీవరపుత్రుడ
సమానశౌర్యుండు। పరగశ్రీరాములకుబ్రణమిల్లిపలికె ॥ అఖిలేశశతకం
ఠునవలీలబరిమార్తు। కరుణించిశలవిమ్ముకమలలోచనుడ॥ తప్పకనుయీ
వేళదనుజుండుకడతేరు। ననుచునన్నద్ధుడైహనుమంతుడుండె॥ కొదువన
రదార్లంతమదిధైర్యములువెలయ । తమబలంబులతోడ దట్టముగనుం
డ్రి॥ రథమెక్కుచునోరథసిద్ధులైమిన్ను । పగులనార్పుచునుండ్రిబ
హువిధంబులను॥ శ్రీరామజనవరుడుచేవిల్లుధరియించి । హనుమంతుభు
జములందమరియుండిరిగ॥ జానకీదేవితద్భాగమందుననిల్చె। తూర్యనాద
ములెల్లతొడిబడుచుమ్రోయ ॥ విలునారిటాంకృతుల్ వెలసెజగములు
నిండ। బ్రహ్మాండభాండములుబెండుపడియుండె ॥ హనుమంతుమరుగున
నవుడువిభీషణుడు। పొలుపొందధీరుడైపొంచియుండెనుగ॥ ఘనభుజాటో
పులైకపులుపెల్లార్చుచును। వాలములుద్రిప్పుచునువారుండిరపుడు॥ అం
తశతకంధరుండతివిలయకాలాగ్ని । పగిదిమండుచువచ్చెబలురౌద్రుడగు
చు। వచ్చినేసలగవిసిరియొక్కపెట్టునవేసె। కోటులర్బుదములును తేటబా
ణములు॥ గిరివృక్షములబట్టితరుచరవరులంత । రక్కసునిపైవిసరిరుక్కు

మీఱుచును॥ లెక్కలేకుండంగ పెక్కుగిరిశృంగములు । బట్టివిసరిరి ఘో
రబలశాలులగుచు॥ ఆర్చుచుమకపులందరాశతముఖుడాసి। తెఱపిగనరా
కండగిరులుపై చిరిగ॥ మునుపుదైత్యుడుకపులమోనపెట్టినభీతి । మదినే
మిలేకుండగదిశిరందరును॥ వేలులక్షలుకోట్లువెలయునర్బుదములు। రా
ళ్లవరషముగురిసిరాదైత్యుపైని ॥ అవియేమిగణుతింప కాదానవేశ్వరు
డు। వడిచూర్ణముగజేసెవాటినన్నిటిని ॥ గిరులుచూర్ణముజేసి మఱిమరి
యుబాణములు। కపిబృందములగప్పెనపుడురాక్షసుడు ॥ ధరణియాకా
శంబుతెఱపిలేకుండంగ। శరపరంపరగప్పెకరుకురక్కసుడు ॥ ఇన్నన్నియ
నిలెక్కనెన్నశక్యముగాని। తీటుబాణమువేసెకుటిరాక్షసుడు॥ గాలిచో
రరాకుండఘనమైనబాణములు। మొడతెఱపిలేకుండవేసెరాక్షసుడు। పిర
రాక్షసబాణవేడిమికినిలలేక। వానరావళులెల్లవసుధపైబడిరి ॥ నిలువెల్ల
బాణాలునిండితెప్పిరిలేక। నిలిచియుండినరీతినీల్గెకపిబలము ॥ మనుజవన
చరసేనమందుకైనాగానీ। బ్రతుకడాయెనొకండుపలుమాటలేల ॥ ఎదు
రుకొనివానిపైయెవ్వడైనాగాని । దనుజుపైనొకండుమొనకట్టడాయె॥
అఖిలరాజ్యాధిపతులందులోనొకడైన । దనుజుకెదురైనిలచి మొనకట్ట
డాయె॥ ద్వాదశాక్షౌహిణీదనుజులలోనొకడు । శూరుడైయెదురించిపో
రాడడాయె॥ చేతులాడకనునిశ్చేష్టులైదానవుని। పటుశరాగ్నిలోగుంది
భస్మమైపడిరి॥ నిర్వీణహృదయులైనెపమేమిదోచకను । సకలబలములు
నేలసాగిలంబడిరి॥ చేనువేయుగబూనిచెలకనరికినరీతి । నసురుడొక్కడు
ద్రుంచెనఖిలబలములను ॥ ఏదిక్కుజూచినాయేడునూరామడ । బడిరిసే
నావళులుబహువిధంబులను॥ వీరశూరుండన్నవిఖ్యాతిజగములకు। తా
ర్కాణముగజేసెదనుజవల్లభుడు॥ మొనసిబలుబాణములముప్పదింటను
గూల్చె। జ్యోతిర్ముఖునిబట్టిదైత్యవల్లభుడు॥ వెలయగాపదిబాణములువిం
టసంధించి।ద్వివిధుగూలగనేసెదేవతావైరి॥అరువదిబాణములనాబుష

భునిగూల్చె। గవయుడెబ్బదిరెండుకాండములద్రుంచె ॥ తీవ్రబాణములొ
క్కటిరుసనునూరేసి । అంగదునిబరిమార్చెనసురపుంగవుడు ॥ ఇన్నూరు
సాయకములేకముష్టిని వేసి। జాంబవంతునిగూల్చె ఛండరాక్షసుడు॥ గంధ
మాధనుమొదలుకపులనందరినొక్క। వేయుబాణములచేవిమతులను జే
సె॥ ఇట్లువారలగూల్చియెల్లలోకములెల్ల । భీతిల్లనార్చుచును బెండుమీ
ఱుచును॥ రామభద్రునికెదుటరాక్షసుడు జనుదేర । అడ్డమైతానిల్చెనపు
డుసుగ్రీవు॥ దడ్డంబుగానిలిచి అసురుచేతులు తనదు। వాలమునబంధించెవ
డినిసుగ్రీవు॥ దనరబ్రహ్మాస్త్రబంధనమొనర్చినరీతి। బంధించెదానవునిబా
హువులన్నిటిని॥ కదలమెదలకనుండకట్టినిల్పినరీతి । బలురాక్షసునిబట్టిబం
ధించినిలిపె॥ బాహువులువాలమునబంధించియున్నట్టి। ఇననందనునిజూ
చిదనుజనాయకుడు॥ కన్నులెఱ్ఱగజేసకడువాహుంకరింపుచును । ఒళ్లుపటప
టగొరికీబలుడుతాననియె॥ అయ్యయోవోరినాకడ్డమైవస్తివా । కోలది
చెలియుకమేనుక్రొవ్విమర్కటుడ ॥ కోతులందరునిన్నుకొల్తురనిసేమదిని।
అధికసేనాధిపతినంచువచ్చితివా ॥ శూరత్వమంతయును జూపితివినాయ
దుట। కాచుకోతన్నదనుగర్వంబుదూల॥ అనిరాక్షసుడురౌద్రమునబెనం
గుచుపూని। తన్నెసుగ్రీవునిధరపైనిగూల॥ కోపించిదానవుడుగుండెపైద
న్నితే। గుండెలవయుచునేలగూలెసుగ్రీవు ॥ వెలయడెబ్బదిరెండువేల్వేల
కసధికారి। అసురుతాపునగూలహరహారాయనుచు॥ పరగరాఘవమహీ
పాలుండుచింతించె। వినువీధిదేవతలువెరచిచూచిరిగ ॥ రఘువరునిపై వే
గరథమునడిపింపుమని। సారథినిదిట్టుచును శతకంఠుడపుడు ॥ ధరణిగంపిం
పంగతావాహుంకరింపుచును। శరపరంపరలెల్లధరణిగప్పుచును॥ రాముద
రిదరిరాగదాలక్ష్మణస్వామి। దైత్యునకెదురైనిల్చెదానుగ్రుడగుచు ॥ అటు
లెందుబోయెదవుఅసురాధమానీవు। ఇటురమ్మునాకునీపటుజవముజూపు॥
మర్కటావళిగూల్చిమరివిఱ్ఱవీగెదవు । గర్వమొందుటతగదుకార్యార్థ

లకును॥ నిన్న సంగరములో నిలువజాలఁగ లేక । పారిపోయితి వేమి బలవిహీనముగ॥ నిన్న నాడినమాట నేడు మరచితి వేమి। మదుపానమత్తులకు మతివరాకౌను॥ అనిలక్ష్మణస్వామి తనకడ్డముగ నిల్వ । అతని గనుఁగొని యిట్టులని దురాత్ముడు॥ ఓరి నరుడా నీవు పోరు గావించుటకు । నెవఁగాదు నాకు నీవెంతనేనంత॥ పాఱిపొమ్ముటకైన బ్రతుకాశ యుంటేను। వద్దు నాతో నీకు వైరమిన్నటికి॥ నీ బలిమి యున నెంత నా బాణ వేడిమికి । పట్టిచంపెద నిన్ను ఖండనంబునను॥ నిండారకన్నులకు నీ సుందరత్వంబు । ముత్సాహై విలసిల్లు ముద్దు వచ్చునుగ ॥ నినుజంపుటకు నాకు మనసేమి రంజిలదు । కనికరంబొదవు నాకారంబుదలప॥ నీవంటి నందనుని నీతల్లి మరియు కను। యేజన్మమున గాంచు నెన్నాళ్లకైన॥ నీపైని నాకేమి కోపమార్గము లేదు। మోముగన్నంతటను ముద్దువచ్చునుగ॥ ప్రల్లదములాడి నాపంతములు పల్కినా। పగలేదు నీమీదఁ బాలుడా నాకు॥ నీయన్న రఘువరుడు నిజమైన శత్రువుడు। పట్టికూల్చెద వాని ఖండనంబునను॥ ఏడిరా లంకపై నేగి దశకంధరుని। యేపుమాపినయట్టిమాపశాలుండు॥ ఏడిరా బాణంబు లేసి యార్చుచు కుంభ। కర్ణుగూల్చిన యట్టిఘన భుజబలుండు॥ ఏడిరా కోపోగ్రహృదయుడై బాణమున। అగ్నివర్ణుని గూల్చినట్టి బలశాలి॥ ఏడిరా అలనాడు ఈశ్వరుని చాపంబు । విరచి పోగొట్టిన వీర రాఘవుడు ॥ ఏడిరా కౌశికుని యాగంబు రక్షించి । తాటకిని గూల్చినా దశరథాగ్రజుడు॥ అతని పైగాని నా అస్త్రశస్త్రము లేయు। నతడు నాకు విరోధి యతని జంపెదను ॥ వెరపు మదిలో బొంది శరధిలో జొరబడిన। తలజూప వెలచిన తల్లి పోయినను ॥ కొమ్మమరువున కేగి కోరి తా డాగిన। యాచకుండై బ్రాహ్మణాకారుడైన॥ గిరిజొచ్చినా గాని మరివాని బోనియ్య। కవని పై బడ గూల్తు నదినిశ్చయంబు॥

## లక్ష్మణ శతకంఠుల యుద్ధము.

అనిదానవుడు బలుక విని రాఘవానుజుడు । ధనుజాధమా నీకు తగ

దిట్టులాడ॥ అతనిగెల్చుటకునీకలవిగాదెన్నటికి। అసమానవైరంబుయత
నితోనినీకు॥ అతనిగూల్పంగలేవతనిచేగూలెదవు। నిఖిలేశుడాతనికిఁపవనగ
సెంత॥ బాణానలముచేతభస్మమైపోయెదవు। నిజముగానతనిచేనీకుమర
ణంబు॥ అఖిలాండనాయకుండవతారపురుషుండు। అతనిచేగూలేవుఅసు
రుడానీవు॥ ఇంద్రజిత్తునిబట్టియేఘుమాపినయట్టి। యెరుగవానాయొక్క
శరలాఘవంబు॥ కదసికండలుజేతుమెదలకుండగనిన్ను। సురవైరియీ
వేళచూడునామహిమ॥ అనిఘోరబాణంబులాదనుజుపై వేసె। నాగ్ర
హంబునరాఘవానుజుండపుడు॥ రాఘవానుజుఁడేయురౌద్రాస్త్రములు
గూల్చె। అనలబాణము లేసెనసురనాయకుడు॥ అనలశరములుజూచి ఆ
రాఘవానుజుడు। వరుణబాణము వేసివాటిసరిపుచ్చె॥ ఆరీతిదనుమాడిఅ
సురనాథునిపైని। తీవ్రశరమొకటందిధీరుడై వేసె॥ నేలనింగియుదిశలు
నిండమంటలువెలయ। శరమదిరిరాక్షసునిరథంబుదాకె॥ బాణాగ్నిమం
టలనుబలురథముభస్మమై। కూలినేలనునురికెనపితరాక్షసుడు॥ నేలదిగ్గ
ననుదికినిలిచిశతకంధరుడు। గురిసెలక్ష్మణుపైనిశరపరంపరలు॥ ఆవినదు
ముమనుమాడిఆలక్ష్మణస్వామి। చెటులాస్త్రమొకటేసెశతకంఠుపైని॥ శర
ముమేనునసాటిపరవశంబునుబొంది। ధరణిబడమూర్ఛిల్లెదనుజుడావేళ॥
పరవశుండై మూర్ఛబడికొంతసేపటికి। తెలిసిదిగ్గునలేచి బలుడురాక్షసు
డు॥ శహబాసురాయోరిసౌమిత్రినను। మూర్ఛబడగొట్టితివినీదుబలిమి
జూపితివి॥ నినుమెచ్చగావచ్చునీసమయంబునను। భళిభళీయనిమెచ్చిబ
లుడురాక్షసుడు॥ విల్లుసమ్ములుబూనివింతరథముననిల్చి। ధీరుడై వడినేసె
తీవ్రబాణములు॥ అవియెల్లదునుమాడిఆరామసోదరుడు। జవముతోడం
తనొక్కశరముదొడిగేసె॥ సురలుసంతోషింపశరమువురువడినేగి। దాన
వునిబలురథముదగ్ధంబుజేసె॥ రథమువికలంబౌటరాక్షసుడువెరగంది। వే
రొక్కస్యందనమువేగతానెక్కె॥ నూరుచేతులయందు నూటువిల్లందు

కొని॥ నూరుశరములువాడిగెక్రూరరాక్షసుడు ॥ జగముకంపమునొందెజ
లనిధులుఘోషించె॥ కులగిరులారిగెదిక్కులువ్రక్కలయ్యె ॥ అనలము
లుగ్రక్కుచునుఆనూరుబాణములు॥ వడినేగిలక్ష్మణునివరమేనుగాడె॥ బా
ణములులక్ష్మణునిమేనుదూసుకుపోయి॥ధరణిభేదించిపాతాళంబుజొచ్చె॥
మరిరసాతలమంటిమరలిశతకంధరుని॥ తూణీరముకేగిబాణంబులపుడు॥
మరియుశతకంధరుడుమహిమరెట్టింపంగ। శక్తిబాణముదానగిసంధించి
వేసె ॥ భూనభోంతరములనుబాదవుచునుమండుచును । విలయాగ్నిగతి
బోలుబలుశరములేసె॥ కులశైలములుగ్రుంగెఘోషించెవారధులు। ఎ
ల్లదేవతులపుడుతల్లడించిరిగా॥ సౌమిత్రిభయపడుచుబలవరింపగశరము॥
గురిమీదలక్ష్మణునియురముపైగాడె ॥ హారామభూపాలఆదినారాయ
ణా॥ యనిరథంబునవ్రాలెనపుడులక్ష్మణుడు॥ శక్తిబాణముగాడిజీవముల్గ
డతేరె॥ నిలలేకలక్ష్మణుడుయిలపైనిగూలె॥ ధరణిపైవెసగూలుతమ్మునిబా
డగాంచి॥ విలపించెరాముఁడుపలువిధంబులను ॥ హామహోద్ధారకాహా
లక్ష్మణాయంచు॥ తగశోకమొందెసీతామహాదేవి॥ ఆవిభీషణుడునుహను
మంతుడునుబాష్ప॥ నివహానిర్గతరక్తనేత్రులైరపుడు ॥ భరతుడంతటవ
చ్చిబలురాక్షసునిమీద॥ వివిధశరములుబరపెవేలకొలదిగను॥ అవిమొ
ల్లదునుమాడిఆదానవేశ్వరుడు॥ భరతుగనుగొనితానుమరియిట్టులనియె॥
నీయనుజలక్ష్మణుడునీల్గెనదుగోచూడు॥ పలుమారుజెప్పితినిపారిపొమ్మను
చు॥ పారిపోజాలకపడీచచ్చెరణమందు॥ అతనికంటెనునీవునధికుండవటర॥
నిన్నునారీతినేనేలబడగాగూల్తు॥ పారిపొమ్మెటకైనభరతుడానీవు॥ బ్రతు
కాశలేకుంటెభండనంబుననిలువు॥ నీయనుజరీతినేనీవుచచ్చెదవు ॥ అని
వేయుబాణములుదనుజుండువేయంగ। తునకలుగనడుమనవిదునిమెభర

### శతకంఠ భరతుల యుద్ధము.

తుండు॥ దనుజుబాణమువిల్లుదునుమాడిభరతుండు । తీవ్రశరములుబరి

పెతెరిపిలేకుండ॥ మరియుమరియునుతీవ్రశరములుద్ధతిబూని। వేసెరాక్ష
సుమేనుదూసిపారగను॥ భరతుఁజేసినతీవ్రబాణములువడిదాకి। దూసిపో
యెనురాక్షసేశుమేనంత॥ మరికొన్నిబాణములుబరపిరాక్షసునూరు। చా
పములదునుమాడెసాహసోద్ధతిని॥ అసురరక్తకణంబులవనిబడకుండంగ।
ఆగ్నేయబాణంబులధికముగబరపె॥దానవుడుకోపించితననేత్రములయం
దు। మిగులమంటలువెలయమిన్నుముట్టగను॥ జగముభీతిలనార్చిచండప్ర
కోపుడై। రాముడదుభుతమొందరాక్షసుండపుడు॥ నూరుబాణములంది
ఘోరముష్టినివేసి। పటుశరములేతెంచెభరతునంటగను॥ భరతురథమ
వలీలభగ్నమైయిలగూలె। మరివేయిబాణములుబరిపెరాక్షసుడు॥ భర
తుచాపముద్రుంచిమరిసూతుబరిమార్చి। తిరుగశరములుదైత్యుదరినిజే
రెనుగ॥ బలుడుగ్రకోపుడైభరతుజంపెదనంచు। సురలుభీతిల్లంగశూలం
బుదాల్చె॥ శూలముగ్రతలీలకేలనమరించుకొని। పలికెభరతునితోడబ
లుడుశతముఖుడు॥ శూలమిదిగోవేతుచూర్ణమైపోయెదవు। దొలగిపోదూ
రముకునిలువజాలవుగ॥ అనిపలికియాశూలమవలీలవేయంగ। అదిభాను
మండలంబనగనేతెంచె॥ ధరణియాకాశంబుతెరిపిలేకుండంగ। పెనుమం
టలెగయుచునుజనియెశూలంబు॥ శైలచయములుభ్రమగ్గజగముతల్లడమం
దె। కడువింతలోకములుకావలియుగప్పె॥ సాగరంబులుగలిగెచంద్రసూ
ర్యాదులు। గతులుదప్పిరిమిన్నుగడగడనువణకె॥ అతిభయంకరముగానా
శూలమేతేర। భరతుడమ్ములవానగురిపించెనపుడు॥ అవియెల్లదునుమా
డియాశూలమేతేర। శక్తిబాణమువేసెస్వామిసోదరుడు॥ శక్తిబాణము
గూల్చిచెలగిశూలంబేగ। కలసిభరతుండుకుంతలమువేసెనుగ॥కుంతలం
బునుద్రుంచిఘోరశూలంబేగ। బలుకటారినిబాడచెభరతుడవ్వేళ॥ ఆక
టారినిద్రుంచిఆశూలమేతెంచి। భరతువక్షస్థలముబట్టిభేదించె॥ అవయవం
బులువించిఆభరతునింజంపి। పోయిశూలముదైత్యుపాదిలోనుమారె॥

రా। ఘోరశరమే తెంచికుశునిదాకెనుగ ॥ రక్తధారలుచెదరి రఘువరుని నందనుడు। సొమ్మసిలియంతలో క్రమ్మరనదెలసి ॥ కదునిశాచరునిపై కన్నులెర్రగజేసి। అంతింతయనరానిహుంకారుడగుచు॥ పొదిలోనుబాణములు వదులుసూరులు వేలు। తెరిపిగనరాకుండదీటుకోలిపెనుగ ॥ వివిధశరములుమహా వేయిఅత్తులకోలది। దనుజనాథునిమేనుదునియ నేసెనుగ ॥ బలుదురాత్మసు ఘోరకాయమెల్లనుదూసి । కుశునిపొదిలో జేరెవానసగబాణములు॥ మరియురఘునందనుడుధరణిగంపింపంగ। నూరుశరములుబూని ధీరుడై యపుడు॥ జానకీరాముండుసత్యశీలుండైన।పరగసీతాదేవిపాతివ్రతైన ॥ ఈశరంబులుదైత్యునిన్నూరుచేతులు । తోకచుక్కలరీతిదూలి పోవలెను॥ అని ఘోరముష్టిచేనాబాణములు వేసె । దనరకంఠీరవధ్వనులుమీరుచును॥ పెనుమంటలెగయుచునుభీకరాకారముగ।ఘనశరము లేతెంచిదనుజునంటగను॥ ఘనశరంబులుగాంచిదనుజుండువడినేసె। తీవ్రశరములునూరుధీరుడై యపుడు॥ దనుజుడేసినబాణలతలుభగ్నముజేసి। దనుజభుజమధ్యమునదాకెబాణములు॥ కల్లిబిల్లిగనున్నకారుటడవులలోను। బలుపిరంగీగుళ్లుపడినట్లుపడెను ॥ బడుగై నగొడ్డళ్లుయడవినరికినరీతి। చెండాడెనానిశాచరునిహస్తములు ॥ ఒక్కహస్తంబైనదక్కకుండగజేసి। కుశునిపొదిలోదూరె ఘోరబాణములు॥ శాకలూడినమానుచందము నరాత్మసుడు। నిర్వీర్యహృదయుడై నిలువబడియుండె॥ అంతలో పలలవుండ నలాస్త్రములుబూని। దనుజరక్తకణంబులణగ వేసెనుగ ॥ కదుమేనురక్తంబుగారకుండగలవుడు। మరిమరియుననలశరములును వేసెనుగ॥ బాహువులుమాలుటకుబలుచింతనొందుచును। దనుజనాథుడుబ్రహ్మదలచె నయ్యెడను॥ కరము లెప్పటిరీతికడుసుందరంబుగా । వెలయగాదనుజునకు వెంటనేమొలచె॥ దనుజుడెప్పటిరీతితనరథంబుననిలచి । లవకుశాఖ్యుల యొక్కలాఘవముజూచి॥ బాలులనినిస్సారపరిచినందుకునెల్ల । జూపినా

రేవారిశూరత్వమెల్ల ॥ పశుపతియుగ్రమో భైరవయుగ్రమో। యనగ దాకిరియిద్దరన్నదమ్ములును ॥ బాలకులలాఘవబలపరాక్రమములకు। మెచ్చవచ్చునుగానిమిన్నకుందుగగ ॥ ఖండింతుబాలకులగర్వమెల్లనుదూల। తలిదండ్రులిద్దరునుతల్లడించగను॥ అనుచుతనయున్నారుకనులెఱ్ఱజేయుచును। పదిపదులువోళ్లతోపళ్లుగొరుకుచును ॥ ఉగ్రఘోరశరంబులొకనూరుసంధించి। యిరువంకలనుగాడవేసెబాలులను ॥ కుశలవులిద్దరును ఘోరశరములుదాకి। అద్భుతంబునగూలిరారామయనుచు॥ సీతామహాదేవిశ్రీరామచంద్రుండు। అధికశోకాతురులుఆయెనవ్వేళ ॥ హాహారీయనిమింటనమరాధిదేవతలు। రంజనల్చెడివిచారగ్రస్తులైరి ॥ హనుమద్విభీషణులుఅతివిలాపమునొంది। రెల్లవేడ్కలుదప్పితల్లడిల్లుచును॥ విజయుడంతటవచ్చివీరప్రతాపుడై! తండ్రిజంపినపగలుతాదీర్తుననుచు॥

శతముఖునితో విజయుడు యుద్ధము జేయుట.

కనులెఱ్రగాజేసిదనుజుకడ్డమునిలిచి। పలికెరాక్షసుతోడబలుకోపమునను॥ ఓరిరక్కసుడమావారిగొందరిజంపి। వెలయరణరంగమునవిఱ్ఱవీగెదవు॥ ననుగెల్వనీగండుతనమునాకగపరుచు। చూచెదనునీయొక్కశూరత్వమెల్ల॥ అనియొక్కపెట్టుననసురుపైబాణములు। పెక్కుకోటులుబరపెభీకరాకృతిని॥ తెరిపిలేకుండంగతీటుశరములుబూని। మరిమరియురాక్షసేశ్వరునిపై వేసె॥ రఘువరునిపౌత్రుండురాక్షసునిమేనంత। దూనిసిపోవగవేసెఘనబాణతతులు॥ రక్తధారలుమేనరాకుండబరిమార్చె। నాక్షేయబాణంబులంది బాలకుడు ॥ బాలకుడుకొంచెంబుభండనముదోడ్డదని। సురవరానీకములుజూచిమెచ్చిరిగ॥ తాతరాముడుమెచ్చతనుసురలుదీవింప। నంపవాల్లినిముంచెనసురునిటుబట్టి ॥ ధీరతనురాక్షసుడుతెప్పిరిలకుండంగ। ఘోరవిశిఖావళులుగ్రుమ్మరించెనుగ॥ రథముగూలగనేసిరథసారథినిజంపి। దూనిసిరాక్షసుమేనుదూసిపోగొట్టె॥ తెరిపితెన్నునుగురు

తుతేటగనపడకుండ । నంపవెల్లినిముంచెనసురుగ్నిబట్టి ॥ సిర్వోణహృద
యుడైనెపమేమితోచకను। తత్తరంబునుబొందెదనుజనాయకుఁడు ॥ తత
త్తరంబునుబొందితనకేమిదోచకను । తనలోనుతానిట్లుతలపోయదొణ
గ॥ అమరాదిసురలతోసప్తదిక్పతులతో। పోరుగావించితినిపూర్వకాల
మున॥ ఇట్టిశూరతమీరియెవ్వరైననుగాని । పూనినాకెదురిచ్చిపోరాడ
లేదు॥ వీనిపినతాతలునువీనిపినతండ్రులును । వీనిజనకుఁడుగూలెవీరరణ
మునను॥ వారంతనాచేతపోరగూలినమాట। కనులజూచెనుగానివెనుక
దీయడుగ॥ పసిబాలకుడువీడుబలమెన్నవధికంబు। యెట్లులబ్బెనోవీనికీబా
హుబలము॥ ఇట్టిబెడిదంబైనయుద్ధంబుగనలేదు । యిట్టిశూరునితోడనె
ట్లుబెనగుదును॥ పసిబాలకుండింతభండనంబొనరించె। నారాముడింకెంత
అనమానబలుఁడో॥ వీనిగెలువగలేకవెరగొందెనామనను । యిలతలాధి
పురాముగెలువంగగలన॥ తల్లిచెప్పినరీతితరుణిజానకిదేవి। భండనంబున
నన్నుబరిమార్చునేమొ॥ గెలువశక్యముగాదుతొలగిపోవగనియదు। ప్రా
ణంబుపైయాశపడరాదుయికను॥ చూపవలెనాయొక్కశూరత్వమంత
యును। యెట్లయినమంచిదేయనుచుదానవుడు ॥ ఘోరమగుసాగర
ముఘూర్ణిల్లుచందమున। పదహతమైనట్టిపన్నగమురీతి॥ విలయకాలము
నాటివీరభద్రునిపోల్కె। హూంకులన్నియుచాలముల్లగాలింపుచును॥ బా
లకునిపైపళ్లుపటపటనుగొరుకుచును। కనులెఱ్ఱజేసిసింగముపోల్కెమెర
సి॥ సరసగలవేరొక్కస్యందనముపైనెక్కి। ధనువులుబాణములుతనకర
ములంది॥ పద్మజాండములెల్లపగిలిబీటలుబార । నారిటంకృతులెల్లబో
రుకొల్పుచును॥ కాలదండములనగమేలైనబాణములు। రాముపౌత్రుని
పైనిరాక్షసుడువేసె॥ వినువీధినంటంగమినుమంటలెగయుచును। ఇనకిర
ణములబోలిజనియెబాణములు॥ గనుగొనుచువిజయుండుననలాస్త్రము
లువేసె। తునియలుగనడుమనవితూలవేసెనుగ ॥ అవితూలవేయుటకు

నుగ్రుడై రాక్షసుడు। పరువడినిరాక్షసబాణముల్బరపె॥ మిడిగ్రుడ్లుఘోర
లునుకడుభయంకరముగా। వికృతరూపములుగా వెలసెబాణములు ॥ ది
క్కులంటగజాలుదీర్ఘబాహులుగలిగి। పెనుమంటలెగయుచునుజనియె
బాణములు॥ ప్రళయార్కతేజుడై బలుడుతావిజయుండు। ఉగ్రుడై వైష్ణ
వాస్త్రముప్రయోగించె॥ అంధకారముగూల్చునబ్జమిత్రునిరీతి। దను
జుబాణములెల్లదగ్ధమొనరించె॥ బలుడుశతకంఠుండుపులకాంకురుండగు
చు। మితిలేనికోపంబుమతిదలంపుచు॥ కొదువశరములచేతకూలడికబాలు
డని దొడగెబ్రహ్మాస్త్రంబువడిగరాక్షసుడు॥ పొగలుమంటలుమింటభుగు
లుకొనిచెదరంగ। బాలకునిపై వేసెబ్రహ్మాస్త్రమప్డు॥ ప్రళయగర్జితము
గాప్రళయార్కతేజమై। కాళికరాళమై ఘనశరములేచె ॥ అంబుధులు
ఘోషించెనవనితల్లడమందె। భీతిల్లెలోకములుబెదరెనిర్జరులు॥ సీతామ
హాదేవిశ్రీరామచంద్రుండు! కలువరింపుచునుండ్రికటకటాయనుచు ॥ హ
నుమద్విభీషణులుఅతికంపమునుబొంది । రెల్లదిక్పాలకులుతల్లడించిరిగ॥
అనలములుగ్రక్కుచునుఆదివ్యశరమేగి। పరగవిజయునియురము బట్టిభే
దించె॥ అవయవంబులుచింపిఆవిజయుసిజంపి। ధరణిభేదించిపాతాళంబు
జొచ్చె॥ తిరిగిమహాత్వరితంబుమీరగవచ్చె। పదిలముగదానవునిపొదిజే
రెశరము॥ హాలోకనాయకాసోమహోద్ధారకా। యనుచువిజయుడుగూ
లెయుద్ధరంగమున॥ బాష్పములుదొరుగంగపరమపురుషుడురాము। డతి
శోకమునగుందెనంతరంగమున ॥ సీతామహాదేవిచింతబెనగుచునుండె।
హనుమద్విభీషణులుఅతిదుఃఖులైరి॥ ఏలతెచ్చితిమియీజోలిరామునికం
చు। ఖేచరబృందములుఖిన్నులైయుండ్రి ॥ అంతటనుశతకంఠుడతిరోష
మొదువంగ। రామభద్రునియెదుటరథమునిలిపించె ॥ పద్మగర్భాండము
లుపగులంగనార్చుచును ॥ జగములన్నియుసమయజేయునట్లుగను ॥ మ
ధ్యాహ్నమునవెలయుమార్తాండుచందమున। త్రిపురసంహారురీతిధేజరిల్లు

## శతముఖుడు రామునిపై యుద్ధమునకు వెడలుట.

చను॥ రథమునడిపించుకొనిరామభద్రునియెదుట। నిలచిబలుగర్వమున బలికెరాక్షసుడు॥ నరవరుడనాసహోదరులైనరావణ। కుంభకర్ణాదులను గూల్చిచంపితివి॥ నేనుగలననిభయమునీకేమిలేకుండ । నావారలనుజంపి నావురానీవు॥ వారలందరునునావారలనిభయమేమి । ఆత్మలోపలదోప దాయెరానీకు॥ వారినటుబరిమార్పనూరుకుందునటంచు । నీవుమదిలో నెంచినావుగావలెను॥ జ్ఞాతులమనుకున్నకారణమేమిటికి । కష్టసుఖముల వేళగనుపింపవలద॥ అపుడించుకంతైననావార్తదెలసితే। నిన్నయోధ్య కనుబోనిత్తునామరలి॥ తెలియనందుకునీవుతిరిగిఅయోధ్యలో। జేరినా వేగానియోరినరవరుడ॥ ఇన్నాళ్లుబ్రతుకుటకుసింపాగగానీకు।నాయువుం డగనాకునవుడేల తెలుసు॥ తెలిసినంతటనీవుతిరిగిపోయేదెట్లు। ఈవేళనా చేతనీయుద్ధభూమిలో। బడగూలుటకునీకుబ్రహ్మవ్రాసెనుగ ॥ లావణ్య మైననాలావెరుంగవునీవు। శరణుగైకొనునిన్నుకరుణజూచెదను॥ నావా రలనుగూల్చినావన్నకోపంబు। మానిరక్షింతునోమనుజవల్లభుడ ॥ ప్రా ణంబుపైనాశభావమునలేకుండెు। సమరంబుసేయరాచావునిజమాను॥భ యపడకనీబాహుబలపరాక్రమమెల్ల । భీకరాకృతిమీర నాకుజూపుము గా॥ నీబాహుసారంబునీప్రభావమునెల్ల। బలిమివ్యాపారంబుపారదోలె దను॥ నీవనగనాకెంతనిర్జరేంద్రునిసర్వ । దిక్పాలకులనెల్లతీటణంచితిని॥ శౌర్యధురంధరుడఘనకీర్తికాముడను। అగణితంబుగనుముజ్జగములేలితి ని॥ నాపేరువినుమాత్రభూపాలవరులెల్ల। సందుగొందులదాగియుందురే వేళ॥ వెలయునాప్రఖ్యాతివిన్నంతమాత్రమున । నెడబాసిపారుదురుయ క్షుమూతలైన ॥ గరుడకిన్నరయక్షగంధర్వవరులెల్ల । గుండెలవయుచు నుందురెందుజూచినను॥ బుద్ధిహీనతచేతపోరుకరుదెంచితివి। నీవేమిజేసె దవునీకర్మఫలము॥ నీతోసమానముగనేనుపోరొనరింప। నగ్గలంబుగమ

## శతకంఠుడు రామునిదూరుట.

కసుసిగ్గుబొందుమర॥ అనదగవునాకునీవెంతనేనెంతయే। నుగదోమచం దంబునగుబాటుమీరు॥ మంచుబిందువునీవుమార్తాండనిభమేను। మహిషజంతువునీవుమదగజమునేను॥ కలితశృంగమునీవుకనకమేరువునేను।హరిణజంతువునీవుహరిపతినినేను॥ వరపర్వతమునీవువజ్రాయుధమునేను। కలవంకమవునీవుఖగరాజునేను॥ఘనవృక్షచయమీవుకడుకుఠారమునేను। వనటమేకవునీవువ్యాఘ్రంబునేను॥ హీనపన్నగమీవువైనతేయుడనేను। మశకజీవమవీవుమత్తకరినేను॥ క్రొవ్వుమీరినగొర్రెకొండదాకినరీతి। ననుపోతుమదగజముకెనయిచ్చురీతి॥తృణముమేరువుతోడతులదూగుచందమున। తగుమనని నాతోయుద్ధముకువచ్చితివి॥నడువడైననునీకున్యాయమార్గములేదు। భావించిచూడంగపరమద్రోహుడవు॥ చిన్నప్రాయమునాడెస్త్రీహత్యజేసితివి। తాటకినిజంపితివితప్పుదెలియకను॥ శబరియెంగిలిపళ్లుచాలభక్షించితివి। కులహీనురాలనకగుణవిహీనుడవు॥ అరయరావణుడునీయాలిగొనిపోవంగ। నెరివాలిజంపితివినిష్కారణంబు॥ సీతబెళ్లాడుటకుశివువిల్లువిరిచితివి। ఇలమహాదేవునకునెగ్గుజేసితివి॥ రావణుడుచరగొన్నరమణిసీతనుదెచ్చి। యేలుకొనుచున్నావుయెగ్గుదెలియకను॥ ఈలాటివానితోనేనెట్లుసమముగా। నెదురిచ్చిపోరుదునుమరిలజ్జలేక॥ నాకోటపైనీవునడచివచ్చినవెనుక। చంపకుండగవిడువసహజంబుగాదు॥ నినుబట్టినవిధియింతునిజముగానీవేళ। చావుసిద్ధమునీకుజనవరోత్తముడ॥ అనియిట్లుమదముచేనతిమత్సరముచేత। పలుమారుశతముఖుడుపలికెగర్వమునన॥ పలుకులెల్లనుచాలములుకులై శ్రీరామ। విభుడునవ్వనుకినుకనెలయునిట్లనియె॥ శతముఖునీవింతసామర్థ్యుడవటంచు। వెలగినీప్రఖ్యాతిచెప్ప

## రాముడు శతముఖునాక్షేపించుట.

కోవలెన॥ నీసమాచారంబునిజశీలమార్గంబు। నీవుచెప్పగనేలనేనెరుంగు

దును॥ ఇంద్రాదిదేవతులుమెల్లదిక్పాలకులు। నెపుడునీప్రఖ్యాతినేర్పరిం
చెదరు॥ బ్రాహ్మణద్రోహంబుపరమమార్గమునీకు। నన్యాంగనాసక్తిఆ
త్మనిశ్చయము॥ పరధనముపరహింసపరికింపనీసొమ్ము। సిరుముగజేసెదవు
చెడుగుణములెపుడు॥ మునిహోమభంగమునుఘనపతివ్రతచరయు। నర
యనీమదికినిష్టాచారగరిమ ॥ సాధుహింసలయందుసకలదోషములందుఁ।
నిత్యముగావర్తింపనీపుట్టినిల్లు॥ నీవుజెప్పగనేలనేనేయెఱుంగుదును। నీచ
మార్గములైననీప్రభావములు॥ నిన్నమాహనుమంతునీగుండెపై బొడచి।
మకుటములుపడదన్నమాటలెఱుగుదుము॥ తలలెల్లబగిలిరక్తముకాల్వ
లై పాఱ। నేలబొరలిననీదునిజమెఱుఁగుదుము॥ కాంతసీతాభయంకరరూ
పముకుజడసి। పాఱిపోయిననీదుబలమెఱుంగుదుము॥ మాయలుమబ్బులు
మరిముచ్చుగుణములు। చాలగలిగిననీదుచందమెఱుగుదుము ॥ కణ్వము
నికూతురినికదసిబలిమినిబట్టి। స్త్రీహత్యజేయునీచేష్టలెఱుగుదుము॥ తా
పసేంద్రుండు నీతలలన్నిగూలంగ। శపియించునట్టి యాచందమెఱుగుదు
ము॥ ఏలజెప్పెదవుమాకీలాటిబీరములు। కేరిమాటలవల్లక్రియలేదుసుమ్ము॥
ప్రజ్ఞావిశేషములభయపడముపేశంబు। నగుపరుచునీయందుదగుపరాక్ర
మము॥ భక్తురాలై శబరిఫలములర్పించినది। అనుభవించితిమిమాకది
యేమితప్పు॥ అనుజునిబరిమార్పనాలాయపడియుంటె। వాలిబరిమార్చి
తిమివాస్తవమెదనుజ॥ తపసిబాధలమాన్పతాటకినిగూల్చితిమి।అదిమా
కు స్త్రీహత్యయనగబనిలేదు॥ జనకరాజుప్రతిజ్ఞచేసిహరుచాపంబు। దుని
మించెనాకేమిదోషంబులేదు॥ అఖిలజగములుమెచ్చనగ్నిసాక్షిగజేసి।క
రమొప్పజానకీతరుణిగొంటిమిగ॥ దుష్టులనుశిక్షింపశిష్టులనురక్షింప।నా
లాయమైయుంటిమసురుడామేము॥ నీవలెనుమునిబాధనిరతంబుగావించి।
కడుపాపకర్మములకొడిగట్టలేదు॥నీవుపుణ్యాత్ముడవునేనుపాపాత్ముడను।అని
నీవుపలుకంగనధికుడవుగావు॥తనదునడువడిలోకజనులెన్నగావలెను।తన

గొప్పతా జెప్పఘనమేమిలేదు॥ పలుమారునీవిట్లుప్రల్లదములాడంగ। రా దుప్రఖ్యాతేమిరంజిల్లబోదు॥ తెలిసినదినీయొక్కబలిమిసాహసవృత్తిహ నుమంతుచేమాంకునసురనాయకుడ॥ అగుపరుచునీయందుదగుపరాక్రమ మెల్ల। క్రియలేదునీయొక్కపలుకుల-దేమి॥ అనివాయుజునిమీదతననునిలి చివెలుగొందె। రాముచెంటనుసీతరంజిల్లుచుండె॥ హనుమంతుచాటున నసలాస్త్రములుబూని। పొసగవిభీషణుడుపొంచియుండెనుగ॥ శ్రీరామ వాక్యములుచెవిలోనశూలములు। బరిఢినట్లుగదోచికరుకురక్కసుడు॥ ప టపటనుదంతములుషగులంగగొరుకుచును। ప్రళయకాలమురుద్రుపగిది బోలుచును॥ ఘూర్ణిలుచునారితాంకృతులొప్పజేయుచును। రవిచంద్రు లనుగాంచురాహువుచందమున॥ మదగజముసింహమునుమార్కొన్నచం దమున। దంతితోడుతదంతిదాకొన్నరీతి॥ భైరవునిచందమునబలుడుశత కంఠుండు। రథముదోలుకువచ్చిరామునన్నిధికి॥ ఉరువడినితనరథముబర పబీటలుబారె। పుడమిపరాగంబువడినపుడుయెగసె॥ ధరణిభయపడిమిం టదాగబోయినరీతి। గదువడినినాకాశగంగలోగలసె॥

శతకంఠుడు రామునితో యుద్ధముజేయుట.

దానవుడుకోపమునదాకిరఘువరుపైని। చేబూనిసంధించెశరము లొకనూరు॥ అయోధ్యనాయకుండారామచంద్రుండు। దనుజుశరము లుగూల్చెతక్షణంబునను॥ తక్షణంబుననిట్లుదనుజశరములుగూల్చి। బా ణవర్షముగురిసెదానవునిపైని॥ బలుమంటలెగయంగ బ్రహ్మాండములు నిండ। తనశరంబులుగప్పెదనుజుపైనపుడు॥ తనబలిమియేర్పడగఘనుడు రఘునాయకుడు। ఘనశరంబులువైచెదనుజుపైనపుడు॥ నరనాయకుని శరములురువడినిజనుదెంచి। యుదుటుగారాక్షసునివదనంబునాటె॥ వద నములుకంఠములువడలంతయునునాటె। రక్తసిక్తుండయ్యెరాక్షసుండపు డు॥ దనుజుమేనునరక్తకణములొలుకకయుండ। నసలబాణమువేసెనపు

డురాఘవుఁడు॥ దానవుఁడుకోపమునమానవేంద్రునిమీఁద। ఘనశరంబులు
నొక్కగతినూరువైచె॥ పెనుమంటలెగయుచునుభీకరాకారముగ। జను
దెంచెబాణములుజనవరునిపొదివె॥ అనలశరములుపూని అఖిలాండనా
యకుఁడు। అసురబాణములెల్లనవనిబడఁగూల్చె॥ సమరధులిద్దఱునుచలము
గొనిపోరంగ। సురలోకములవారుచూడవచ్చిరిగ॥ మదగజముమదగజ
ముమార్కొన్నచందమున। గగనంబుగగనంబుగవయుచందమున॥ ఇ
నుఁడినుండునుగూడిపెనఁగుచందంబునను। వారాశివారాశిఁబోరుచందము
న॥ సింహంబుసింహంబుఁజెలఁగిపోరినరీతి। కనకాద్రికనకాద్రిఁగతినిమార్కొ
నిన॥ గజదానవుఁడుమహేశ్వరునిఁబోరినరీతి। వృత్రాసురుండింద్రుఁడొప్పు
చందమున॥ జానకీనాయకుఁడుశతకంఠుఁడనుగండు। మిగిలిదలపడిరొక్కప
గిదినిద్దఱును॥ ధీరులైసింధుగంభీరులైకనకాద్రి। ధీరులై యిద్దఱునుపోరొ
నర్చిరిగ॥ సమరధులుసమబలులుసమరసన్నాహులు। దలపడిరిఘనభు
జాదర్పములువెలయ॥ వారిద్దఱీరీతిపోరొనర్చుచునుండ। భండనోద్దండప్ర
తాపంబువలన॥ ధరణిదిద్దిరదిరిగెతారకలిలరాలె। ఘోషించెవారధు
లుగూలెశైలములు॥ దిశలుకంపమునొందిదిక్పాలకులొరిఁగె। నిర్జరాదు
లుమింటనిర్వేణులైరి॥ కాలంబులెక్కింపఁగాదొణంగెనుబ్రహ్మ। కడుసూ
ర్యచంద్రులునుగతులుదప్పిరిగ॥ పార్వతీశుఁడుబ్రహ్మపాకారిగూడుకొని। వి
లయకాలమునాటివిడ్డూరమనిరి॥ ఆకసముపైవైపునరసిచూచుచునుం
డ్రి మాటమాటకుచాలమఱిభీతిగొనుచు॥ తనబాణములుగూలిదగ్ధమై
పోయెనని। కాలాంతకునిరీతికదసిరాక్షసుఁడు॥ పదులునూరులువేలుబహు
లక్షబహుకోట్లు। శరములుద్ధతిద్రేపెనరనాథుపైని॥ పొగలుమంటలు
వెలయమిగులవేడిమిమీఱ। భానుకిరణములనగఁబరగెబాణములు॥ అది
గాంచిరఘురాముఁడత్యుగ్రకోపమున। దివ్యశరములునూరుదీకొల్పెనవుఁ
డు॥ పెనుమంటలెగయుచుభీకరాకారముగ। నసురుబాణములెల్లహత

మొనర్చెనుగ॥ చాలరౌద్రాకృతినిశతకంఠుడప్పేళ । విలయకాలాంతకు
నివిధినిమందుచును॥ తననూరుచాపములఘనశరంబులుబూని। కంఠీరవ
ధ్వనులుగదురవేసెనుగ॥ మరియుమరియునుతీవ్రశరములుద్ధతిబూని॥ నర
నాయకునిమేనునాటవేసెనుగ॥ జగముభీతిల్లంగసింహధ్వనులుజేసి॥ బలు
శరంబులురామభద్రునేసెనుగ॥ దనుజబాణములెల్లతనమేనుపై నాటి॥ ర
క్తధారలుచెడరెరామభద్రునకు ॥ తీవ్రశరములుబూనితెరిపిలేకుండంగ।
దనుజవల్లభుమేనుమునియవేసెనుగ॥ తనువంతయునురక్తధారలుజ్వాలము
గుచు। ఝుర్ఝురీకృతుడాయెజానకీవరుడు॥ మదినేమిదోచకనుమానవా
ధీశుండు। నిశ్చేష్టుడై తానునిలచియుండెనుగ ॥ అఖిలాండనాయకుండా
రామచంద్రుండు। చేతులాడకనునిశ్చేష్టుడై యుండె॥ దానవునిబాణము
లుమేనంతటనునాటె। నిశ్చేష్టుడై యుండెనిఖిలవల్లభుడు॥ చూడవచ్చిన
యట్టిసురవరానీకములు। కనులనశ్రులుదొరుగకటకటాయనిరి ॥ పాతకు
డుశతకంఠుప్రల్లదములాడుచును । మనుజవల్లభుగూల్చుమదిదలంచుచు
ను॥ సమయమిదియేరామచంద్రునిజంపుటకు । ననుచుపటుకాండములు
గొనిముష్టివేసె॥ శరముశరమునునాటతెరిపిలేకుండంగ। బలుదురాము
నిపై నిబరపెబాణములు ॥ దిశలునాకాశంబుతెరిపిగనరాకుండ । బహు
కోట్లురాముపై బగపెబాణములు॥ నరవరానీకునాలావుగనజేతుకని। గు
రిసెనమ్ములవానతెరిపిలేకుండ॥ బాణాగ్నిలోగుందిపడురాఘవాయనుచు।
డీకొల్పబాణములుతెరిపిలేకుండ॥ శతకంఠనామంబుసర్వజనభయకరం।
బెరుగవాయనిశరమువేసెదైత్యుండు॥ ధరణియాకాశంబుతెరిపిలేకుండం
గ। పెనుమంటలెగయుచునుజనియెబాణములు ॥ భూనభోంతరములను
బాదవుచుమండుచును। ఘనశరములేతెంచెమనుజేశుబాదువ ॥ సురవసు
లుభీతిల్లెనూర్యుండుగతిదప్పె। వ్రాలెనక్షత్రములుశైలములుగూలె ॥ జ
గముకమ్మరిసానపగిదిగిరగిరదిరిగె। చిట్టచీకటిగ్రమ్మెనష్టదిక్కులను ॥ సీ

తామహాదేవిచింతింపగాదానగె। రావణానుజుడుహారామంచువగచె॥ ఆవచ్చుబాణంబులన్నికన్నులజూచి। అసమానవీరుండుఅంజనీసుతుడు॥ బాణములురఘువరునిమేననాటుకయుండ। నడ్డంబుగాబెట్టెనపుడువాలంబు॥ అఖిలనాయకునెదుటనడ్డంబుగానిలిపె।తనవాలమొకవింతపెనుగొండరీతి॥ వజ్రశైలమురీతివాలమడ్డమునిలిపి। ఘనపుణ్యచరితుండుహనుమదాంహ్వయుడు॥ పెనుమంటలెగయుచుదనుజేశుబాణములు। వచ్చివాలముదాకివడిగూలిపడియె॥ గిరిబోలివాలంబుశరములకునడ్డమై। యుండెశరములుదాకిగుండపిండయ్యె॥ దానవునిబాణములుదాకిగుండై పోయె।పవనజునివాలంబుబలిమియెంతటిదొ॥ తనబాణతతులెల్లహనుమంతువాలమున। దాకిగుండై పోవదానవుండపుడు॥ విలయకాలానలమువెలయుచుండంబునను। తననూరుమొగములనుపెనుమంటలెగయ॥ లెక్కలేకుండంగపెక్కుశరములుదొడగి। ఆర్చుచువడివేసెనపుడురాక్షసుడు॥ వాయునందనువాలవజ్రశైలముదాకి।దనుజబాణములెల్లతునియలైపడియె॥ మరికొంతసేపటికిమనుజనాధుడు దెలసి। దివ్యశరములుదీసిధీరుడై యపుడు॥ ఘనభుజాటోపుడై కనులెర్రజేయుచును।దానవునిపై వేసెదప్పకుండగను॥ అదిదానవునిదాకినన్నిచూర్ణంబయ్యె। దానవునితనువెంతదట్టమోకాని॥ దనుజుమేనునుదాకితనబాణతతులెల్ల। చూర్ణమగుటకురాముచోద్యమునుబొంది॥ ఘనుడుశతకంధరునితనువుబలువజ్రంబు। కాకన్నబాణములుఖండితములౌన॥ దనుజతనబలమెల్లదాఖలాగనుపించె। నిట్టిశూరుండులేడీలోకమునను॥ అనిరామచంద్రుండుమనమునుద్దేశింప। దనుజుడంతటవీరదర్పితుండగుచు॥ తననూరుచాపములఘనబాణములుబూని। రఘువరునిపై వేసెరాక్షసుండపుడు॥ అవియుతొల్లింటివలెహనుమంతువాలంబు। దాకిచూర్ణంబయ్యెతత్క్షణంబునను॥ అందుకసురుడుచాలఆగ్రహుండై మండి। పటపటమనుచునుపళ్లుతాగొరికె॥ కనులెర్రజేయుచునుకడు

భయంకరముగా । హనుమంతుపై జూచిలసురవల్లభుడు ॥ తనబలంబున తానుజనుదెంచిహనుమంతు। వాలంబుదునుమాడవలెనంచుదలచె॥ ఆ రాక్షసుండపుడుహనుమంతువాలంబు । దునుమాడవలెనంచుతనమదిని దలచె। తనబలంబులబిలచిహనుమంతువాలంబు। ఘనశరంబులకడ్డుగా నిల్పినాడు॥ మర్కటచేష్టలనిమహిలోన జెప్పుదురు। దాఖలాగనసర చెతరుచరేశ్వరుడు॥ పొసగహనుమంతునకుబుద్ధివచ్చెలాగు। తోకముక్కలుగాగతునియవలెమనసు॥ తండతండంబుగాతుండతుండలుగాను । ఖండములై వాలిలఖండించవలెను ॥ అడిదములుబట్టుకొనిఅందరొక్కమ్మడిని। సమువుడిమీావెంటనడిచివచ్చెదను॥ అనిబలంబులుతానునరుగుదెంచుచునుండ। సవిగాంచిశ్రీరాములధికకోపమున ॥ ఒక్కపెట్టునగదిసివచ్చుబలములజూచి। తలయూచిమువ్వ్మారుతాటించియపుడు॥ అసురబలములనెల్లనతివేగగూల్చుమని । పాశుపదాస్త్రింబుభక్తితోదీసి॥ తనకరంబుల బట్టిఘనభక్తిబూజించి। రిపుసంహారముజేయుమిప్రుడునీవనుచు॥

రాముని పాశుపతాస్త్రిము సర్వరాక్షసులనుజంపుట,



దృష్టించిరఘురామునిదివ్యబాణంబపుడు । అభిమంత్రించునరించి అసురుపై వేసె॥ అదిరెండుమూడుమెయిరయపదినూరులై । వేలులక్ష

లకోట్లువెలసిభువినిండె॥ అర్బుదములై మహానిర్బుదములై మహా। ఖర్వం
బులై లెక్కగానరాకుండ॥ అష్టదిక్కులుయవనియాకాశములునిండె॥ చె
దరిరాక్షసకోట్లుబెదరిపారగను॥ శతకంఠుబలముచండాడగాదొణగి। వె
లయంగనాబాణవివరమెట్లనిన॥ ఒక్కొక్కదనుజునకునొక్కొకయైదేసి।
బాణములై నేలబడగూల్చెశరము ॥ దానవునకై దేసిబాణంబులై తగిలి।
సకలదానవబలముసరిపుచ్చెశరము॥ అలసారధికిఁజేయుబలుశరములై దూ
సి। యెల్లసారథిగదిసియేపుమాపెనుగ॥ గజముకొకయేనూరుకాండంబు
లై దూసి। గజబృందములనెల్లగడతేర్చెశరము ॥ గుఱ్ఱమునకొకనూరు
ఘోరవిశిఖములగుచు। నశ్వసముదాయములనణగించెశరము ॥ బలుర
థమునకులక్షబాణంబులై దూసి। రథములన్నియుబట్టిరట్టాడెశరము॥ కే
తనంబునకువిఖ్యాతంబుగామూఁడు। లక్షలై యఖిలంబులట్టాడెశరము॥ ర
థికునకునరువదిలక్షలై చండాడి।। అఖిలదిక్కులపొంకమణగించెశరము॥
అడవినరికినరీతినఖిలబలములనెల్ల। చండాడిసరిపుచ్చెశీఘ్రముగశరము॥
పేరుకై నావొక్కవీరుండునిలకుండ। మడియజేసెనుబాణమహిమయెట్టి
దియొ ॥ కంటకుండై నశతకంఠుడొక్కడుదక్క । కొదువరాక్షసబలము
గూలెసర్వంబు॥ శ్రీరామవిభుదివ్యశరమహిమయెట్టిదో। బదుగురాక్షసబ
లముగడియలోఁగూల్చె॥ ఒక్కబాణము వేసి పెక్కులక్షలకోట్లు। నర్బుదం
బులుగూల్చెనసురేశుబలము॥ శతకంఠడొక్కఁడేమతివిహీనుండగుచు। ది
క్కుమాలినవాని తెరవునుండెనుగ॥ అభ్రతలమునసిలిచియమరాదిదేవతు
లు। పరమసంతోషమునభాసిల్లిరపుడు॥ తనసేనయావత్తుధరపై నిగూలె
నని। చింతించివొకకొంతసేపుదానవుడు॥ రథికులందరుగూలెరాక్షసబల
మణగె। నరనాయకునిదివ్యశరమహాత్వమున॥ శరమొకటిమంత్రించిసర్వ
దానవబలము। నరగడియలోఁగూల్చెనరవరోత్తముడు॥ ఒక్కబాణంబ
య్యెపెక్కులక్షలకోట్లు। నరవరుడుమంత్రించెనంతలోపలను॥ తల్లిమా

టలుయిపుడుదాఖలాగనుపించె। సిగ్గుమాలినరీతిజేరుదునుపురము॥ పుర రాక్షస స్త్రీలవగలంతజచ్చుటకు। ఘోరశోకంబుననుగోలపెట్టుదురు॥ పురుషులందరుపోరపాలసినారనినేను। యేరీతిజెప్పెదనుఇంతులకునెల్ల॥ పురికిజేరుటకంటెమరణత్వమేమేలు। నరవరునిగెలువంగ తరముగాదికను॥ బ్రతుకాశపడిపురికిపారిపోయినవల్ల। మనవారునవ్వుదురుమగతనము గాదు॥ శూరత్వముననిలచిపోరొనర్పగవలయు। దైవగతియేరీతిదనరియున్నదియో॥ పలుమారుచింతింపపనిలేదుయికనంచు। పొసగధైర్యము మదినిపురికొలుపుకొనుచు॥ అధికపౌరుషముననుహుంకృతిగళతముఖుడు। వెలయగతననూరువిల్లెక్కుబెట్టి॥ గుణరవధ్వనులచేకులశైలములుగ్రుంగె। శేషుంతుతలవంచెజగముభీతిల్లె॥ ఘోరశరములునూరువీరతనుసంధించి। వేసెరామునిపైనివెక్కసంబుగను॥ అవియుతొల్లింటివలెహనుమంతువాలమున। దాకిగుండైపోయెదానవుండడర॥ అవివృథాపోవుటకునత్యంతకోపుడై। కన్నులెర్రగజేసికరుకురాక్షసుడు॥ కాలదండములనగమేలైనబాణములు। వేలులక్షలకొలదివేసెబాణములు॥ దిశలుభూచక్రంబుతెరపిలేకుండంగ। పెనుమంటలెగయుచునుఘనశరమువేసె॥ ఘనశరములేతెంచి హనుమంతువాలమున। కొన్నితప్పకదాకి గుండపిండయ్యె॥ కొన్నిరఘురాముమేనన్నిదిక్కులనాటె। కొన్నివాయుజునుదుటగురుతుగానాటె॥ కొన్నివిభీషణునిగుండెలపైనాటె। కొన్నియావలనున్నకొండపైదగిలె॥ దనుజశరములుయిట్లుతనుదాకియుండుటకు। నుగ్రుడైయపుడురామావనీశ్వరుడు॥ తరుచుగాచాపమునదుర్వారమగుదహన। దైవతంబగుమహాస్త్రముప్రయోగించె॥ శరమిట్లుసంధించిగురిజూచిరాక్షసుని। యురముపైవడివేసెనరనాయకుండు॥ చిచ్చులనుగ్రక్కుచునుశరముయురువడినేగి। త్వరమీరశతకంఠుయురముపైగాడె॥ దనుజనాయకునురముదూనిసియావలనున్న। గిరిబీటలైపోవశరమ్మేగిదాకె॥దాన

వృదుసొమ్మసిలి తత్తరంబునుబొందె । గిరిరెండుచెక్కలై ధరణిపైగూలె॥ రాక్షసుని దేహంబు రక్తమిలబడకుండ । నానలబాణము వేసెనటువిభీషణుడు॥ కొంతసేపుకు దెలసికుపితుఁడై రాక్షసుడు । నలుదిక్కులనుజూచిపలువరింపుచును॥ హనుమంతుదరిడాగిఅవలబాణము వేయ। నావిభీషణుజూచిఅసురనాయకుఁడు॥

శతకంఠుడు విభీషణుని దూరుట.




అనరానిదుర్భాషలాడుచునుకోపంబు। రట్టుమీరగచునుతానిట్టలనియెనుగ॥ పాపరాధీనుడాఅవురావిభీషణా।కులద్రోహుడవుగోరి ఘోరపాతకుడ॥ లంకతోవలగుట్టుపొంకముగాజెప్పి। హతమార జేసినావందరినినీవు॥ ఆలాగునేఁడిప్పుడాలాయపట్టావు । కోరినాగుబ్బిల్లవై రులకుదిలుప॥ ఓరిదుర్మార్గుడావోరిపాపాత్ముడా। యిందరినిజంపినీకేలరాబ్రతుకు॥ వంశమంతయుగూల్చివనధిలోగలిపితివి। వాకిటనీబ్రతుకేమివన్నెకెక్కనురా॥ నారక్తబిందువులనావంటిరక్కసులు । వేలులక్షలకోట్లువెలయు

కంఠగను॥ పొసగపవనజు వెనుకపొంచియునలాస్త్రంబు । వేసి వేమునసర
క్తమింక జేసితివి॥ బలములన్నియు నేలపాలాయె నారక్త। కణములందున
నైనగలుగనివ్వవుగ॥ రక్తకణములనై సరాక్షసులు జనియిస్తె। బలము
యెప్పటిరీతి ప్రబలుచుండునుగ॥ పాపము నకోడిగట్టి పాలుబడితివి నీవు। యిం
పారసి కేమియెగ్గు జేసితిరా॥ నేను మరణము నొందనీకేమి గలుగును । నీల
కేతుడు రాజ్యమేలుకుంటాడు॥ గుట్టెల్లవిడ జెప్పి కొలమెల్ల గూల్చితివి। మూ
ఘుడా నీ మొగము జూడ దోషమురా ॥ మమ్మునందరి జంపి మానితంబుగ నీ
వు। చిరకాలవశుడవై జీవమొందెదవా॥ నిస్సరణ గానిలోనిను గాలనే
సితిని। యీవేళ మరిచినా కెదురునిలిచితివి ॥ తప్పక నీవేళ తల ద్రెళ్ల నేసెద
ను । యెందుబోయెదవు నీకెవడు రాదిక్కు ॥ శ్రీరాముతో నచ్చి వ్రాగుకో
కండంగ। వ్రాని వేంతివి నాపైని బాణములు ॥ ఇటకుముందే నిన్ను యమపు
రికి బంపుదును। చాలదూరం బెంచి శాంతించియుంటి ॥ శాంతించి నేనున్న
జాడనే నెరుగక। మాయకోని నాతో నుపోరజొచ్చితివి ॥ అంత్యకాలపు బు
ద్ధి ఆసన్నమై నీవు। వైరితో సమముగా వర్తించినావు॥ పలుమాట లేలయీ
ఖండనములో నిన్ను। భూతకోటుల కెల్ల జేతు హోరంబు॥ నినుశరణు గో
న్న ఘనుడు జూడగ నిన్ను । వారి వుత్తు చూడు సంగరములో పలను ॥ ఇంత
మాంత్రమున నీవేల గర్వము నొంది । పొంచి బాణము వేయ బూనసాగితివి॥
అని ఘోరముగ నార్చి కనులెర్రగా జేసి । శక్తి బాణము దాడగ శతకంధ
రుండు॥ క్షణమాత్రమున విభీషణు గూల్చి రమ్మనుచు। ధీరుడై వడి నేసె దివ్యా
స్త్రమునను ॥ కులశైలములు గ్రుంగె కూర్మ మల్లలనాడె। కడు చంద్ర భా
స్కరులు గతులు దప్పిరిగ ॥ భూనభోంతర మెల్ల బొదలి మంటలు వెలయు ।
శరము విభీషణుని శిరముపై గాడె ॥ శరము విభీషణుని పైగాడితె। పరవశం
బై మూర్ఛబడె విభీషణుడు ॥ సురలంత బెగడొందసోలి విభీషణుడు। హోరా
ఘువా యంచు నవనిపై వ్రాలె ॥ ఆవనిపై వెసగూలు నా విభీషణు జూచి ।

కడుదుఃఖముఖుడయ్యెఘనుడురాఘవుడు ॥ కటకటాహాయింతగతివచ్చె
నాయంచు। విలపించెజానకిపలువిధంబులను॥

### రామ శతముఖుల ఘోరయుద్ధము.



మదికొంతచింతించిమానవేంద్రుడురాము। డనురుపై విలయకా
లానలుండగుచు॥ వరషధారలరీతివడిమీరబాణములు। ధీకొల్పెదనుజు
పై తెరిపిలేకుండ ॥ అదిగాంచిశతకంఠుడనలాస్త్రములుబరపి। కోపుడై
శ్రీరామభూపాలుపైని॥ వారుణాస్త్రమువేసివారించిశ్రీరాము। డాదను
జుబాణంబులన్నిచల్లార్చె॥ కుపితుడై రాక్షసుడుఘోరంబుగానార్చి। నా
గబాణమువేసెనరనాథుపైని ॥ విషములుగ్రక్కుచును వెలయంగమం
డుచును। శరములరుదేరంగజననాథుడపుడు ॥ భుజగబలములనెల్లపొరి
పుచ్చుమనిచెప్పి। ఘనుడురఘునాయకులుగరుడాస్త్రమేసె ॥ మార్తాం
డతేజమైమహీనిదిక్చక్రమై। దనుజనాగాస్త్రములుధరణిబడగూల్చె॥
కోపించిరాక్షసుడుభూపాలవరునిపయి। హస్తిశరములువేసెనాగ్రహము

తోను॥ సింహబాణము వేసె శ్రీరామజనవరుడు। హస్తికుంభస్థలములణగిం
చివైచె॥ అతిరోషమునబొంది అసురకులనాయకుడు। వాయువాస్త్రము
వేసెవసుధేశుపయిని॥ నరవరుండంతటనునాగాస్త్రములుబరపి। వాయు
వాస్త్రములెల్లవసుధబడగూల్చె॥ జానకీనాయకుడుశతకంఠదనుజుండు।
నొకటితీరునపోరుచుండిరవ్వేళ॥ కాలరుద్రులబోలిఘనశరంబులుబూని।
భుజలాఘవమునసరిబోరిరిద్దరును॥ అఖిలదిక్కులనప్పుడంధకారముగప్పె।
పగలురాత్రేర్పడకప్రొద్దుగానకను॥ ప్రళయగర్జితములనబలుసింహనాద
ములు। బ్రహ్మాండభాండములుబెండుపడియుండె॥ తనబాణతతులెల్లతుని
యలైపోవుటకు। చాలరోషముబొందిశతకంఠుడపుడు। కనులనిప్పులురా
లకడుభీకరంబుగా। ధనువులన్నిటదాల్చెఘనకాండతతులు॥ కంఠీరవధ్వ
నుల్గదయంగశ్రీరాము। జనవరునిపైవేసెశతకంఠుడపుడు॥ రాక్షసునిబా
ణములురాకుండబరిమార్చె। ఘోరబాణమువేసిశ్రీరామవిభుడు॥ అసు
రబాణముల్లుహతమార్చిశ్రీరాము। దనుజుపైరోషంబుపెనుగొనంగగ
ను॥ దానవునిబలురథముదగ్ధమైకూలంగ। ఘోరబాణమువేసికూలవే
సెనుగ॥ రథమువికలంబైనరాక్షసుడువెరగంది। వేరొకస్యందనమువేగ
తానెక్కె॥ పుడమిగంపింపంగకనుభయంకరముగా। పెల్లార్చిదానవుడు
భీకరాకృతిని॥ ఘోరశరములుబూనిశ్రీరాముపైవేసె। తునియలుగన
డుమనవిదునిమెరాఘవుడు॥ అందుకసురుడుకోపమందికార్చిచ్చువలె। మం
డుచుండగనంతమనుజవల్లభుడు॥ ఘనశరంబులుబూనిదనుజుబాణముల
న్ని। తునియలైపోవంగదునుమాడెనపుడు॥ చాపములుదూలంగకోపిం
చెశతముఖుడు। తననేత్రములయందుపెనుమంటలెగయ॥ కేలశూలము
బట్టిగిరగిరనుద్రిప్పుచును। బ్రహ్మాండభాండములుపరగనార్చుచును॥ రఘు
వరునిపైవిసరెరాక్షసుడుశూలంబు। విలయానలముబోలుబలుశూలమే
సె॥ కలగెసప్తాంబుధులుకులగిరుల్వ్రాసగూలె। ధరణికంపమునొందెతార

కలురాలె ॥ అతితల్లడమునొందిరమరాది దేవతులు । సన్మార్గములుదప్పె చంద్రభాస్కరులు॥ పెనుమంటలొలుకఁజునుఘనశూలమేగంగ। తనపాలమల్లార్చిహనుమంతుడపుడు॥ అరయవచ్చెశూలమందినడిమికిబట్టి। విరిచిముక్కలుజేసెతరుచరవరుండు॥ తునకలుగశూలంబుదునుమాడెహనుమంతు। సురలుపువ్వులవానగురిసిరప్పేళ ॥ తనశూలమీరీతితునకలై పోయెనని। రాముగూల్చెదననుచురాక్షసుండపుడు॥ పటపటదంతములు పగులంగగొరుకుచును। తననూరుమోములను పెనుమంటలెగయ ॥ కేల గదధరియించిగిరగిరవడిద్రిప్పి। విసరెరఘువరుపై నివిభ్రాంతిగనుర ॥ కాలదండముబోలికతులోకములుబెగడ । తగమింటిపయిదేవతులుబొబ్బలిడగ॥ పవనుండునెరిదప్పభాస్కరుడుభీతిల్ల । జనుదెంచిగదరామజనవపునిబొదివె ॥ గదదెబ్బమైనాటిఘనుడురఘునాయకుఁడు । పవనుజాభుజముపయిబడిసొమ్మసిల్లె॥ సురలుబెగడొందంగసొమ్మసిలిరఘువరుడు। కొంతసేపునకుదెలసిఘోరరౌద్రముగ ॥ దానవునిబరిమార్పతానిశ్చయముజేసి। నిండారకోపంబునిర్వహించుచును॥ రాజపరమేశ్వరుడురాజకందర్పుండు। రాజాధిరాజశ్రీరాఘవేశ్వరుడు ॥ అర్ధచంద్రాస్త్రంబులవివింటసంధించి। దీక్షగైకొనిపల్కెదేవదేవుండు ॥ జగతిలోవేదములుసత్యమైయుండెనా। పరగసీతాదేవిపాతివ్రత్యమైనా॥ ఆడితప్పనివాడనైనేనుబరగినా। ఏకభీకరముగానీశరంబిపుడు॥ శతకంఠుహస్తములుశిరములన్నియుదునిమి। అతిశీఘ్రముగవచ్చుననుచుతావేసె॥ పుడమియాకాశంబుకడుమంటలెగయంగ । ఘనశరంబేతెంచిదనుజాగ్నిబొదవె ॥ కడుశాఖలున్నట్టిఘనవృక్షచయముపయి । బడుకుఠారమురీతిబడియెనాశరము ॥ పడిదానవునిఘోర బాహులన్నియుగూల్చి। శిరములన్నిటినొక్కవడినగూల్చెనుగ॥ శాఖలూడినమానుచందమునరాక్షసుడు। కరశిరంబులుమాలివెరగందియుండె॥ కరతల్లంబొకటైనశిరమొక్కటైనను। దనుజునికలేకనుండెదునుమాడె

శరము॥ తిరిగిక్రమ్మరవచ్చిత్వరమీాదబాణంబు। పదిలముగ శ్రీరాముపాది లోన జేర॥ కరశిరంబులుదూలిఘనుడుశతకంధరుండు। మొండెమై జెగురుకొండవలెనుండె॥ దనుజరక్తము నేల పెనుకాల్వలబారె। యోజనము పొడవుగానుజ్వరిల్లుచును॥ అనలాస్త్రిమునరక్తకణములింకించుటకు।జాలినవిభీషణుడు నేలవ్రాలెనుగా॥ దీర్ఘనిద్దురబొంది తెలివేమియులేక। నేల విభీషణుడుగూలియుండెనుగా॥ రాక్షసునిబలుమేనురక్తప్రవాహంబులు జ్వరిల్లుచుబారెయోజనముపొడవు॥

శతకంఠునిరక్తముచే మాయశతముఖులు బుట్టుట.

రక్తకణముకునూరురాక్షసులుబుట్టుటకు। వనజసంభవుదివ్యవర మహత్యమున॥ మిన్నునంటుచుపారుచున్నరక్తప్రవా। హములందుబుట్టి ననసురసంఘములు॥ శతకంఠురూపంబు జెందివానినిబోలి। పుట్టికొక్క విధానభువనములునిండ॥ మాయశతకంధరులుమహి తెరపిలేకుండ। నెలసియుండిరిచెప్పనలవిగాకుండ॥ భీకరాకారులై కడుగొండలవిధాన। నిఖిల లోకములపుడునిండియుండిరిగ॥ గణుతింపగావశముగాదుబ్రహ్మకునైన। వీరలిందరటంచువివరంబుదెలుప॥ తెరిపిరెన్నునుగుఱుతు తెలియకుండగ బుట్టి। రేమిచెప్పుదు నెల్లభూమినిండిరిగ॥ దశరథబ్రీసాయుధాధారులై మహా। వికృతదైత్యులు వెల్లివిరిసియుండిరిగ॥ బాహువులుతలలు మెప్పటిరీతినుదయించె। శతకంధరు డుపూర్వచందమునసుండె॥ శతకంఠుడునుమాయశతకంఠులనుబోలి। వర్ణింపనెవ్వరికివశముగాదాయె॥ అన్నిదిక్కులయందునన్నిభూములయందు। వెల్లివిరిసినలాగు వేలాముగనిరి॥వికృతరూపములచేవినువీథినంటుచును। సింహధ్వనులమీరిచెలగిదాటుచును॥ ఏదిక్కుజూచినా యెడ తెరిపిలేకుండ।కడునిశాచరకోట్లుగానంగబడిరొ॥సీతామనోహరుడు సేనాసముద్రంబు। కన్నులనుబాడగాంచికడుభీతినొందె॥ భీతిగొనిరఘురాము బెడిదబలములగాంచి।తల్లడంబునుబొందితలపోయదొ

ఆగె॥ ఈమాయరక్కసులుయేదిక్కుజూచినా। పుడమియీనిసరీతిబోలి
యున్నారు॥ ఇందులోశతకంఠుడెవ్వడోగానియా। భేదమేమియుగనుపిం
చదాయెనుగ ॥ ఇన్నిదిక్కులయందుయీరాక్షసులతోడ। నేరీతిజెనగు
దునుయెట్లుపోరుదును॥ ఇనసుతునిబలముకంటెక్కువేగనుపించె। నన్న
శక్యంబుగాదేమివీరలను॥ ఈదుష్టరాక్షసునకేలయిచ్చెనుబ్రహ్మ। ఘోర
వరములువీడుకోరినట్లుగను॥ ఏవైపుపోరాడుదేవైపుగనుగొందు। నేవై
పునిల్తునింకేవైపుజూతు॥ అనిరాఘవేశ్వరుడుతనమదినిగుందుచును। ద
లపోయుచుండంగదనుజులంతటను॥ శూరులైరఘువరునిచుట్టుముట్టడివే
సి। గదసిరోక్కవిధానగర్వాంధులగుచు ॥ గదసితిట్టుచుసాయకములచే
మీరుచును।తెగనిమాట్లాడుచునుదాడిమీరుచును॥ మనుజనాయకనిన్ను
దునిమిఖండలుజేసి। బరువడినికల్లుతోభక్షింతుమనుచు ॥ శూరులైడా
యుచునుచూడుమామహిమనుచు। కేరుచునుమీరుచునుగిరుకెట్టుచు
ను॥ పరశుముద్గరప్రాసబలుకుఠారంబులను। పగబూనిరఘువరునిపైనివి
సరుచును ॥ చుట్టుముట్టడివేసినట్టివాల్ద్రోక్కుచును। పటపటదంతము
లుపగులగొరుకుచును ॥ మీసములుద్రువ్వుచునుమిట్టిపడియెదురుచును।
బాణవర్షమురాముపైనిగురియుచును॥ కనులనిప్పులురాలకదుహుంకరిం
పుచును। నరవరనినుబట్టిబరిమార్తుమనుచు ॥ చీకాకుబొందంగజేసిరార
ఘువరుని। యేమిజెప్పుదువారితామసోద్ధతులు ॥ ఏవంకజూచినాఆవంక
తామెయై। రఘుకులాధిపుమనముబెగలజేసిరిగ॥ అసమానబలశాలిఅఖి
లాండనాయకుడు! ధైర్యమంతయుదూలితల్లడముబొందె॥

### మాయశతకంఠులజూచి రాముడు చింతించుట.

లోకములనన్నిటినిలోలతనురక్షించు। ఘనుడురఘువరుడుభీకర
ముమూలెనుగ॥ నిర్వీణహృదయుడైనెపమేమిదోచకను। చేతులాడకసుని
శ్చేష్టుడైయుండె॥ శౌర్యమంతయుమాలిచాపమచ్చటవిడచి। నిశ్చేష్టు

డైయుండెనిఖిలవల్లభుడు॥ నిశ్చేష్టుడైయుండినేలఁబ్రాలినయట్టి। కడువిభీ
షణుజూచికటకటాయనుచు॥ దైవమీరీతిగాదలచెనాయనియంచు। హ
నుమంతుజూచియిట్లనియెరఘువరుడు॥ చిరకీర్తిగంభీరపరమపుణ్యవిహా
ర। అంజనీనందనాఅసమానధీర॥ కంటివామాయశతకంఠరాక్షసబల
ము। నిఖిలభూములయందునిండియున్నారు॥ సకలదిక్కులయందుసకల
భూములయందు। నేలయీనినభంగినిలిచియున్నారు॥ దనుజకోటులనె
ట్లుమనుమాడగావచ్చు। నేరీతివారితోబోరాడవచ్చు॥ బెడిదముగమిన్నం
టిపెల్లాప్పుబలమెల్ల। కోమరొప్పనాచేతగూలునేరీతి॥ నేచందమునగూ
ల్తునేమియూలోచింతు। నేమిసాధనముయింకేదిమార్గంబు॥ కనరాడుశత
కంఠదనుజుండుయెవ్వడో। ఒక్కపోలికగానుయుండిరందరును॥ దనుజు
లందరిబట్టిమనుమాడకనుగాని। కనరాడునిజముగాఘనుడుశతముఖుడు॥
ఘోరబలములనెల్లగూల్పశక్యముగాదు। కనులగనరాడుశతకంఠదా
నవుడు॥ నీచాత్ముడెచటతానేయుగుచునున్నాడు। యేరీతిపోరుదునుయెట్లు
దునుముదును॥ దనుజుగూల్పగనసాధ్యముగానిసాధ్యంబు। గాదుపోరొన
రింపరాదుహనుమంత॥ సమరతలమునయికనుశతముఖుబరిమార్ప। నెం
తవీక్షించినాయికవట్టిజోలి॥ ఎదురసత్తువదెలియకేలపగబూనితిని। ప్రజ్ఞా
విశేషములుపలికితేటికిని॥ బలయుతులమనుచుత్వరపడరాదుయెవ్వరు
ను। అపకీర్తియునుకార్యహానిసిద్ధించు॥ చాలమునిబృందములకేలనభ
యంబిస్తి। తనవల్లగానట్టిపనిజేతుననుచు॥ అవనిలోపలగొప్పఅపకీర్తివ
చ్చెగా। నేమిసేయుదునింకనేమిసాధనము॥ ఎల్లజనులెన్నుటకుహేతువ
య్యెనుగదా। చేయజాలనిపనులుచేతుననుమాట॥ రావణాసురుకంబొ
లావైనవీరుండు। గురుతుదెలియకనేలగోనివస్తినిటకు॥ కడుప్రయాసము
ననీకార్యమంతవహించి। దనరియుంటివిమాటదక్కినదిగాదు॥ బహు
ప్రయాసంబునకుపాలుబడితివిగాని। నీచుదనుజునిత్రుంపనేరనైతినిగ॥ నా

వల్లగానిపనినీవేమిజేసేవు। నీవల్లపనులన్నినిర్వహించితివి॥ తిరిగినేనయోధ్యాధ్యపురికెట్లువోవుదును। అనుజలేరనితల్లులడిగితేమందు॥ సకలబలములిదెచ్చిసంగరాంబుధిగలిపి। ఎల్లజనులడిగితేనేమిచెప్పుదును॥ శరణాగతత్రాణాకరుఁ నేలనుగలిసె। కడువిభీషణుదెచ్చివీడమిగల్పితిని॥ దైవగతియీరీతిదగగల్గియుండగా। మొదటరాకుండంగవదులునామనసు॥ తిరిగెట్లుపోరుదునుమరమెట్లుచేయుదును। దురముసేయగరాదుతిరిగిపోరాదు॥ ఇందుకేమితెరంగుయేమియాలోచనయొ। నీకుదోచినరీతినాకుజెప్పుముగా॥ అనియనేకవిధంబులనురామచంద్రుండు। హనుమంతుతోఁబలికెనాత్మగుందుచును॥ జలజలనుకన్నీరుదొరుగంగహనుమంతు। తలవాలవేసుకునితానుండెనపుడు॥ అతివిచారగ్రస్తుడైయున్నప్రాణేశు। గనిజానకీదేవికడుభక్తివెలయ॥ తనయాదిమహిమంబుతలపోసితనచేత। దనుజుండుగూలుననితానిశ్చయించి॥ యిదియెంతపనియనుచు మదినితాభావించి। అతిధైర్యగాంభీర్యయైమహాలక్ష్మి॥ కడుభక్తితోడతనకరయుగంబులుమోడ్చి। ప్రాణవల్లభునితోఁ పలికెధైర్యమున॥

సీత యుద్ధముచేయుటకు రాముని వేడుట.



అఖిలలోకాధారఆదినారాయణా। భువనరక్షకపుణ్యపురుషశ్రీ
రామ॥దీనబాంధవదేవదేవచిద్రూపకా।పరమాత్మకాపరబ్రహ్మస్వరూప॥

భువనములునిర్మింప పోషింపరక్షింప । నిఖిలంబువర్తింప నీవెకాకెవ
రు॥ నీకుక్షిలోనుండునిఖిలలోకములెపుడు। నీవులోకములందునిలిచియుం
దువుగ॥ కపటనాటకసూత్రనిపుణుండవై నీవు।మాయాప్రపంచంబుజేయు
చున్నావు॥విశ్వమయుడవునీవువిశ్వకర్తవునీవు। విశ్వసాక్షివినీవువిష్ణుమూ
ర్తివిగ॥ నరునివలెమీరిట్లుపరితాపమొందంగ। ధర్మమానామీకుదశర
థారామ॥ తమరెఱుంగనియట్టిధర్మమేమియులేదు। మహిమదెలియకనిట్టి
మాటలాడెదరు॥ కుపితదనుజునిపెద్దకొండగాజేసుకొని! చింతింపగాదగు
నయింతమాత్రముకు ॥ రక్తమునజనియించురాక్షసులబరిమార్ప। సంత
సంబాందేవుయెంతపనిమీకు ॥ మాయాబలములెల్లమాయమైపోవరా।
గడియలోమీచేతఘనవృత్రచరిత॥ బలుడుశతముఖుండుబలమెంతగలిగు
న్న। కూలడామీచేతకొండకైవడిని॥ మీమహామహిమచేతామసంబున
నేను। దేవమీయలసటలుదీరునందాక ॥ విలుబాణములుబూనిబలురా
క్షసునితోడ। రణమొనర్చెదధైర్యమునకొంతసేపు॥ ఆడదియనిమీరలా
నుగ్రహముజేయ। కుండధర్మముగాదుపుండరీకాక్ష ॥ పదపద్మములమఱు
గుబట్టిపోరెదనాక। భయమేమిమీపాదపద్మములునమ్మ॥ వేగననుదీవిం
చివిల్లుబాణములిచ్చి। శలవునాకిప్పించుజగదేకవీర ॥ దనుజతోపోరాడె
దనుకొంతసేపుయా। వెనుకపోరాడవచ్చునుమీరుదేవ॥ ననుమించిదాన
వుడుకనుపించువేళలను । అడ్డమైనిలవచ్చునాత్మేశమీరు ॥ కనికరంబున
నాకుఘనశరంబులువిల్లు। కడువేగదయచేయుకరుణాపయోనిధి॥ అనిపా
దపద్మములవనితసీతాదేవి। వ్రాలినంతటజూచివసుమతీశ్వరుడు ॥ మును
గురుడువసిష్ఠుతనతోడజానకీ। మహిమదెలిపినమాటమదిలోనదలచి॥ ర
ణమునకుశలవుయిమ్మనిజానకీదేవి । తన్నడుగుటకుమదినిదాఖిలాపడెను॥
స్త్రీలనిస్సారంబుజేసిశతకంఠుండు। బ్రహ్మావరములుగొనుటభావమునదె
లసి ॥ నాతిజానకివరంజ్యోతిస్వరూపమై ! వెలుగుచున్నట్టియావిధమెల్ల

జూచి ॥ సీతామహాదేవిచేతసిద్ధంబుగాదనుజుండు । గూలుననితానిశ్చయించి॥ తనపాదములుఃబట్టుతరుఃశీలలామంబు । గనిరాఘువేశ్వరుడుకని కరంబునను॥ రెండుచేతులబట్టిలెగనెత్తిదీవించి । భామినీయిదిమహాప్రళయభండనము ॥ భామినీమణినీవుభండనముకఠినంబు । బలురక్కసుడు వాడుభద్రంబునుమ్ము॥ అనిచెప్పిదీవించిఘనబాణతూణముల్ । దయబెనంగగనిచ్చెదాశరథియపుడు ॥ విల్లుబాణములందివిమలాంగిజానకి । జ్యోతిస్వరూపంబుమూర్తీభవించె॥ తనమహాతేజంబుధరణియాకాశంబు। జగమెల్లవెలుగంగసతితేజరిల్లె॥కోటిసూర్యులభంగికొమరొప్పవెలుగుచును। పరిపూర్ణకళలతోభాసిల్లెతరుణి ॥ హనుమంతుభుజమునందభ్రింబుముట్టగా। నిలచెసీతాదేవియెలమిబొందుచును ॥ ఎలమిబొందుచుసీతయెల్లలోకంబులకు । కడుభయంకరరూపుగనుపట్టెనపుడు ॥ పూర్ణచంద్రునిబోలుపొలుపారుసతిమోము। ప్రళయార్కబింబంబుపగిదిగానుండె ॥ కందర్పకేతువైగనుపట్టెసతిపైట। కడుధూమకేతువైగానంగబడియె॥ అమృతప్రవాహమైయలరారుసతిమోము । అనలసందోహమైకనుపట్టియుండె॥ కాంతసీతాభయంకరరూపమునట్లు । విలసిల్లెలోకములువిభ్రాంతిగదుర ॥ అభ్రతలముననిలచిఅమరాదిదేవతలు । జయజయధ్వనులెల్లసలిపిరయ్యెడను॥ నారిటంకారములభోరునమిన్నంటి। వెలయసీతాదేవివిల్లెక్కుబెట్టె॥ గుణరవధ్వనులచేగూలెకులశైలములు । బ్రహ్మాండభాండములుపగిలెబీటలుగ॥ మదిరాక్షితనమహామాయసాకర్షించి। దానితోడుతబలికెతప్పకుండగను॥ శతముఖుతోనేనుసమరంబుజేసెదను। రాక్షసునిపైవెడలురక్తబిందువులు॥ రక్తబిందువులతోరాక్షసులుపుట్టుదురు। చాలనాశ్చర్యముగశతముఖుబోలి॥ రక్తకణములనేలరాలిపడకుండంగ। మాయశతకంధరులుమహిబుట్టకుండ॥ ధరణిపైనీజింహ మబరపియామడపొడవు। అసురరక్తంబెల్లహతమార్పవలయు॥ అనియిట్లుతనమాయకనుకూలము

గజెప్పి। అందెజానకీదేవి అస్త్రశస్త్రములు ॥ తనవిల్లుఝుళిపించిఘనశ
రంబులబూసి। కంఠీరవధ్వనులాక్రాంతజేసెనుగా ॥ కంఠీరవధ్వనులుకడు
ఘోరముగజేసి। అంకించివేసెతానధికబాణములు॥ పిడుగులురిమినరీతి

సీత మాయశతముఖుల జంపుట.



పెనుమంటలెగయుచును। శరములేగెనునిశాచరులపైనపుడు॥ వడగళ్లవ
రషంబుపుడమిగురిసినలాగు। బడియెరాక్షసకోట్లపైనిబాణములు॥ చటు
లాస్త్రములుబూనిపటుజవంబునవెసె। సింహాధాటీజేసిసీతావధూటి॥ ప్ర
ళయగర్జితములుబలుమంటలెగయుచును। కడునిశాచరకోట్లుగప్పెబాణ
ములు॥ తనమహాత్వముచేతదానవావళులెల్ల। చేతులాడకనునిశ్చేష్టులై
రపుడు॥ చుట్టుముట్టడివేసిరట్టాడుబలమెల్ల। నిర్వీణాహృదయులై నిలువం
గబడిరి॥ వెలదిసీతాదేవివిశ్వరూపముజూచి। కంపమొందుచునుంద్రికట
కటాయనుచు॥ వాయువాస్త్రమువేసిమాయశతకంధరుల। నందరినినొ
కదిక్కునుండజేసెనుగ॥ దూదిపింజలలాగుతూలిసీతాదేవి। వాయువా

స్త్రము చేతనొకదిక్కునుండి॥ ఒకదిక్కునమాయరక్కసులనియమిం
చి। యెలమితనపతివినగనిట్లుతాననియె ॥ మూడుమూర్తులకెల్లమూల
దుంపనటంచు। పరమవేదార్థములుపలుకునిజమైతే॥ ఆర్తరక్షామణుండై
రామచంద్రుండు। మహిమమీరినయట్లుమాటనిజమైతే॥ పరమపాతివ్ర
త్యగరిమంబునాయందు। దనరియుండినమాటతథ్యంబులైతే॥ నిజముగా
శతముఖుడునిలువతక్కినయట్టి। మాయశతకంధరులుమడసిపోవలెను॥అ
నిఘోరముగనార్చెనమరులద్భుతమంద। ఘోరశరమొకటందిగురుతు
గాప్రేసె॥ పొగలుమంటలుచెదరమిగులవేడిమిమీర। వడినేగెబాణంబు
వారిపైనపుడు॥ అదిలక్షలైకోటులర్బుదములైమహా। శంఖంబులైబర
గెజగమునిండగను॥ అఖిలరాక్షసవర్గమరసిభీతిల్లంగ। దాకెనసురావళికి
దశవిధంబులను॥ గుండెలవయుచునేలగూలిరొకకొందరును। బాణము
లుమైనాటిపడిరికొందరును॥ కరములునురములునుకంఠములుశిరములు
ను। తునియలైధరణిపైనొరగెకొందరును॥ దినకరుడుమంచుమాయను
జేయుచందమున। గూల్చెనసురావళుల ఘోరబాణంబు॥ కారుటడవుల
వహ్నిగాల్చుచందంబునను। నసురబలములగాల్చెనాదివ్యశరము॥ మగు
వసీతాదేవిమంత్రాంగ మెట్టిదో। బలుశరంబునగూలెబలములన్నియును॥
మాయశతకంధరులుమాయమైకూలంగ। నీరుగావించెనొకనిముసమా
త్రమున॥ మందుకైనాయొక్కమయుడునిల్వకయుండ। గూలిపోయిరిదై
త్యజాలమందఱును॥ మాయశతకంధరులుమడియుటెల్లనుజూచి। కాల
రుద్రునిరీతిఘనుడుశతముఖుడు॥ తననూరుముఖములనుపెనుమంటలెగ
యంగ। పటపటదంతములుపగులగొరుకుచును॥ జానకీసతికెదురుజనినిల
చిశతముఖుడు। పణతితోడుతబల్కెబహువిధంబులను॥ మగనివెనుకకు
ద్రోచిమగువరోనాతోడ। కయ్యంబుజేయుటకుకదలివచ్చితివి॥ ఏలోక
మునగలవు యీలాటిసంగతులు। నగుబాటుపనినీకు దగునటేకొమ్మా॥

మగనివెనుకకుద్రోచిమాయకొనివచ్చేవు। నీవిభునకపకీర్తినిందపాలౌను॥
నీతోసమానముగనేనుయుద్ధముజేసి। చెలియనీనుజంపితే స్త్రీహత్యవచ్చు॥
నీతోటిసమరంబునేనుజేయగరాదు। పొలతినీతోడనేబోరసిగ్గౌను॥ విభు
నిచేతికినీవువిల్లుబాణములిచ్చి। తొలగిమెప్పటిరీతినిలువుమోరమణి॥ఆడ
దానికిసంగరత్వమెచ్చటగలదు। వలదునీతోనాకువైరమెన్నటికి॥ సంగ
రంబుననీవుజచ్చెదవునిజముగా। స్త్రీహత్యదోషంబుసిద్ధించునాకు॥ పర
గదోషమువచ్చుపనులుసేయగరాదు। యెరిగినీతోపోరుయెట్లుసేయుదు
ను॥ న్యాయమార్గమువదిలినడువరాదెవ్వరును। నళినలోచననీవుతొల
గుదూరముకు॥ అతివనీపతిపైనిఆశగలిగుండెనా। శరణుగైకొనిజేయుక
రుణజూచెదను॥ పతియాశలేకున్నబవరముననాతోడ। నిలువజేయుము
వానిబలమణంచెదను॥ తగదుయుద్ధమునీకుమగువరోనాతోడ। నీకపకీ
ర్తియగునాకుపాపంబు॥ ఏకచక్రత్వముననెల్లలోకములిపుడు। భద్రము
గపాలించెబలుపుణ్యనిధిని॥ యువిదామణులతోడయుద్ధంబుజేసితే। నా
కేసులందరునునవ్వరానన్ను॥ వినుమునామాటగైకొనుమునీపతివెనుక।
జనుముసుజ్ఞానంబుగొనుమువేగమున॥ అనిరాక్షసుడుబలుక నతివసీతా
దేవి। చిరునవ్వునవ్వుచునుశతముఖునకనియె॥ శతముఖనీయొక్కసన్మార్గశీ
లములు। నెరుగజెప్పితివినేనెట్లునమ్ముదును॥ చెలగిననుజంపితే స్త్రీహత్య
దోషంబు। సిద్ధించుననిచాలజెప్పేవునీవు॥ మునిహోమభంగములుఘన
పతివ్రతచరలు। యెట్లుగావించితివియిట్టిపుణ్యుడవు॥ గోవిప్రదేవతాక్షో
భంబుయావత్తు। నింతతెలిసినవాడవేలజేసితివి॥ కణ్వమునికూతునికౌగి
టనుబంధించి।యలమితో స్త్రీహత్యయేలజేసితివి॥ సకలజీవక్షోభసద్వృ
త్తియనినీవు। యింతదెలసినవాడవెట్లుజేసితివి॥ నిండుచెరువులబట్టినీరుతె
గ్గొట్టుటలు। నేలగలిపితివేమినీవింతదెలసి॥ నాతోడపోరాడభీతిమదిలోద
లచి। సూటిదప్పినయట్టిమాటలాడితివి॥ ననుజంపగాలేవుదునుమాడెద

నునిన్ను। స్త్రీహత్యనీకేమిసిద్ధించబోదు ॥ స్త్రీహత్యపూర్వమునజేసితి
వాహత్య। యమలోకముననిన్ను యముడుశిక్షించు ॥ నీవుజేసినయట్టినిఖి
లదోషములకును। యమగుండములనీకు నేర్పాటుదెలను ॥ అఖిలదోష
ములెల్లనపుడు దెలియునునీకు। నిపుడునే దెలుపంగనేమిఫైపుదువు॥ జెగద
భిరాములనుజంపుతాననినీవు। పలుకుమాటలకంటెపాపంబుగలద ॥ పా
లించిలోకముల నేలినాననినీవు। పలికినందున నేమిఫలముసిద్ధించు ॥ అనృ
తవాక్యములునీవనగా నక్రియలేదు। పాపసంచయము యేర్పాటుజెప్పెద
ను॥ గోగణంబొకనూరుగూల్పపాతకమబ్బు। ఠరగనొకబ్రాహ్మణునిబట్టి
చంపినను ॥ బ్రాహ్మణులనూర్గురను బట్టిచంపినయట్టి। పాపమబ్బునువొ
కపణతిజంపినను॥ పణతులనూర్గురనుబట్టిచంపినయట్టి। పాపమబ్బును
వొక్కబాలజంపినను॥ బాలలనూర్గురనుబట్టిచంపినయట్టి। పాపమబ్బును
వొక్కబద్ధంబువలన॥ అంతపాపంబొక్కయనృతమాడినగలుగు। యే
లనీవాడితివియిటులయనృతములు ॥ ఘనతజేసేవిమాఘుస్నానశీలములు।
మారేవియెల్లపుడుదామ్మర్లయిళ్లు ॥ అన్నట్లుగానిప్పుడున్నదినీమాట। నీ
న్యాయవర్తనలనిజమెంచిచూడ ॥ అసిమిలోపలదొకటి అమ్మకనేదొక
టి। ఆత్మలోపలదొకటిఆడేదియొకటి ॥ కనుపించెనీమాటకడుయద్భుత
ముగాను। కాలనేమిజపంబుబోలెనీమాట ॥ ఫలమేమిలేదిట్టిపలుకులకు
నీకిపుడు। గెలువుననునీయొక్కకొలదిజూచెదను ॥ శ్రీరామజనవరుడుచే
యడికయుద్ధంబు। దెలిపెదతనియొక్కతెరగునీతోడ ॥ స్త్రీలనిస్సారంబు
జేసివరములునీవు। బ్రహ్మచేబడసితివిపరగతొల్లిటను ॥ నిస్సారమంతయు
నునీమదికిదెలియంగ। నిజముగానాచేతనిన్నుజంపించు॥నరనాయకునివెం
టవనుదోడిదెచ్చుడలు। భండనంబుననిన్నుబరిమార్చుకొరకు ॥ యమ
లోకమునకునిన్నంపకుండగమేము। తిరిగిమాయయోధ్యపురిజూడబో
ము॥ పెక్కుమాటలికేలరక్కసుడానీవు। బ్రతుకవలెననియాశభావమం

దుండు॥ శ్రీరాఘవులశరణుజేరియాతనిదివ్య। పాదారవిందములబడినర
క్షించు॥ అదిసహింపకయున్న అనుజుడానాతోడ। పోరుమానియొక్క
పొంకమణపెదను॥ అనిలోకమాతసీతామహాదేవిట్లు। తనతోడబలుకం
గదైత్యుడిట్లనియె॥ కాంతవనిసీమీదకనికారమునచేను। తొలగమనిచె
ప్పంగతొలగవైతివిగ॥ ఎదురుమాట్లాడితివియికనెందుబోయెదవు। నీవి
భుడుజూడంగనిన్నుజంపెదను॥ అనుచుదైత్యుండట్టహాసాధివుండగుచు।త
ననూరుమొగములనుపెనుమంటలెగయ॥ కంఠీరవధ్వనులుకడుఘోర
ముగజేసి। తననూరుచాపములుతానెక్కుబెట్టి॥ ఘోరశరములునూరు
ధీరతనుసంధించి। వేసెజానకిపైనివెక్కసంబుగను॥ అవిమంటలాకాశ
మంటివిశిలల్లాడ। జనుదేరబొడగాంచిజానకీరమణి॥ తునియలైనడుమన
విదూలంగబరిమార్చి। ఘనబాణతతులేసెదనుజుపైనపుడు॥ మరియుమ
రియునుపెక్కుమార్గణంబులుబరపి। దనుజదేహంబెల్లదునియవేసెనుగ॥
దనుజదేహంబెల్లతునియలైపోవంగ। మరియుమరియునుదివ్యశరములే
సెనుగ॥ ధీరంతరక్కసుడుతెప్పిరిలకుండంగ*। బరపెజానకిదివ్యశరపరంప
రలు॥ శరపరంపరవేయచక్రంబురీతిగా। కొనలురెండునుగలసిధనువుగ
నబడును॥ దనుజరక్తమునేలపెనుకాల్వలైపారి। రక్తకణములబుట్టిరై
రిరక్కసులు॥ మగువసీతాదేవిమాయామహత్వమున। నసురురక్తంబెల్ల
హాతమారిపోయె॥ అందుకసురుడుమనంబడరితనరక్తమున। జననమొం
దగలేడుదనుజకోట్లనుచు॥ మగువసీతాసతీమాయామహత్వమును। తన
మదినిభావించుకొనిదానవుండు॥ తనరక్తకణములనుదనుజాళికబుట్టరని।
మనమునందునిరాశగొనెదైత్యవరుడు॥ సీతాసతినిజూచి భీతిమదిలోగుం
ది। తలపోసెరాక్షసుడుపలువిధంబులను॥ అతివజానకికాంతఆడదనియెం
చుటకు। వశముగాదెవ్వరికివర్ణించిచూడ॥ ఎంతవీరుండైననెంతశూరుం
డైన। పోరునాయీరీతిధీరత్వమునసుతల్లి చెప్పినరీతిదగనన్నుగూల్చెటి।

ప్రతిర్మయంబైన సుదతియిదినిజము ॥ నాతితోఁబోరంగ నాశక్యమా
కోదువ। దానవులశక్యమాధరణిలోపలను॥ చాపునిజమేగానిజానకీసతికి
నా। ఘనభుజాటోపంబుగనపర్చవలెను॥ అనుచుదానవుడపుడుకనులెఱ్ఱ
గాజేసి। ప్రళయార్కబింబంబుపగిదిమీరుచును ॥ వేలులక్షలుకోట్లుమే
లైనబాణములు। జానకీకాంతపై చెలరేగివేసె॥ పుడమియాకాశంబుగడ
గడనువణకంగ। ఘోరశరములుబరపెక్రూరరాక్షసుడు ॥ వేయుబాణ
ములెల్లవెంటనేగడతేర్చి। తనబాణచయమేసెతరుణిమహాలక్ష్మి ॥ బాణత
తులీరీతిభస్మమైపోయెనని। వెనుకతీయకదనుజవీరుడుగ్రతను ॥ తెరిపిగన
రాకుండశరపరంపరగప్పి। ముదితసీతాదేవిబాదవవేసెనుగ॥ ధరణియా
కాశంబుతెరిపిలేకుండంగ। దీకొల్పెబాణములుధీరుడై యపుడు॥ కంఠీరవ
ధ్వనులుగదూరశతకంఠుండు। సీతమేనునగాడశరములేసెనుగ ॥ దనుజు
డేసినబాణతతులుమేనుననాటి। రక్తధారలువెలసెరమణిమేనంత॥ రక్త
ధారలువెలసిరమణిసీతాలక్ష్మి। కాలాగ్నిచందమునగనిపించెనపుడు ॥ క
నులునిప్పులుచెదరదనుజుపై వెసజూచి। సింహధ్వనులుమీరిసీతావధూ
టి॥ ఘోరశరములుబూనికొమ్మతావడినేసె। వేలులక్షలకోట్లువిపరీతము
గను ॥ దనుజునర్వాంగములుదునిసిపోవగనేసె। నెడతెరిపిలేకుండనించు
కంతయును॥ తూట్లులై మేనంతదునియనీగతివేసె। దనుజునకువిశ్వరూప
ముగానబడియె॥ ప్రళయార్కతేజమునభామతావిలసిల్లె। కడుభయంక
రదీప్తిగనుపట్టియపుడు॥ వెలసిసీతాదేవివిశ్వరూపముదాల్చి। తనయాది
మహిమంబుతనమదినిదలచి॥ అష్టదిక్పాలకులుయమరాదిదేవతులు। శం
కరులుపదకొండ్రుచంద్రభాస్కరులు॥ ద్వాదశాదిత్యులునుతగనవబ్రహ్మ
లును। పదునాల్గుభువనములుపద్మజాండములు ॥ అరయత్రేతాగ్నులును
అంబుధులుకులగిరులు। విష్ణుమూర్తియుబ్రహ్మవిశ్వనాయకుడు॥గనుపిం
చిరొక్కపెట్టుననుజ్జ్వలంబుగా।జూచిభయమునుబొందెనుగవైరియపుడు॥

సురవైరిభయపడెనుతరుణిజానకీదేవి। మరియుమరియునుయనలశరవృష్టి
గురిసె॥ దనుజుడతిభీతుడై వెనుకవెనుకకుబోవ। దీకొల్పెబాణములుతెరి
పిలేకుండ॥ శారీరమంతయునుజర్ఝరీకృతమాయె। పెనుకాల్వలై పా
రెదనుజరక్తంబు॥ మరికొన్నిబాణములబరపిసీతాదేవి। వెలయదానవు
నూరువిల్లుతెగఁగొట్టె॥ దానవునిమకుటములుధరఁగూలిరాలంగ। కొన్ని
శరములుబరపెకొమ్మతానపుడు॥ నిచ్చేష్టుడై దైత్యునిలచిగనుగొనుచుం
డె। దనుజదేహముదూలఘనశరములేసె॥ ఎచ్చోటజూచినాఅచ్చోట
తనకాల। మృత్యువై గనుపించెముదితదైత్యునకు॥ భయపడుచుదానవు
డుపలుదెరంగులజూడ। నంపవెల్లినిముంచెనపుడుమహాలక్ష్మి॥ తనకుమ
రణమునిజంబనిదానవుడుమహో। కంపమునుబొందుచునుకటకటాయను
చు॥ తనుగానదికేకదియనుచుపలుబాములను। మతిగుందిరథముపై చ
తికిలనుబడియె॥ చతికిలంబడిబలువిచారంబుతోనున్న। దనుజునొవ్వగనే
సెననలబాణములు॥ ఎడలేకరక్తంబుయొడలంతయునుదడసి। కుపితుడై
జేగురుకొండవలెనుండె॥ మరియుఘోరాస్త్రములుతెరిపిలేకుండంగ। బ
రిపెజానకిభయంకరరూపమునను॥ ఘనభోంతరములనుబాదవిమంటలు
వెలయ। జనుదెంచెబాణములుదనుజుపై బాదవె॥ మర్మములుకంఠములు
మరికపాలముదూసి। పోయిశరములుసీతపాదిలోనుజేరె॥ తూటులై మే
నంతదూసిసర్వాంగములు। రక్తధారలువెడలెరాక్షసేశునకు॥ శూరత్వ
మెడబ్బాసిసొమ్మసిలిరాక్షసుడు। పరవశుండై మూర్ఛబడెరథంబందు॥ ర
థముపై సొమ్మసిలిరాక్షసుడుమూర్ఛిల్ల। గనుగొనుచుసూతుండు కడుభ
యంబునను॥ హాదానవాయంచునతివిలాపమునొంది। గొనిపోయెదూ
రంబుదనుజేశురథము॥ వెనుకదిరుగుచుసీతగనుగొనుచుభయపడుచు।
దూరంబుగారథముదోలుకొనిపోయె॥ చాలనెత్తురువరదనేలంతయునుద
డసి। పెనుకాల్వలై పారెదనుజరక్తంబు॥ పరవశుండై మూర్ఛబడిరాక్ష

సేశ్వరుడు। కొంతసేపుకుదెలిసిగుండెలవయుచును। నలుదిక్కులనుజూచి
బలువగలబొందుచును। కనకమణిరథముపై తనులేచినిలిచె ॥ నిలచితన
కంఠములగలహారతతులెల్ల। సవరింపుకొనుచుతనసారథితోబలికె ॥ నా
బాణసారంబునాభుజబలిమియును। నాదుజవసత్వములునాప్రతాపంబు॥
తేటగానీపిన్ననాటనుండెరుగుదువు। దురములోరథమేలతొలగితెచ్చితి
వి ॥ రిపులునవ్వంగనాకపకీర్తిరంజిల్ల । తొలగితెస్తివిరథముకొలదిదెలి
యకను ॥ అష్టదిక్పతులతోనమరాదిసురలతో । దురమునర్చితినిముం
దెరుగవానీవు॥ ఎరిగినారథమేలమరలించితెచ్చితివి॥ తగునమాతలినీకు
నగుబాటుపనులు॥ అనినవినిసూతుండుహస్తములుజోడించి। వినుమురా
జేంద్రనావిన్నపంబొకటి॥ ముందనేకముయుద్ధములునీవుజేసితివి। నీకుసా
రథినగుచునేనుజూచితిని ॥ ఇంతబెడిదంబైనయుద్ధంబుగనలేదు । పరవ
శంబై నీవుధరవ్రాలలేదు॥ సురలుమెచ్చంగరఘువరునిభార్యాసీత। ఘన
విశిఖములచేదునుమాడివైచె॥ శల్యములుదుల్లగనుసాహసంబెడదూలి।
పరవశంబైరథముపైవ్రాలినావు ॥ అట్టియాపదవేళ నచటరథముంచం
గ। ధర్మమాయంబైనదనుజనాయకుడ ॥ బవరంబులోజాలభయముజెం
దినవేళ। కత్తిమరచినవేళకనుమూయువేళ ॥ వెరచివైరికితనవెన్నుజూ
పినవేళ। తగనిసంగతివచ్చునగుబాటువేళ ॥ కావుమనిరిపునెదుటగడ్డిగర
చినవేళ। పరవశంబునమూర్ఛబడియున్నవేళ॥ సారథులగువారుదూరం
బునకురథము। తొలగికొనిపోవుటలుబలుధర్మచయము ॥ బాణపీడితుడ
వై మేనుమరచినవేళ। దురములోరథమునేతొలగదెచ్చితిని ॥ రథము
తొలగించుమనిరాతునవరనీవు। నాకుజెప్పగలేదునీకేమిహాని॥ ఇవుడుసం
గరమునకునేగవచ్చునుమరలి। పరమాయువునుబొందిపగగెలువవచ్చు॥
అనుచుసూతుండిట్లుతనతోడబలికితే। సంతోషమునుబొందిశతకంఠుడ
పుడు॥ తనకంఠమందున్నకనకమణిహారంబు। తీసిసూతునిమెడనువేసిమో

దమున॥ మరికొన్ని వస్తువులుమక్కువతోనిచ్చి। తనసూతుతోబలికెదను
జినాయకుడు॥ నీవుచెప్పినమాటనిజమాయిసూతుడా। యింతజెడిదవు
యుద్ధమెన్నడెరుగనుగ॥ ప్రాణములతోనేనుబ్రతికివచ్చేదేమి। కనుపించ
దాయెనాకాంతముందరను॥ జానకీదేవితోచలరేగియుద్ధంబు। సలుపశ
క్యముగాదుచాలునీవేళ॥ ఈవేళమనపురముకేతెంచియుదయమున। వ
చ్చిగూల్పగవచ్చువైరిసంఘముల॥ త్వరమీదపోనిమ్ము పరువడినిమనర
థము। అనినసూతుడుమరల్చెనుదివ్యరథము॥ అదుగోరాఘవుడే౽డ్డం
బుగావచ్చె। ననిపలికిచూచుచునన్ని దిక్కులను॥

శతముఖుడు తిరుగపురమునకు బోవుట.



ఇదుగోచంపగవచ్చెనేమిజేతునటంచు। కంపమునదానవుడుకలు
వరించెనుగ॥ ముదితసీతాదేవిముందరదుగొవచ్చె। శరమువేసెనటంచు
మరిజాలిబొందె॥ ముదితఅదుగోకాలమృత్యువై ఆగ్నేయ। బాణమువ్వేసె
ననిబలుమొఱ్రలిడును॥ ఏదిదిక్కికనంచునేదిసాధనమంచు। పలువిధంబు

లచేతపలువరించుచును॥ జ్యోతిస్వరూపంబుజూపించెజానకి। తనకుగనవ
డెనంచుతహతహలుబొందు॥ వెనుకమూరుగసీతఘనశరములేసెనని। క
లవరింపుచుచాలకటకటాయనుచు॥ మరణంబుసిద్ధమనిమదినిశ్చయించు
కొని। చేరెతననగరంబుక్రూరరాక్షసుడు॥ తనపురంబునకేగిదనుజులజూ
చుటకు। సిగ్గునొందుచుమదినిచిన్నబోవుచును॥ అంతఃపురముకేగిఅతివి
లపించుచును। సెజ్జపైతానపుడుశయనమొందెనుగా॥ మతివిహీనతనొం
దిశతకంఠుడొక్కడే। రథమెక్కివచ్చెననిరాక్షసస్త్రీలు॥ గనివేగమున
వచ్చికన్నీరునించుచును। సారధిజూడగాంచిసఖియలిట్లనిరి॥ శతకంఠుడొ
క్కడేచనుదెంచెపురమునకు। పదిమందిమంత్రికోవిదులేరివెంట॥ ఏలరా
క్షసవర్గమేలరారైతిరని। అడుగవారలతోడననియెసూతుండు॥ ఏమిచె
ప్పుదుమువోభామినీమణులార। తల్లడంబుననోటతడిలేదుదెలుప॥ జానకీ
నాయకుడుజగదేకవీరుండు। సకలరాక్షసబలమునరిపుచ్చినాడు॥ మనపు
రంబునగలుగుదనుజావళులనెల్ల। నేకశరమునగూలనేసెరాఘవుడు॥ క
డుమంత్రిపుంగవులుఘనమైనసరదార్లు। మానవేంద్రునిచేతమడిసిపోయి
రిగ॥ ముప్పదక్షౌహిణులుమూలబలములుగూలె। చతురంగబలములు
సమసెసర్వంబు॥ కడుద్రోణశైలంబుకాపులుండినయట్టి। కోటిదనుజావ
ళులుగూలినారచట॥ అఖిలరాక్షసవర్గమణగెరణభూమిలో। వారిలో
నొకరైనవచ్చేదిలేదు॥ వత్తురనుచునువట్టివార్తలెటుజెప్పుదును। దను
జావళులయాశమనకికనులేదు॥ అనుచుసారథితమకునఖిలంబుదెలుపం
గ। వనితలందరుఘోలుమనియేడ్చిరపుడు॥

రాక్షసస్త్రీలు భర్తలచావులకు దుఃఖించుట.

పతులదలచుచు కొందరతిదుఃఖముఖులైరి। హితులదలచుచు
కొందరేడ్చుచుండిరిగ॥ తగుబంధువులదలచివగచిరికొందరును। కొడు
కవారలదలచికొందరేడ్చిరిగ॥ పురమునలుదిక్కులనుతెరిపిలేకుండంగ।

శోకంబుబెనగొనిరిసుదతులందరును ॥ ఏవీధిజూచినాయేదిక్కుజూచినా। అల్లకల్లోలమైతల్లడించిరిగ॥ కొమ్మలందరుసేయుఘోరశోకరవంబు। ప్రళయకాలమునాటిపగిదిదోచెనుగ॥ అందుకొందరునతులుఅమరమూకలుగట్టి। తలపోసిరొకకొంతతల్లడంబుగను॥ ఏమియీశతకంఠుడింతతెలిసినవాడు। మూఢచిత్తుడుశుద్ధమూర్ఖమానసుడు॥ తనవారలైనరావణకుంభకర్ణాది। దనుజహరణముసలిపిదశరథసుతుండు॥ అట్టిమహానీయుతోనసమానవైరంబు। నేలగైకొనియెతానెరిగిసర్వంబు॥ ఆదినారాయణుండారాఘవుండనుచు। మగువసీతాదేవిమహాలక్ష్మియనుచు॥ తల్లిపలువిధములనుతినతోడజెప్పంగ। చెనటిదానవుజేమిచెవిబట్టడాయె॥ దశరథధాముతోతగనివైరమునిలిపి। నిఖిలబలములజంపెనిష్కారణముగ ॥ బలువైభవముమీరిభాసిల్లునగరంబు। బలులనందరిజంపిపాడుజేసెనుగ ॥ బలుగర్వమునుబొందిప్రల్లదంబులుబల్కి। పాతకుడువీడైనప్రతికేదిలేదు॥ కళలదీపించునెక్కడజూడపురమెల్ల। నటువంటిపురమెల్లసద్ధిగల్పెనుగ॥ పురవాసులకునింకతెరవేదిబ్రతుకేది। గతియేదిక్కెతియేదిమతిదలంపగను॥ తలచుకొంటేగుండెనిలువదెవ్వారలకు। భరియింతుమెట్లుయీపురములోపలను॥ దుర్మార్గచిత్తుండుదుశ్శీలవంతుండు। పరమచండాలుండుపాతకుడువీడు॥ వైకుంఠవాసుతోవాదంబుదలపెట్టి। సకలబలములనిపుడుచల్లార్చినాడు॥ తగదంచుపలుమారుతల్లివలదనిచెప్ప। వినడాయెమాటగైకొనడాయెవీడు॥ చెడుబుద్ధిచేనగ్నివడిగట్టుకుంటేను। కాలిపోడాయెంతఘనుడైనగాని॥ అగ్నివడిగట్టినట్లారాఘవునితోడ। పగబూనినాడుయీపాపకర్ముండు॥ పాతకుండీవేళపారిరాకుంటేను। సీతామహాదేవిచేతగూలునుగ॥ రేపైనతప్పదీపాపాత్ముమరణంబు। ఐసగనిప్పటికైనబుద్ధిలేదేమి॥ ఇటుమీదబుద్ధివస్తేమిరాకుంటేమి। మనభర్తలందరనుమంటగలిసిరిగ॥ ఎట్లుభరించెదముయేలాగుబ్రతుకుదుము। యేదారియేతెరవుయేదిదిక్కికను॥ పతిలేనికాంతలకుబ్రతుకేలసుఖమేల। చెలగుభాగ్యములేలజీవనములేల॥ కలిమేలబలిమేలఘనవిలాసములేల। పుడమిసౌఖ్యములేలకడుసంపదేల॥ పెళ్లిళ్లువ్రతములకుపేరంటములయందు। విధవాంగనామణులనే

మిజూడరుగ॥ కడు ఘోరదుఃఖాబ్ధిబడిమునుంగినకంటె। నగ్నిలోబడబాయునన్నికర్మములు॥ పతిలేనికాంతలకు గతిలేదుగాయనుచు। పెద్దలందరుగూడిపెళ్ళిసేయుదురు॥ పతినియెడబాసితేసతికిదోషంబనిరి। సతినియెడబాసితేసతిదోషమనిరి॥ వెలయంగకళ్యాణవేదిపైనిద్దరికి। బ్రహ్మముడివేసెదరుబాయరాదనుచు॥ సేసప్రాలొకరొకరిచేతులోబోయించి। బాసజేయించెదరుబాయరాదనుచు॥ పతిసతులనిద్దరికిబాసజేయించెదరు। తగనొక్కరినియొకరుతప్పరాదనుచు॥ అదిబాసయని తెలియకరయపతులనుబాసి। బ్రతుకుభ్రమనొందెదరుపాపిష్ఠిప్రజలు॥పతిబాసిదుఃఖమునబ్రతికియుండినకంటె। సహగమనమేమేలుసతులకందరికి॥ ఎగ్గులుబొందుచునుయిలనుబ్రతికినకంటె। నగ్నిలోబడబాయునన్నికర్మములు॥ అగ్నిలోబడకుండనవనిలోబ్రతికెంటె। తుదనుయమగుండములుదార్లించుయముఁడు॥ ఆనిగోలుగోలునను అతివలందరుచాల।విలపించుచుండగావినిచిత్రగంధి॥

చిత్రగంధి కొడుకుకు బుద్ధిచెప్పట.



విభ్రాంతురాలగుచు వెలదులందరిజూచి। శోకమునుకొనగొనుచును దతీలలామ॥ కటకటాహాయింతగతివచ్చెనాయనుచు। వరదలై కన్నీరు

దారుగనేడ్చుచును॥ సెజ్జపై బొరలుయాశతకంఠుబాడగాంచి। తనచేతు
లినువానితనువెల్లనిమిరి॥ నెత్తురంతటమేనునిండిపంకంబుగా। తనచేతు
లంటంగతరుణిదుఃఖించె॥ దేహమంతటచాలతెరిపిలేకుండంగ। అమ్మువి
రిగినగాంచిఆత్మజునిజూచి॥ తనగుండెమోదుకొనితరుణీలలామంబు। తన
యునిమొగముపై తాజేర్చిపలికె॥ కొడుకనేపలుమారుకూడదనివైరం
బు। మానుమనిచెప్పినామానవైతివిగ॥ ఆయమ్మసీతమ్మఅదియెక్కడలు
గునో। అచ్చోటనిర్మాలమానుసర్వంబు॥ సఖియసీతమ్మయెచ్చటకరుణ
జూచునో। అచ్చోటనేనిత్యకళ్యాణవృద్ధి॥ ఆయమ్మమాయకుహరిహరబ్ర
హ్మలును। వెలయప్రకాశింపవెరచియుండుదురు॥ భూనభశ్శైలములు
భూరివారాసులును। సరవిగాజంగమస్థావరంబులును॥ జంతుజాలంబులు
నుసర్వపిపీలిక। సంగమంబులుగలుగుజగములన్నియును॥ పద్మజాండంబు
లనుపరగబుట్టించును। కినుకసన్నిటిబట్టిగిట్టజేయుచును॥ ఆమహాశక్తితా
నమరియుండునుఆది। మధ్యాంతరహితమైయుమహిమమీరుచును॥ సీతగా
దదిమహాచిద్రూపమదిగాని। సామాన్యతయుగాదుసాధ్వియాయమ్మ॥ నా
తిచేతనుభవన్నాశంబుసిద్ధించు। వసితతోడుతనీకువైరంబువలదు॥ పుత్ర
మిత్రకళత్రభూరిసముదాయముల। బ్రతుకజూచుటకునీభావమందుంటె॥
రఘువరునిశరణొందిరక్షించుమనియతని। పాదారవిందములబడినరక్షిం
చు॥ తల్లిదండ్రివిధాతదైవంబునీవెయని। ఆరామశరణొందుమతడుర
క్షించు॥ అక్షయంబుగనిన్నురక్షించునాతండు। వివరముగనామాటవిను
మునాతండ్రి॥ పసిబాలకుడుకుఱ్ఱపడుచునీకొమరుండు। నిజమార్గశీలుం
డునీలకేతుండు॥ కపటమెరుగనివాడుకడుబుద్ధివంతుండు। పాపమెరుగని
వాడుబాలకుడువాడు॥ చదువుకుంటున్నాడుసకలశాస్త్రములెల్ల। పర
మభక్తుండతడుప్రహ్లాదురీతి॥ సమరంబేలాటిదోసాము వేలాటివో। యెన్న
డాచందంబుమెరిగుండలేదు॥ నిజముదప్పనివాడునీముద్దుపసిబాల। పాప

మెరుగడువాడుపరమసాధుండు॥ పసిబాలకునినైనబ్రతికించివంశంబు। న
భివృద్ధినొందించుమహాత్ముఁజానీవు॥ పరమసాధువునీదుభార్యసద్గుణశాలి। ఘ
నవ్రతంబులుచేసిగనెనుక్కసుతుని ॥ దానిసరికాంతలీధరణిలోపలలేరు।
దోషమెరుగదుయామెదొడ్డయిల్లాలు॥ అందరినివిడఁద్రొక్కిఆశలన్నియు
విరచి। బలుయుద్ధభూమిలోఁబడదలంచితివి॥ ఎంతచెప్పినగానిమంతనంబు
ననీవు। వినవువామాటగైకొనవేమికొమర॥ అనితల్లివిలపింపకినుకతోఁశ
తముఖుడు। తల్లితోడుతబలికధైర్యంబువెలయ॥ ఓతల్లినీవిట్లుఖేదార్చ
బనిలేదు। వినుముజెప్పెదముయీవివరమంతయును॥ నేనుకోపంబాదువ
భానుఁడైననుగాని। పూనియండయుగాయబాదలివెరచునుగ॥ వలసినప్పు
డెగాన్నిఫలసియెచ్చటనైన। చెలరేగియనలంబువెలుగవెరచునుగ॥ అఖి
లజీవులనణచుయముడునాముందటను। కొలువుగాఁడైయుండుచలమెల్ల
విడచి॥ మృత్యువకుమృత్యువై మెలగుచుందునునేను। ఇలలోనునాకం
టెబలశాలులెవరు॥ చెలగునాప్రఖ్యాతిశివుఁయందునులేదు। నాతిగెలు
వంగలడెనన్నురణమందు॥ రేపుశత్రులబట్టియేపెల్లదూలించి। వత్తునిం
టికినేనువైభవంబునను॥ కాకుంటెసీతచేగడతేరిపోయెదను। గానిశరణ
నుమాటనానోటరాదు॥ మునులనందరిబాధనొనరించఫిర్యాదు। గావిం
చితెప్పిస్త్రీఘ్నునిరాఘవుని॥ రప్పించియతనితోరణముసేయగలేక। శర
ణంటెనవ్వరాజగతిజనులెల్ల॥ నగుబాటుపనిజేసిజగతిబ్రతికినకంటె। మ
రణమొందుటనాకుమంచిదనితోఁచె॥ కలనైనశరణన్నపలుకునోటనురా
దు। హీనవృత్తికిమనంబెన్నడునుజొరదు॥ సకలజనములనెల్లసమరంబు
పాల్జేసి। బ్రతుకుపైనేనాశపడుటలేమిఘనము॥ చిరకాలమెవ్వరునుధర
ణిలోనుండెదిరు। ధైర్యంబువిడనాడతగదెంతయైన॥ ధైర్యమునపోరాడి
తరుణిబరిమార్చెదను। బరిమార్పలేకున్నధరణిగూలెదను॥ కానిరెండో
మాటకలనైననానోట। రాదుహీనతకొప్పబోదునామనసు॥ పొంకమైన

ప్రతాపలంకానివాసులకు। బలులనందరిజంపిబ్రతుకెట్లుదలతు॥ నాయొ
క్కమార్గంబునటనసర్వము దెలసి। తల్లినీవిటులాడధర్మమానీకు॥ చాల
పసిబాలకుడునీలకేతునిడాసి। పోషించుకోనీవుపుత్రకునిరీతి॥ అనగవిన
మునబుద్ధిగానకుండగుణవతీ। పరమసాధువుబోధపగచుమాయమ్మ॥మా
రుజెప్పగబోకుమాతల్లి నీమాట। డాఖలాగనుపించులక్ష్యకుండగను॥ బ్ర
హ్మవరములునేలపాలైనకాలమున।బ్రతుకుపై నేనాశబడుటేమిసుఖము॥
అనితల్లిపీడ్కోల్పి అసురనాయకుడంత। నెలతతోనారాత్రినిద్రబోంగదేవు
గ॥ రణములోరఘువరుడువనితసీతాదేవి। సమరంబుగనిమహాసంతోష
మొదవె॥ ఆశ్చర్యమానసుండై రామభూవరుడు। హనుమంతుగాంచియి
ట్లనిమోదమున॥ కంటివాహనుమదాకలకంఠిశుకవాణి। సీతామహాదేవి
సేయుయుద్ధంబు॥ పుష్పంబులరచేతపూననేరనికొమ్మ। ఘోరశరములు
బూననేరీతినేర్చె॥ చిలుకపలుకులకుబిట్టలుకుకాంతామణి। యిలకెల్లభీ
తిల్లనేరీతినార్చె॥ ననుదప్పపరులనెన్నడుచూడనేరదీ। యింతిపగతుల
నడుమనెటునిల్వనేర్చె॥ బిసబిసనునడువంగనసియాడుకలకంఠి। యిట్లు
యుద్ధముజేయనెట్లునేర్చెనుగ॥ పటికంపుసోపానపఙ్క్తినిల్వగలేని।పూ
బోణినీయొక్కభుజమునెటునిల్చె॥ అనుచుశ్రీరాఘవుండదృతహర్షము
న। వెలయజానకిపైనివేడ్కమీరుచును॥ పలుమారుసీతచెక్కిలిబట్టిము
ద్దాడి। వెలదిసమరంబునవిశ్రాంతిగొనుచు॥ హనుమంతుభుజములంద
తివసీతయుదాను। నిలిచియుండిరిమహాబలిమితేజమున॥ హనుమంతుపై
నిలచిఆరాఘవేశ్వరుడు। కపిబలమంతయునుకనులజూచెనుగ॥ పోకపో
లుగానుమూకమూకలుగాను। కుప్పలైబడియుండ్రిఘోరబలులెల్ల॥పది
క్కుజూచినామెడతెరిపిలేకుండ। బడిరికపిబలమెల్లబహువిధంబులను॥
తమమూలబలమంతతగరాజ్యబలమంత। కుప్పకుప్పలుగానుకూలియుం
డిరిగ॥ కడువిభీషణుబలముబెడుగొండలవిధాన। కూలియుండిరినేలకో

రాముడు మృతసేనలజూచి దుఃఖించుట.







టానకోట్లు॥ జాలిగొనిరఘువరుడుసకలబలములనపుడు। కన్నులనుబాడ
గాంచికటకటాయనుచు॥ ననునమ్మివీరెల్లజనుదెంచిదైత్యుచే। మడిసిపో
యిరిగదామాటలోననుచు॥ చప్పన్నదేశములజననాయకులజూచి। కను
లశ్రులుదొరుగకటకటాయనుచు॥ తనమ్రోలబడియున్నతమ్ములనుబా
డగాంచి॥ మదిశోకమునగుందిమానవేశ్వరుడు॥ లవకుశులజయవిజయు
లనుగాంచిదుఃఖంబు। పట్టజాలగలేకపద్మలోచనుడు॥ పలుమారుశోకిం

పప్రాణనాయకుజూచి। కలకంఠిజానకీకాంతయిట్లనియె॥ సకలలోకేశ్వరా
జలజాతలోచన। కాకుత్థ్సకులదీపకౌసల్యాతనయ॥ ఆర్తసంరక్షకాఆదినా
రాయణా। పంకజాక్షాపరబ్రహ్మస్వరూప ॥ సర్వజ్ఞులగుమీరుసకలధర్మ
ములెరిగి। తగునవగవగమీకుదశరథరామ॥సంసారములుమాయజాయ
పిల్లలుమాయ। నిజముగాభావిస్తెనిఖిలంబుమాయ॥ తనయులెక్కడివా
రుతమ్ములెక్కడివారు। ఇదిమాయజాలంబుమెఱుగరామీరు॥ మాయజా
లంబునకుమదినిట్లువగవంగ। మీకుతగునాసర్వలోకనాయకుడ ॥ నిత్య
మేమియుగాదునీమాయసర్వంబు। నీమాయలోమహిమనీవెయెఱుగుదు
వు ॥ నరునివలెతమరిట్లువెరగొందధర్మమా। గనుగొనుడిసర్వంబుజ్ఞాన
మూలమున॥ జ్ఞానమూలంబుగాగనుగొంటిరామీరు। అఖిలంబుమిధ్య
గానగుపడునుస్వామి ॥ మిధ్యపదవులకింతమీకువగవగనేల। పరమాత్మ
లోకేశపంకజాక్షాక్షు॥ అనిప్రాణనాయకునితనుచాలనూరార్చి। కడుసమ
స్తముదెలిపెజ్ఞానమూలమున॥ మానవేంద్రుడురాముజ్ఞానమునబరికించి।
నెలతదెలిపినరీతినిశ్చయంబనుచు ॥ భండనములోగూలిపడియున్నవారి
లో। బలులురెవ్వారైనబ్రతికెందురనుచు॥ బవరభూములువెదుకపని
బూనిరఘువరుడు। వెదుకజొచ్చెనుసకలయోధవీరులను॥ తనవధూమణి
యునుతానుహనుమంతుండు। నన్నిదిక్కులకరగియరసిశోధించి ॥ వెద
కుచురాగవిభీషణుండచ్చోట। కులగిరీంద్రమురీతిగూలియుండెనుగా॥కని
రాఘువేశ్వగుడుకనికరమురంజిల్ల। నతనిదగ్గిరనిలచిఆరసిశోధించి ॥ ఉర
ముగాడినశక్తిశరముసయ్యనదీసి। విరిచిపారగవేసెనరవరోత్తముడు॥బం
ధనములూడుటకుబలుమంత్రమొనరించి। ఘనముమీరంగనాతనిమూ
ర్ఛదెలిపె॥ తెలిసివిభీషణుడుధీరాత్ముడై నిలచి। వందనంబులుజేసెవారిక
వ్వేళ॥ హనుమద్విభీషణులుఆరాఘువేశ్వరులు। బవరభూములువెదుకప
నిబూనియపుడు॥ విలవిల్లుదీపములువెలిగించికపివరుల। జూచుచుబలుగ

తులశోధించిరప్పుడు ॥ చనుదెంచుచుండంగఘనుడుభల్లూకపతి । బహు
కాలములవేత్తబడియుండెనచట॥

## రాముడు జాంబవంతుని లేవనెత్తుట.

ఆంజనేయునిమాటయాలించిజాంబవుడు । హనుమంతుడనితలచి
తనమనంబునను ॥ అతిపీలస్వరముచేహనుమంతునింబిలచె । వినివాయు
నందనుడుజనిమొదగ్గిరకు॥ అతనికన్నులజూచిఅతిగౌరవముజేసి। బలుభ
క్తిమీరంగబలికెజాంబవుడు ॥ హనుమదాహ్వయుడరామావనీనాథుం
డు। వదిలమాయాతనిభార్యసేమంబ ॥ అతనితమ్ములుపుత్రులందరుసేమ
మా। మగుణపుత్రుడువిభీషణుడుసేమంబా॥ భానుసుతుడందరుబ్రతికియు
న్నారుగా। విన్నుగనిబ్రతికితిని నేనుపవనజుడా॥ కనులశరములునూర్లుగా
డియున్నవికనులు । దెరవశక్యముగాదుతెరిపేమిలేదు ॥ చెవులలోబాణ
ములుజెందియున్నవివేలు। వివశత్వమునుబొందివినరావుచెవులు ॥ తెరిపి
లేకుండంగశరములంతటగాడి । విరిగియున్నవిమేనవేలకోలదిగను ॥ దే
హంబుమరణసందేహంబుననుబొంది।పరవశత్వమునొందిపడితినిచోచ్చట॥
లోలతనుమాట్లాడనాలుకరాదుగా । తడిలేదునోటిలోబడదులేచినను।
అరయసర్వాంగములవిరిగిబాణములుండె । అవిదీసిరక్షించుహనుమంత
నన్ను॥ నీకటాక్షంబుచేనేనుజీవించెదను । పుణ్యముబ్బునునీకుపుడమిలో
వలను॥ అనిపలుకుచుండంగనంతలోశ్రీరాము । కరుణరంజిల్లంగగనివేగ
వచ్చె॥ వచ్చియాతనిజూచివరకరుణరంజిల్ల । నతనితోడుతనిట్టులనియెశ్రీ
రాము॥ భయపడకుజాంబవాబహుకాలములవేత్త। వచ్చితిని నేనురఘు
ముడనీకడకు॥ అనిమేనవిరిగియున్నస్నిశరములుదీసి। విరిచిపారగవేసెన
రనాయకుండు॥ హస్తస్పర్శచేతనతనిదేహంబంత। నలరింపజాంబవుండె
లమిజెన్నొందె ॥ ఎలమిజెన్నొందుచునుయినకులాధిపుపాద । పద్మముల
బ్రణమిల్లెబలుడుజాంబవుడు॥ ప్రణమిల్లియున్నట్టిభల్లూకనాయకుని। కర

ములచేనె త్తేశములలోచనుడు॥ ఆదరంబున జేర్చిఅతడు తానునువిభీ। ష
ణుడుహనుమంతుండుతనవధూమణియు॥ మఱియుపరికింపుచునుమార్గము
నజనుదేర। కదువింతరణభూమిగానబడుచుండె ॥ పర్వతంబులలాగుబడి
నేలగూలిన। గజకోట్లుమేఘములకరణినుండెనుగ ॥ మోకాలుబంటుగా
నేకమైయుండందు। గనుపట్టుమెదడుపంకంబుగానుండె ॥ మహినిండబడి
యున్నమాంసఖండములెల్ల । నింద్రచాపములుగా నెనయుచుండెనుగ॥
కడుహాహాకృతులు మేఘగర్జితముగానుండె । శరపరంపర ఘోరవర్షమై
యుండె॥ వర్షకాలమురీతివారినేత్రంబులకు। గనిపించెనప్పుడాకడుయుద్ధ
భూమి॥ శతకంఠుడారాత్రిసతితానునిద్రించి। యుదయమునమేల్కాంచి
యుద్ధండుడగుచు॥ దసరబత్రీసాయుధాధారుడై మహా। విలయకాలాంత
కునివిధముమీరుచును॥ బలురథముపై నెక్కిభైరవునిచందమున। ఘను
డుశతకంఠుండుతనపురమువెడలె॥

శతకంఠుని గొప్పయుద్ధము.

దుశ్శకునములుచాలతోల్లివలెగనపడగ । గణనసేయకమహాగ
ర్వాంధుడగుచు॥ యముఃరీతిగవచ్చెనేమిచెప్పుదువాని। తామసముభు
జబలిమిధైర్యసాహసము॥ పిడుగుపాటునవచ్చెబెడిదంబులుప్పతిల । తన
నూరుమొగములనుపెనుమంటలెగయ ॥ ఘోరమునబొడగాంచిశ్రీరాఘ
వునిదేవి। విల్లునమ్ములుదాల్చివిభునాజ్ఞగొనుచు॥ కల్పాంతకునిరీతిఘనుడు
శతకంఠుండు। రాముదేవునిడాసెభీమశౌర్యమున ॥ డాసిపటుబాణములు
వేసిఘోరాకృతిని। సింహధాటీజేసిచెలగిరాక్షసుడు ॥ ఘనసర్పములరీతి
పెనగొనుచుబాణములు । పెనుమంటలెగయుచునుజాయెఘోరముగ॥
గనిజానకీదేవితనవిల్లుచేనంది। గుణమెక్కుబెట్టిటంకృతులొప్ప జేసె॥గు
ణరవధ్వనులచేగూలెకులశైలములు । కలగెసప్తాంబుధులు తలపోసెబ్ర
హ్మా॥ గరుడకిన్నరయక్షగంధర్వచారణ। సురసిద్ధసాధ్యులంబరమునందు

సను॥ వంతిసీతాదేవిబాణసంధానంబు । బలముదోర్గర్వంబుప్రతిభాష
ణములు ॥ నిలచిమాచుచునుండెనిఖిలదేవతలపుడు । ఆశ్చర్యవ్యాప్తహృదయు
లై యధిమందుండ్రి॥ ఘోరశరములబరపశ్రీరాఘవులదేవి । దునుమా
డవేగమునఘనశరంబూని॥ వానిచాపములన్ని వసుధపై బడగూల్చి। చీ
కాకుబడజేసెభీకరంబుగను॥ చాపముల్ దూలుటకుకోపించిశతముఖుడు।
కలకంఠిసీతపైకనులెఱ్ఱజేసె॥ కనులెఱ్ఱగాజేసికంఠీరవమురీతి। మరికొన్ని
విల్లందిమహిమమీరుచును॥ మరికొన్నివిల్లందితరుణిజానకిపైని । బరపె
పటుబాణములు తెరిపిలేకుండ॥ అవియెల్లఖండించిఆరాఘవులదేవి। ఘో
రవిశిఖావళుల్ నూరుద్రాడిగేసె ॥ రక్కసునిమకుటములురాలినేలనుగూ
లె। దనుజబాణములన్నితునియలై పడియె ॥ దనుజతేజోరూపమునుగూ
లిపోవంగ । సర్వబాణములేసెజానకీరమణి ॥ వెలయమంటలుగ్రమ్మవిష
ములుగ్రక్కుచును। శరముద్ధతినిశాచరునిబాదవెనుగ ॥ దనుజతేజో
రూపమునువేగసరిపుచ్చి । ముదితసీతాదేవిపాదిజేరెశరము ॥ చాపము
ల్మకుటముల్సర్వతేజముదూలి। బలుడుశతకంఠుండుబలుకోపమొదవి॥ క
నులెఱ్ఱగాజేసిగదచేతబట్టుకొని। వీరహుంకృతిబూనివిసరెరాక్షసుడు॥ ది
వ్యబాణంబేసిసవ్యముగమహాలక్ష్మి। గదదగ్ధమొనరించెఘడియలోపల
ను ॥ గదదగ్ధమొనరింపకాలాంతకునిరీతి । హుంకారుడై యపుడుఅసురవ
ల్లభుడు ॥ సురలుబెగడొందంగశూలంబుచేబట్టి । దనరకంఠీరవధ్వనుల
మీరుచును॥ వెలయగిరగిరద్రిప్పివిసరెబలుశూలంబు । పెనుమంటలెగ
యుచునుజిమ్మెశూలంబు ॥ శూలముద్ధతినేగినుదతిజానకిబాదవె । రక్త
ధారలువెలసెరమణిమేనెల్ల॥ రక్తధారలువెడలిరమణీలలామంబు । సొ
మ్మసిలియంతలోశ్రమ్మరనుదెలసి ॥ చేబాసురాయోరి శతముఖానాతోడ।
నెదిరించిపోరినావెంతధీరుడవు ॥ ఖలుడనినుబరిమార్తుకాచుకోరాయం
చు। విలయకాలానలమువిధముమీరుచును॥ దనుజనాథునిగూల్పతడవు

సేయగరాదు। అమృతంబువిమహాయువలసన్యమైన॥ అనివిష్ణుబాణంబుత
నకేలసంధించి। పూనియుగ్రతజేసెదానవునిపైని॥ పుడమిగంపింపంగ పె
నుమంటలెగయుచును। పావకుండేతెంచుభంగిశరమేగె॥ బరువడినిశరమే
గిసురవైరికంఠములు। హస్తములుదునుమాడెనతివిచిత్రముగ॥ నూరుశి
రములునుయిన్నూరుకరములుద్రుంచి। తూణీరమునుజేరెబాణమవ్వేళ॥
తలలువ్రాలినవెనుకతాటిబొందవిధాన। నింగిపాడవునదైత్యుడిలచియుం
డెనుగ॥ పరమేష్ఠియిచ్చినవరమహాత్వంబునను। దానవుడుబడడాయెతత్ క్ష
ణంబునను ॥ మరియునెప్పటిరీతికరములునుశిరములును । నద్భుతంబుగ
మొలచెనసురనాథునకు॥ కనిజానకీదేవికడువిచిత్రమునొందె। యిదియేమి
వింతరాయనుచుకోపమున॥ అర్ధచంద్రాస్త్రంబులవివింటసంధించి। ఖం
డించెదానవునికరశిరంబులును ॥ మరియునెప్పటిరీతికరశిరంబులుమొల
చె। నారాఘవులదేవిఅద్భుతంబాదవె॥ ఇదియేమివింతనుచుమదినెంచిజా
నకీ। మరియుక్రమ్మరనొక్కశరమునొడిగేసె॥ శిరకరంబులుదునిసిశిథిలమై
మొండెమున। కరశిరంబులుమొలచెసురవైరికపుడు॥ మరియుదనుజాధిపు
నికరశిరంబులుదునుమ। వెలయకరశిరములునువెంటనేమొలచె ॥ కనక
కుండలములునుఘనకిరీటములతో। తలలన్నిమొలచెనుదనుజవీరునకు॥ క
రవాలముసలముద్గరప్రాసతోమరా। ద్యాయుధంబులతోడహస్తములు
మొలచె॥ సీతామహాదేవిచిత్రమొందుచుచాల। బాణపరంపరల్బరపిపర
వుచును॥ కరశిరంబులుబట్టిఖండించివ్రేయంగ। మరియునెప్పటిరీతికరశిర
ములమరు॥ కరశిరంబులుతొల్లికంటెసుందరముగా । జనియించెజానకీస
తిచిత్రమొంద ॥ విభ్రాంతురాలగుచువెలదిసీతాదేవి। దనుజురూపము
గాంచితలపోసెనిట్లు॥ తాకవోబాణములుదాకినన్నుత్రుళ్లవో । కాకయి
దియేమనుచుకాంతవెరగందు ॥ వెరగందియిదియేమివింతంచుబాణము
లు। తెరిపిలేకుండంగశిక్షికొల్పెనపుడు॥ ఎపుడువిల్లందుకొనునెపుడుశరము

లుద్దామముగ। నెప్పుడు వేయునొ బాణమెప్పుడెక్కుఁబెట్టు॥ ఎప్పుడు శిరములు దూ
లునెప్పుడు క్రమ్మర మొలుచు। నేర్పాటు దెలియదని యెల్ల దేవతలు ॥ వినువీ
ధినాశ్చర్యమును బొందిచూడంగ। వారికై నేర్పరచతరము గాదాయె॥ కొ
నలు రెండును గలిసి దనువుగ నబడుచుండె। చంద్రపరివేషమో చక్రమో య
నగ॥ తెగుతలలభ్రమునకెగయునట్టి తలలు। బడుతలలెల్ల భూభారంబుగ
ప్పె॥ కొన్ని గగనముకెగసె కొన్ని యంబుధిబడియె। కొన్ని కుప్పలరీతి కొం
డలై యుండె॥ చప్పున నెత్తురు చొప్పుగనరాకుండ। తలలు మొలచె నువిచి
త్రముగ దైత్యునకు॥ తలవంచి జానకీ తలయెత్తునంతట। మొలచున ద్భుత
ముగా తలలు చేతులును॥ రెప్పవిడినంతలో తప్పకుండగ దునుము। నంతలో
నే మొలచు నతివిచిత్రముగ ॥ కరశిరంబులు వ్రాలి ధరణీతలంబెల్ల। నిండి
యుండెను కోట్లు కొండలవిధాన॥ శతకంఠు తలలెల్ల చాల కుప్పలరీతి। పోక
లై పడియుండె భువియెల్ల నిండి॥ తలలు చేతులు వ్రాలి కలగిరులచందమున।
కడువిచిత్రంబుగా గానబడుచుండె ॥ తారాపథంబునకు తోరణము చంద
మున। మింటికెగసిన తలలు కంటగనబడును॥ మరియు రఘువరుడు దేవిశిరము
లుద్ధతిబూని। కరశిరంబులు గూల్చెగడియమాత్రమున ॥ అవియు నెప్పటి
రీతి నద్భుతంబుగ మొలచె। క్షణమాత్రమున నురాక్షసనాయకునకు॥ తప్ప
కుండగ సీత తామరలదునుమంగ। వింతరంజిల్లగా వెంటనే మొలచె ॥ మరి
మరియు శిరములును కరములను ఖండించె। విసికి వేసరిబొందె వెలది మహాల
క్ష్మి ॥ విసికి వేసరి మరియు వెలది సీతాలక్ష్మి। తనమదిని విభ్రాంతి కొనియి
ట్టులనియె॥ కొండలప్రోడవుగా కోటానకోటుల। కరశిరంబులు బట్టి ఘనత
గూల్చితిని॥ ఈమహామండలంబెల్ల నిండి చెలంగె। లేదు తెరిపి చోట్ల లేశ
మాత్రంబు॥ సకలభూములు నిండె సాగరంబులు నిండె। లేదు తెరిపి చోట
లేశమాత్రంబు॥ ఎంత గూల్చిన దనుజాడిలపైని వ్రాలడు। దనుజు కరశిరము
లికదునుము ఫలమేమి॥ తలలు కోట్లుగద్రుంచితిని చాల వేసరితి। కరముల
ట్లుగద్రుంచి మరి వేసరితిని ॥ బాణములు సరిపాయె దానవుడు డెగడాయె।

బ్రహ్మయిచ్చినవరములబలముయెంతటిదో॥దానవునిబరిమార్పతరముగా
దికనాకు। నగుబాటుపనివచ్చెజగతిలోపలను॥ తగుజనునివరిచేతధనువు
తూపులుబట్టి। చెలరేగియుద్ధంబుచేయబూనితిని॥ ఆడవారలబుద్ధులల్పం
బులనుమాట। దాఖలాచేసితిధరణికింతటికి॥ అనిఖిన్నురాలగుచుతన
కేమిదోచకను। చిత్తంబువికలమైశ్రీరామదేవి॥ దానవుండంతటనుతరు
ముకొనిబాణములు। వెలదిజానకిపైనివేసెనుద్ధతిని॥ హనుమంతుతనవాల
మడ్డంబుగాబెట్టి। దురుముజేసెనుదైత్యుశరపరంపరలు॥ మరిమరియుదా
నవుడుతెరిపిలేకుండంగ। శరపరంపరగప్పెధరణిగంపింప॥ తగుచరునివా
లంబుదాకిగుండ్లైపోయె। దనుజుబాణములెల్లతక్షణంబునను॥ సీతామ
హాదేవిపాతకునిరాక్షసుని। బరిమార్పగాతనకుతరముగాదనను॥ తనమది
నిగుందుచునుతనపతినిగనుగొనుచు। ఖిన్నురాలగుచుతానున్నసమయ

### నారదమహాముని రామునియొద్దకు వచ్చుట.



మున॥ హాకృష్ణగోవిందఆదినారాయణా। అనివీణవాయించుకొనుచు
నారదుడు॥ దివినుండివేంచేసిదేవదేవు జూడ। కయ్యాలముగివరుడుఘన

భూషితయుతుఁడై భాగా నతనసుదుట వట్టవర్ధనమును। తులసిపూవనల పేరు
అలరారుచుఁ డతని॥ భాసిల్లుతన మేనవందు వెన్నెలగాయ। జడలుతూగాడఁ
గజను ఘంచనవుడు॥ పోషితయభూరితభువనంబులకుమాంత। ఘనకార్యవి
భూతకడుపుణ్యశీలి॥ కనియునారదమౌనికాంతసీతాపతికి। వందనంబులు
చేసిముందుగానపుడు॥ తనపతికిఁ బ్రమొక్కేటిమునిపుంగవుఁగాంచి। దండ
ములుగావించెతరుణిసీతమ్మ॥ దండములుసమర్పొల్పితాపసవర్యునకు। న
ర్ఘ్యపాద్యాదివిధులనుపూజజేసె॥ మునిపూజకావించి ఘనుడురఘునా
యకుడు॥ అతనితోడుతనిట్లులఁబెమోదమున॥ ఘనమౌనిచంద్రయేక
తముననుమీరారిందు। వచ్చితిరిశలవియ్యవలెనుమీరాక॥ మీరాకగలు
గుటలుమేలుసమకూడుటలు। జన్మపావనమబ్బుసన్మునీశ్వరుడ॥ ఎంతపు
ణ్యంబుమాకీవేళమీపాద। కమలముల్సేవింపగలిగెభాగ్యమున॥ ఏలోక
మునసుండియిటకువేంచేస్తిరో। భవదీయదర్శనముప్రాప్తించెమాకు॥
మాతపంబులుపండెమాకోరికలునిండె। కంటిమీపదదివ్యకంజాతయుగ
ము॥ సేమమాయమునివరులుసేమమానిర్జరులు। సేమమాలోకములుసేమ
మామాని॥ అనిరాఘవుడుబలుకహస్తములుజోడించి। ఇనకులాధిపునితో
ననియెనారదుడు॥ అఖిలలోకాధారఆదినారాయణా। ననుజూచియీరీతి
గొనియాడదగున॥ అవనిభారముమాన్పనవతరించినయట్టి। నారాయణు
డవీవుననుగన్నతండ్రి॥ భూతములనురక్షింపమహినుద్ధరింపంగ। జగతిబరగి
తివీవుజానకీరమణా॥ నీపాదపద్మములునెమ్మితోజూడంగ। ప్రతిదినమువచ్చె
దముపద్మలోచనుడ॥ పదదర్శనముకంటెపనియేమిమాకికను। నీపాదద
ర్శనమునిత్యమంగళము॥ విశ్వనాథుడవీవువిశ్వపాలుడవీవు। విశ్వమయు
డవునీవువిష్ణుమూర్తివిగ॥ మావంటివారలకుపావనంబులుగలుగు। నిత్య
మంగళమబ్బునీదర్శనమున॥ అనుచునారదమౌనితనతోడబలుకంగ। న
తనితోడుత నిట్లులనియెరాఘవుడు॥ పరమయోగీంద్ర నీభవదాజ్ఞతల

నుంచి। శరముఖహారణంబులను [illegible] కదలని। [illegible] స్థిమిచ్చటికి వళులబలములగూల్చె నసురనాయకుడు। [illegible] లనందరిఁ బరిమార్చి। శూరుడై రాక్షసుడు సొంపు మీరుచును। రణ [illegible] నర్చి తిద్ధైర్యమున రాక్షసుఁ తోడ। వానిఁ గూల్పంగ నావశము గాదా యె। విలు బాణములు బూని వెలది సీతాదేవి। దనుజదేహం బెల్లఁ దునియ వేసెను గ॥ వాని కరశిరములను వసుధపై బడఁగూల్చె। కుప్పలై పడియుండె కోటానకోట్లు॥ పర్వతంబుల పోడవు బడియుండె దానవుని। తలలు బాహువులెల్ల ధరణి నిండుచును॥ ఎంతదునిమిన గాని యొప్పటి చందమున। తలలు చేతులు మొలుచు దనుజవీరునకు॥ సీతామహాదేవి చేత రణభూమిలో। దనుజుండు గూలుసాధనముగ నబడదు॥ దానవుడు గూలుటకు తగు సాధనం బేది। తెలుపవలె నాకిపుడు దివ్యమౌనీంద్ర॥ బాణములు వేయంగ మానీ సీతాదేవి। ఖిన్నురాలై యుండె చిన్నబోవుచును॥

నారదుడు రామునకు శతకంఠుని ప్రాణమర్మము జెప్పుట.

అని రాఘవేశ్వరుడు మునితోడ బలుకంగ। నతిరహస్యంబుగా ననియె నారదుడు॥ ఓ రాఘవేశ్వరా యీ రాక్షసేశ్వరుడు। ద్రోణశైలముకేగి తొల్లి కాలమున॥ సంజీవకరణులను శల్యకరణులు దెచ్చి। పీసనాభిని చాలబూనియుండెను గ॥ ఆమహత్వమువలన నసురు కెప్పటివలెను। తలలు చేతులు మొలుచు తరముగా కుండ॥ తలలు దునిమిన మాత్ర దనుజుండు తెగిపడడు। పొందు పాయము గలదు పోరుడీ వేళ॥ అసురు నాభిని గొట్టుడాగ్నేయ బాణములు। వడినూర్లు బరుపవలె ప్రౌఢిమీరగను॥ ఆయౌషధము లెల్ల హతమారిపోవును। దనుజునకు బలహీనత నము సిద్ధించు॥ దశకంఠు రీతి యూ తరువాత నూటతో। మ్మిది మార్లు కరశిరములాదవు దనుజునకు॥ అవియు తొల్లిటి రీతి హతమార్పదైత్యునకు। అటుమీద టనురావు హస్తములు తలలు॥ బ్రహ్మాస్త్రమున వాని బడగూల్పగా వచ్చు। ఘోరరణరంగమున క్రూరరాక్షసు

ని॥ నామాటనిజముగాసమ్ము నారాయణా। యీరహస్యంబెల్ల నీకు దెలిపితి
ని॥ అదిగాక శాపమాసన్నమైయున్నదిక । నీరాక్షసేశ్వరుకునింతలోపల
ను॥ అదియెటన్నవినుండియంతమీ కేర్పరతు। రాజరాజేంద్రశ్రీరఘురా
మచంద్ర॥ ఈమధ్యదినములనుయీదుష్టరాక్షసుడు। అఖిలదిక్కుల గెల్వ
నరిగెనొకనాడు॥ అష్టదిక్కులు గెలిచిఅమరాది దేవతుల। దూరదేశంబు
నకు బారగాదరిమి॥

## నారదుడు శతముఖుని శాపవృత్తాంతము రామునకుయెరిగించుట.

మరలవచ్చుచుకణ్వమౌనినాథునివనము। జొచ్చినలుదిక్కులను శోధించివెదకి ॥ కణ్వమునికూతురినిగనిచక్కదనమునకు । హాశ్చర్యము నుబొంది అంతరంగమున॥ అతివతోవర్తింపనాత్మలోదలచుకొని । అంత కంతకువిభ్రమాయత్తుడగుచు ॥ దనుజుడావిమలాంగి దరిజేరియిట్లనియె। మునినాథునికుమారి మోహనాకారి॥ వనటనుండగనేలఘనవైభవముగ ల్గు। తూగుటుయ్యాలయందునూగరాదటవె॥ కందమూలములతోకష్టప డగానేల। పాలతిభక్ష్యాన్నములుభుజియింపరాదె ॥ సూన్యకంఠముచేత శోభిల్లగానేల। వరరత్నభూషణావళులుంచరాదె॥ నారచీరెలుగట్టినటి యింపగానేల। పట్టుపీతాంబ్రములుగట్టరాదటవె ॥ నేలపై శయనించినీ వుండగానేల। హంసతూలికెపాన్పుపైనుండరాదె ॥ ఏలనముజూడవింకే లసందేహంబు। బాలికామణినిన్ను బాసిపోలేను ॥ అఖిలలోకంబులకునధి కారినైనేను। జలగుదునునాపేరుశతకంధరుండు ॥ కైలాసమునకన్నకడు వైభవముమీరి। వర్తిల్లునాపురమువైభవంబునను॥ లంకాపురముకంటె పొంకమైనప్రకాశ। లంకాపురంబనాలంకాపురంబు॥ ఏవీధిజూచినాహే మమయమైయుండు। రత్నజాలములతోరంజిల్లుచుండు॥ నాభాగ్యముకు సాటినాకవాసుడుగాడు। నాతోడవర్తించునాళీకనయన॥ నాసతులకంది

రికినాయకంబుగ జేసి। పట్నంపుదేవిగాప్రబల జేసెదను॥ ఏలతలపవుజూడ
వేలకోమలిబాల। మేలమనకు తాళజాలనీ వేళ॥ నావాక్యమాలించు నాపై
నికరుణించు। నాతోడవర్తించు నన్నాదరించు॥ అనుచుదగ్గిర రాగ దనుజా
పై కోపించి। విమలాంగి యిట్లనియె వెరపుబొందుచును॥ ఓరిదనుజాధమా
వాడలుమత్తతనొంది। దుర్వాక్యములనేల తొడరిబల్కెదవు॥ పరసతీజన
ములకుపరులభాగ్యంబునకు। నాసించువారలకు నాయువులుగ్రుంగు॥ వర
ధర్మహానియగునరకంబుసిద్ధించు। సిరులణంగునుమిగుల చేటుసమకూడు॥
మాతంగ్రికన్యడీమాటయిప్పుడువింటి। కదసినినుభస్మంబుగాశపించును
గ॥ పరనారిసీతపై భ్రమజెందిరావణుడు। మడసిపోయినయట్టిమాటవిన
లేద॥ పొమ్మువేగముమరలిపోరనీపురమునకు। కుటిలచిత్తుడనీకు కూడదీ
మాట॥ అనిధర్మశాస్త్రంబుగొనుచుచతురోపాయములు। ధర్మములు
జెలువఖలుడురాక్షసుడు॥ వేదతపసికివలెనెవెరపింతువాయనుచు। వనిత
మకమునగవిసనాబాలపైని॥ పాపిష్టిదానవుడుబలిమికౌగిటజేర్చి। బాల
మొఱ్ఱోయనుచుపలువరించగను॥ బలిమిపైబడిమానభంగంబుగావించె।
తావనేంద్రునిబిడ్డతహతహలుబొందె॥ బలుడుతననూరుమోములచుంబ
నంబులను। గావించెమునిబాలగగ్గోలుపడియె॥ ముదితవిలపించంగమదన
కదనమునసల్పె। కల్ల కావరముననుఖలుడురాక్షసుడు॥ ఆసతికపుడుసద్యో
గర్భమైమహా। వింతబాలుంగసియెకొంతసేపటికి॥ ఖలురాక్షసునిమేనుభ
రముచేవిమలాంగి। శిథిలమైయచ్చోటజీవంబువిడిచె॥ సమిధలనిమిత్తం
బుజనికణ్వమునివరుడు। తానుక్రమ్మరవచ్చెత్వరితమార్గమున॥ వనము
లోసంచారమొనరించుచున్నట్టి। శతముఖునిబొడగాంచెసంయమీంద్రుం
డు॥ ఈదుష్టరాక్షసుండేతెంచిమునిబాధ। లేమిగావించెనోయనుచుభీతి
లుచు॥ పర్ణశాలకుజేరిపసిబాలకుడుకావు। కావంచునేడ్వంగగాంచిముని
వరుడు॥ ఇదియేమివింతనుచునెంచిదగ్గిరరాగ। మానవతివిమలాంగిపీను

గబాణ। దనుజఫాలముగిట్టి తా ముష్టివేసె॥ ఫాలభాగమునసోకిబలుదుకా
సొమ్మసిలి। చంచలత్వమునొందుసమయంబునందు॥ ఖలుడుగూలుటకొర
కు తెలియంగనారద। మౌని చెప్పినరీతిమగువ తానపుడు॥ ఆగ్నేయబాణం
బులందిదనుజునినాభి। గురిబట్టివేసెనిర్భరముష్టివెలయ॥ ఘృతము వేల్చిన
యగ్నిగతిమంటలాలుకొనుచు। దనుజనాభీతలముదాకెబాణములు॥ సిం
హాధాటిచేసిసీతామహాదేవి। మరిమరియునసలములశరవృష్టిగురిసె॥ ధీర
తలువెలయంగ తెరిపిలేకుండంగ। సురవైరినాభిపై జొని పెబాణములు॥పా
గలుమంటలుమింట భగులుకొనిబాణములు । దనుజనాభీతలము దాకె
ఘోరముగ॥ ఆదనుజనాభితలమందునున్నట్టియా। యామృతంబులునా
ర్చునసలబాణమున॥ తెరలిరాక్షసునాభిదివ్యామృతము లెల్ల। కాలిభస్మం
బాయెఘడియలోపలను॥ తిరిగివేగమువచ్చితరుణిసీతాదేవి। పొదిలో
నుమారెనెమ్మదిగానుశరము॥ అమృతములన్నియునుహతమాయిపోవుట
కు। సంతోషమునుబొందిజానకీరమణి॥ అర్ధచంద్రాస్త్రంబులవివింటసం
ధించి। దనుజాకరశిరములెల్లనుదూలనేసె॥ పరగనెప్పటిరీతిబాహువులు
శిరములును। దనుజేశునకుబుట్టెతక్షణంబునను॥ అవియెప్పటిగబుట్టనం
తలోదునుమాడ। అతివసీతాదేవియద్భుతంబుగను॥ బోటిసీతాసిరీతినూ
టతొమ్మిదిమార్లు తలలుచేతులుగూల్చెతప్పకుండగను॥ ఘనుడుమునివ
రుడు చెప్పిననిర్ణయంబుగా। బరిమార్చెరాక్షసునికరశిరంబులును॥ దాన
వుడువెరగందితత్తరంబునుబొంది। జానకీదేవిగనిచాలకోపమున॥ కనుతె
ర్రగాజేసిఘనశూలమందుకొని। వినరజానకిపై నివీరముష్టిగను॥ ఘో
రముగనలములుభోరునమిన్నంట। జనుదెంచెశూలంబుజానకిపై ॥క
నిజానకీదేవిఘనశరముకటి । శూలంబుఘడియలోచూర్ణమునుచేసె॥
శూలంబుదూలుటకుచాలకోపంబాదవి । కదువడినిరాక్షసుడు గదద్రిప్పి
వైచె॥ చండప్రచండమైనదానుదేసుగదగాంచి। చటులాస్త్రముకటేసెజా

నకీరమణి॥ ఘనశరమేతెంచిగదదగ్ధముగజేసె। సురవైరివరగండిచూ
చుచుండనుగ్ర॥ గదనుగ్గుగావుటకుమదివికలమునుబొంది। తల్లిచెప్పిన
మాటతగనిజంబనుచు॥ తనచాపుసిద్ధమనిఘనుడుశతముఖుండు। యేవు
మీరుచుబూననల్లశస్త్రములు॥ భానుకిరణములవలెబాసిల్లుబాణము
లు। ధరణిసుతపై వేసె తెరిపిలేకుండ॥ రవిమండలముగానరాకుండగావ
చ్చు। బాణములుబాడగాంచిజానకీరమణి॥ మేఘజలధారలనమేరైనబా
ణములు। వేలకొలదిగబరపెవెలదికానపుడు॥ దానవునిబాణములుదగ్ధం
బుగావించె। తివిరిశ్రీరఘురాముదేవిబాణములు॥ తనశరంబులుయిట్లుతు
నియలై పోవుటకు। చింతించియొకకొంతసేపుదానవుడు॥ ప్రళయకాలము
నాటిపెనుభూతమోకాక। ముజ్జగంబులుమ్రింగుమృత్యుదేవతయో॥ కా
కనుగడతేర్చుకాలమృత్యువునిజము। కాకున్ననిటుపోరగానవశతరము॥

శతముఖుడు రామునాక్షేపించుట.



అనిరామబాడగాంచిఅసురనాధుండనియె। చేబాపురానరుడచాలునీప్రతి
జ్ఞ॥ కణగినాతోనీవురణముసేయగలేక। భీతిల్లిమదిజెంగబెట్టుకన్నావు।

పొడుచుచుండిన తూఁటులెన్నియున్నవై తే ॥ తలయొక్కటి రెండు చేతులు దక్కఁ ద
నుజునకు॥ కొండువంటి శిరములను గూల్చగా కనుచు॥ దివ్యశరమును చెప్పి ధీ
రతలు దీపింప॥ భామయు సెవడి వేసె బ్రహ్మాస్త్రమపుడు ॥ ప్రళయకాలాగ్ని
ఘోరభైరవయుగ్మమో॥ ముజ్జగంబులు ద్రుంగు మృత్యువో యనగ॥ ఘూన
భోంతరములను బాదవుచుమండుచును । సురవైరివరగంద శరమేగుడెం
చ॥ తిరిగె భూచక్రంబు బరిగె కులశైలములు॥ కడు తారకలు డుల్లె గగనంబు
వణకె॥ సూర్యుండు గతిదప్పె శోకించె రాక్షసులు। చిట్టచీకటి క్రమ్మె దిట్టము
గనపుడు॥ చిచ్చులొలుకుచు నేగి శరము శతకంధరుని। బాహువులు శిరము
లును బడగూలనేసె॥ తలయొక్కటి రెండు చేతులు దక్కఁగా జేసె॥ కొండువకర
శిరములను గూల్చె బాణంబు ॥ దనుజ కరశిరములను తక్షణంబును గూ
ల్చె। శరము తూణీరంబు జేర వేగమున ॥ అష్టదిక్పాలకులు అమరాది దేవ
తులు। వినువీథి జయజయధ్వనులు జేసిరిగ ॥ తలయొక్కటియు నిలచి ధను
జనాథుండపుడు। చావునకు మసరెంచె సాహసంబునను॥ తలయూచి శ్రీరా
ము తరుణిపై కోపంబు। జెనగొనుచు రాక్షసుడు ఘనశరములందె ॥ ఘనశ
రంబులు బూవనిత సీతావతిని । గని కోపమున బలికె ఘనుడు శతముఖుడు॥
నీవిభుడు నా మొనటను నిర్వహింపగ లేక । విల్లు బాణములిచ్చి వెలదిరో నీకు॥
మగని వెనుకకు ద్రోచి తగుదునని నాతోడ । కయ్యానకెదురించి కాలుద్రు
వ్వితివి॥ నీ మగని మగతనము నేలపాలై పోయె। బలవిహీనుడు వాని బ్రతుకే
మి బ్రతుకు॥ ఇదుగో గూల్చెదనిన్ను నీ ఘోరశరమునను॥ యని ఘో
రశరములను వనితపై వేసె ॥ దనుజశరములు గాంచి తరుణి జానకి దేవి। ఒ
క్క శరమున గూల్చె వాని బాణములు। మరియొక శరమందిడు డువడి నిరాక్షు
స। వరుస కరతల మొక్కటి బరిమార్చి వేసె ॥ ఒక చెయ్యి గూలి కానొక చేతి
తో కత్తి బట్టి వడివడి వచ్చె బలు రక్కసుండు॥ బలు బాణమొకటందె భామ
సీతాదేవి। దనుజు రెండో చెయ్యి మునుమాడె నపుడు॥ రెండు చేతులు గూలి

మొండియైబలుతాటి॥ బొందవలెరాతనుడుభూరికోపమున॥ ఘోరంబు
గాతనదునోరుదెరచుచువచ్చి। మెలతసీతాసతినిమ్రింగబోవుచును॥ నో
రుదెరచుచువచ్చు ఘోరదనుజునిజూచి । సీతామహాదేవి చిరునవ్వువెల
యు॥ చండప్రతాపమాచక్రబాణమువింట । సంధించియానిశాచరునిపై
వేసె॥ పటువిక్రమంబుగనుబలుమంటలెగయుచును। నెలమిగాసూర్యమం
డలముబోలుచును॥ కాలదండముబోలికాలానలముబోలి । వజ్రాయుధ
ముబోలివాడిమీరుచును॥ అలసుదర్శనచక్రములువేయిబోలుచును।ఫా
లలోచనుచేతిశూలంబువలెను ॥ హరుడుబ్రహ్మయుసురలు నాకాశవీధి
పై । నందరుసంతోషమందిచూడగను ॥ భూనభోంతరములనుబాదవు
చుమందుచును। పటుశరంబేతెంచెబ్రహ్మాండమదర ॥ వసుధకుమ్మరిసానవ
లెదిర్గిరందిరిగె। వేయిశిరసులనాగవిభుడుతలవంచె॥ జగముతల్లడమందె
శైలముల్ మొగ్గతిలె! సప్తసముద్రములొక్కసరణిఘోషించె॥

సీతాదేవిచే శతకంఠుడు చచ్చుట.



అఖిలదానవకోటిఅంధకారంబనగ । శరమేగిశతకంఠు యురపై
గాడ॥ ఉరముభేదించిసత్వరగతిసిదేహంబు । చించిదనుజునిశిరముద్రుం

చి వేగమున॥ పూనిదివ్యశరంబువానిప్రాణముగ్రోలి। ధరణిభేదించిపాతా
ళంబుజొచ్చె ॥ అచటఁ మునమునిల్చిఅతివేగజానకీ। తూఁశీరమునుజేర
బాణమవ్వేళ॥ శ్రీరాఘవులదేవిసితశరంబులమూలి। కొండవలెరాక్షసుడు
గూలెరణమందు॥ తద్భరముకోర్వకనుతల్లడంబునుబొంది। ఫణిరాజుత
లవంచెపాతాళమునకు॥ గరుడకిన్నరయక్షగంధర్వచారణ। సురసిద్ధులా
నందభరితులైరపుడు॥ పొలుపొందమకరందపుష్పవరషముగురిసి। రావ
ధూవసులపై యమరాదిసురలు॥ వాయుదేవుడువిసరెవసుధచల్లనిగాలి॥త
రుచుగాదుందుభిధ్వానంబుచెలగె॥ అంతవిభీషణుడుహనుమంతుజాంబ
వుడు। చాలసంతోషములనోలలాడిరిగ ॥ అప్సరాంగనలెల్లనాడిరతిము
దమునను। విమలమైవిలసిల్లెవెలయంగదిశలు॥ వలనొప్పకార్యనిర్వాహ
కంబాయెనని। సంతోషమునుజెందిజానకీరమణి॥ శ్రీరామచంద్రుండుత్రి
తలోకపాలుండు। అధికబ్రహ్మానందుడాయెనవ్వేళ॥ విలుబాణములునేల
విడిచిసీతాదేవి। పతిపాదపద్మములప్రణమిల్లెనపుడు॥ ప్రణమిల్లియున్నట్టి
భామినీమణిజూచి। తనయక్కునను జేర్చివనజలోచనుడు॥ ముదితచెక్కి
లిబట్టిముద్దాడిపలుమారు। పరమపురుషుడురాముపలికెమోదమున॥ సీక
తంబునగాదెనేడుయీవైరంబు। గెలువసమకూడెనోజలజాతనేత్రి॥ అఖి
లజగములమెచ్చనసురుదనుమాడితివి। ముల్లోకములవారుమెచ్చుటెంచ
గను॥ వెలదిదనుజునిదృంపవిపరీతచందంబు। గలుగజేసితివియీకాలం
బునందు॥నగుబాటురాకుండనాప్రజ్ఞనిల్పితివి। పసుపలోపలనాకువన్నె దె
చ్చితివి॥అనిరాఘవేశ్వరుడుతనసుందరీమణిని। వినతులొనరించుచును వెల
యునంతటను॥ వాసిష్ఠనారదవాలఖిల్యమహామ। నీంద్రసంఘములెల్లనే
తెంచిరపుడు॥ ప్రమథగణములుగొల్వపార్వతీనాథుండు। జానకీప్రియుజూ
డజనుదెంచెనపుడు ॥ బ్రహ్మపట్టమునుంచిభారతీనాథుండు। శంకరునితో
గూడజనుదెంచెనపుడు॥ అమరావతీనాథుడతిసుగుణశీలుండు। వేయుకన్ను

బ్రహ్మేంద్రాదులు రామునిజూడవచ్చుట.







లుగల్గువేల్పుజనుదెంచె॥ అమరాదిదేవతలుఅష్టదిక్పాలకులు।సర్వగీర్వా
ణులునుజనుదెంచిరపుడు॥ భోరుననుదివినుండిచేరిరారఘువరుని। కనుల
పండువుగానుఘనులువారంత॥ శంకయేమియులేకశారదానాథుండు।జా

వకీసతిజూచిసంతోషమునను॥ పలువిధంబులచేతప్రార్థనలుగావించి॥వో తల్లి జానకీవోలోకమాత॥ ముజ్జగంబులకెల్లముదమొందజేసితివి। పరగ సత్కీర్తులనుబరగితివితల్లి॥ కంటకుండైనశతకంఠునిబరిమార్చి। జగము ద్ధరించితివిసఖియమాతల్లి॥ నిండెలోకములెల్లనీదుఘనకీర్తులను। ఆపద ల్గడతేరెనఖిలజీవులకు॥ అష్టదిక్పాలకులుఅఖిలమునిసంఘములు। నమరా దిదేవతలుయానందులైరి॥ నీబాణసారముననిలగూలెశతముఖుడు।అఖి లలోకంబులకుఆపదల్దొలగె॥ దశకంఠుబరిమార్చిధరణీతలముబ్రోచె। నీప్రాణనాయకుడునీరజేక్షణుడు॥ శతకంఠుబరిమార్చిజగముద్ధరించితివి। నిఖిలంబుబ్రోచితివినీవుమాతల్లి ॥ సతిపతులుమీరొక్కసమముగామము ల్లోక। కంటకులనిద్దరినిమంటగలిపితిరి ॥ ఇకలోకులకుబాధయేకాలమున లేదు। కడుక్రూరులిద్దరునుగడతేరినారు ॥ నీకువరమిచ్చెదమునీవుకోరిసరీ తి। దయజూచికోరుమాతల్లిరోనీవు॥ అనిబ్రహ్మదేవుండుతనతోడబలుకం గ। పతిమోముచీక్షించిపరమకల్యాణి ॥ జీవితేశునియాజ్ఞజెందిపరమేష్ఠి తో। పలికెసీతాదేవిపరమహర్షమున॥ చెప్పన్నదేశాధిజనవరులుయావ త్తు। మానిమిత్తమువచ్చిమడసిరిచొప్పట॥ మమునమ్మిసుగ్రీవుమర్కటబల మెల్ల। రక్కసునిచేతనీరణములోజచ్చె॥ మూలబలములువచ్చిముప్పద క్షోహిణులు। కడురాక్షసునిచేతమడసిపోయిరిగ ॥ ద్వాదశాక్షోహిణులు దనుజబలములువచ్చి। దనుజతోబోరాడిధరణిగూలిరిగ ॥ మరిదిలక్ష్మణ వరుడుభరతశత్రుఘ్నులును। కొమరులగుకుశలవులుకూలిపోయిరిగ॥ అతి ధైర్యగాంభీర్యుడైనట్టివిజయుండు। దనుజుచేతనుగూలిధరణిద్రావాలెనుగ॥ రణరంగముననిందరునునేలపాలైరి। సాకేతపురమునకుజనుదెంతుమెట్లు॥ వారుజీవస్థులైవర్ధిల్లియుండుటకు । వనజసంభవనాకువరమియ్యవయ్య ॥ పూర్ణాయువులజెంది పొలుపొందియుండుటకు । కరుణించవయ్యఓకమల సంభవుడ ॥ ఇతరమేమైనమాకివ్వనక్కరలేదు । బలములన్నియుమాకు

బ్రతుకుటలుచాలు॥ అనుచుసీతాదేవిఆబ్రహ్మతో బలుక। పరమపూర్ణ ము
నొందిభారతీవిభుడు॥ అమరాదులకుజెప్పిఅఖిలబలములపైని। కనకవర్ష
ముముందుగాగురియజేసి॥ తరువాతతానమృతవరషంబుగురిపించె। కల
కలంబులుబొందెబలములన్నియును॥ కర్తిగురుతులుమేనగానరాకుండం
గ। సకలసేనలులేచెక్షణములోపలను॥ అమృతవర్షపుమహాత్యంబెట్టిదో
గాని। అఖిలబలములుబ్రతికిరాక్షణంబునను॥ వారియానందంబువర్ణన
లేయంగ। వశమెవ్వరికినానువసుధలోపలను॥ సకలసేనలుమహాసంతో
షభరితులై। యెలమిబెంపొందిరియింకనేమిచెప్పదుము॥ శతముఖుఁబరి
మార్చిజగములనురక్షించ। కలకాలమునురాముఘనకీర్తినిండె॥ ఆటలం
దుననైనపాటలందుననైన। పరగరామునికథలుపాపహరణములు॥ చదు
వులందుననైనశాస్త్రములయందైన। పరగరామునికథలుపాపహరణ
ములు॥ ఏకథలలోరామయోగ్యతలుగలుగునో। ఆకథలుపుణ్యకథలవి
మానవులకు॥ మానవజన్మంబుమహిమాస్తినందులకు। వినవలెనుశ్రీరామ
విభునిచరితములు॥ కలదుజీవన్ముక్తికడుభోగభాగ్యములు। సకలసుఖము
లుగలుగుసర్వజీవులకు॥ పనసజంబూద్రాక్షఫలరసంబులకన్న। మధురం
బుశ్రీరామకథలులోకులకు॥ కదళికామకరందఖర్జూరములకన్న। మధు
రంబుశ్రీరామకథలులోకులకు॥ మధుశర్కరాక్షీరదధిఘృతంబులకన్న।
మధురంబుశ్రీరామకథలులోకులకు॥ నవసుధాపరమాన్ననవనీతములక
న్న। మధురంబుశ్రీరామకథలులోకులకు॥ ఇంతమధురంబైనయేపదా
ర్థములేదు। నారాయణునిదివ్యనామామృతంబు॥ నారాయణునిదివ్యనా
మామృతముగ్రోలి। మోక్షదాయకులైరిమునిగణంబెల్ల॥ సర్వజనముల
కెల్లసాయుజ్యపదమబ్బు। నారాయణునిదివ్యనామామృతమున॥ భవరో
గహరణంబుపరమపదవాసంబు। సరసిజాక్షునికథలుసర్వజీవులకు॥ వనిత
సీతాదేవిఘనశరంబులుసోకి। బలుకొండవలెనేలబడియెశతముఖుడు॥ ర

ణముల్లో శతకంఠుప్రాలనిట్లుప్రతాప। లంకాపురమునందురాక్షస స్త్రీలు। శతముఖుడుకొండవాలెనమరమునదూలెనని। వార్తలువిన్నారువారలవ్వే ళ॥ అంతఃపురములోనుఆచిత్రగంధియును। దనుజభార్యాలెల్లతగమూర్ఛబొంది॥ భామలందరుమహాపరవశంబునుబొంది। కొంతసేపుకుదెలసి ఘోరదుఃఖముననుః॥ పరమసాధువుదనుజభార్యమొదలైనట్టి। వెలదులందరులంకవెడలివచ్చిరిగ॥ పదయుగంబులుద్రొక్కుపడకానులల్లాడ। వరరత్నభూషణావళులెల్లప్రాల॥

శతకంఠుని భార్యలు విలపించుట,





జడలుమడిమెలపైనిచలగినటియింపంగ। బాష్పపూరములచేతపయ్యెదలుదడియ॥ మొగములునురములునుమోదుకొనిపొరలుచును। ఘోరశోకమునగగ్గోలుపెట్టుచును॥ దారిగానకరాళ్లదగిలిపడిలేచుచును। హానాధయనిమూర్ఛనవనిప్రాలుచును॥ రణభూమికరుదెంచిరాక్షసస్త్రీలంత। రణనిద్రజెన్నొందురాక్షసునిగనిరి॥ రఘువరునిదేవిచేరాక్షసుడువెనదూలి। విరిపాన్పుబొరలాడువిధినేలనుండ॥ రథకేతనంబులునురథచక్రములుగూలి। హంసతూలికపాన్పులమరినట్లుండ॥ కనకమణితోడ

వులుకరయుగంబులగూడి। దనుజనాథునికమరెతలగడలరీతి॥ గాయము
లితనమేనగారురక్తమురక్త। చందనాకృతిబోలిఅందమరియుండె॥ ధర
ణీపరాగంబుతనమేనుపై బరగి। శాలుగప్పినరీతిజెందియుండెనుగ॥ కాక
ఘూకంబులునుకంకాదిఖగములును। పరిచారకులరీతిబదిథవిల్లెనుగ॥ తెలి
వేమియునులేకదీర్ఘనిద్దురబొంది। ధరణిబడియున్నట్టిదనుజుబొడగనిరి॥ మ
దగజముబడగూల్చుభ్రమాలుపై టలుబారి। యున్నతీగెలరీతినువిదలంద
రును॥ శోగములుబెనగొనగలోకకంటకుడైన। శతముఖునిపై బడిరిసఖి
యలందరును॥ పడిమోముపై మోముపలుమారుజేర్చుచును। బలుమే
నుకౌంగిటనుబట్టిరందరును॥ బలుమేనుకౌంగిళ్లబట్టిసతులందరును। పలు
విధంబులచాలవిలపించిరిట్లు॥ హానాథశతకంఠహానీదుశూరత్వ। మెచ్చో
టుకేగెనింకెచ్చోటగలిసె॥ సురవర్గములనెల్లచెరలుబట్టినయట్టి। నీదుది
వ్యాజ్ఞయేమేటగలసెనుగ॥ అష్టదిక్పాలకులహాతమార్చునీబలిమి। శౌ
ర్యమంతయునుయేజలధిగలసెనుగా॥ త్రిపురసంహారునైనతెరచినీమొగ
మెత్తి। వెరపించులావుయేపీటగలసెనుగా॥ తపమహాత్వంబునకుతగబ్ర
హ్మనీకిచ్చు। వరములన్నియునుయేవనటగలసెనుగ॥ నీరూపునీరేఖనీసొం
పునీపెంపు। నెల్లప్రాభవమిపుడుయెందుగలసెనుగ॥ నిలుచునావాప్రాణము
లునిముషంబునినుబాసి। పిలచినాయొకమారుపలుకవేమయ్యా॥ తప్పేమి
యునులేదుదయజూచిమాపైని। ఘనుడనీవొకమారుకనులెత్తిచూడు॥
భయమెవ్వరికినైనభయమనగనికేమి। వీరుడవుజగదేకశూరుడవునీవు॥
అసమానబలశాలివానందపూర్ణుడవు। గవికోటితేజుడవురాజితుండవుగ॥
తొలగినీశిరముయీధూళిభ్రమంగుండగా।శయనింపధర్మమాజగదేకవీర॥
మమ్మువిడనాడుటకుమనసునీకెటులతాళె। ధవుడమమ్మెడబాయధర్మమానీ
కు॥ ఎన్నెన్నిజన్మంబులెత్తిపుట్టినగాని। బలశాలినీవంటిపతిమాకుగలడ॥
ఎట్లుభరియింతుమింకేతాళుదుము। నినుబాసిప్రాణములునిలుచునామా

కు॥ ప్రాణేశనినుయెడబాసి తాళఁగలేము। సెలవిమ్ము నీవెంటఁ జనుదెంతుమి
పుడు॥ ఏదిగతి యేదిక్కృతి యేదిదిక్కికమాకు। నేదారి యే తెరవు యేమిజే
ప్పవుగ॥ అలగితివో మామీఁద నధికబలసంపన్న। పిలచి తేపలుకవు ప్రియ
మెందుబోయె॥ కలనైన మేము నీశలవు దప్పఁగ లేదు। యింతకఠినవు బుద్ధి
యేమి ప్రాణేశ॥ అని పెక్కుభంగులను యతివలందరు చాల। పతిమీఁదబడి
విలాపము నొందిరపుడు॥ తనదు కోడళ్లిట్లు తనయు శతకంఠుపై। బడి మ్రొ
క్కలిడి రిట్లు పలువిధంబులను॥

## చిత్రగంధి కుమారునికై దుఃఖించుట.

తగ చిత్రగంధి సయ్యన పుత్రుదరి జేరి। అతనిపై బడి యిట్లు ననియె శో
కమున॥ హా శతాస్యకుమార హా శౌర్యగంభీర। హా సుందరాకార హా మేరు
ధీర॥ శతకోటి మన్మథుల సరిబోలు నీరూపు। పొలసెనా జానకీబలుశరంబు
లను॥ వనజసంభవుడిచ్చు వరమహాత్వము లెల్ల। నిర్మూలమాయెనా నేటి
తో నీకు॥ దిగ్గజంబుల గెలచిడీకొన్న నీబలిమి। కటకటా భువిలోనఁ గలసె
నా నేడు॥ ఎంతగతి వచ్చెరా హీనబుద్ధిఁదలంచి। శతముఖ నామాట చెవిబెట్ట
వైతి॥ వెలయ రాఘవుడాదివిష్ణుడని చెప్పితిని। సుదతి జానకి పరంజ్యోతి
యంటినిగ॥ కపులు సురవరులంటి కడు జయము గాదంటి। కలనైన వైరంబు
దలపవద్దంటి॥ నామాట చెవిబెట్టినావు గావెంతైన। వినక నీవీగతిని యిటు
పొందవలసె॥ రాఘవేంద్రుని జంపి రమణి జానకి దెత్తు। ననిపల్కితివి నీవు న
న్యాయముగను॥ ఆమాట యే నీకులాంగనల కేవత్తు। సహజవైధవ్యమీ
క్షణము లోఁగలిగె॥ అగ్నిఁ గొంగున ముడువ నాపేక్షపడ్డావు। ముందువచ్చె
టట్టి మోసమెరుగకను॥ వద్దు వద్దని యెంతవాదించి చెప్పితిని। వినక నీవీకతం
బు నొందినావు॥ అరగడియ నిను బాయనది నాకు యుగమాయె। నినుబా
యనాగుండె సైలచునేరీతి॥ నీతండ్రి విశ్వవసు నీరజాప్తుని గోరి। తపము జేసిన
మెచ్చి తనయు నిచ్చె॥ వరమహాత్వమున నీవర యనా గర్భమున। జనన

మొందితివిగా శతకంఠములను॥ శతకంఠములనీవుజననమొందినవల్ల। శత
కంఠనాశంబుజేన్నారెనీకు॥ సీతామహాదేవిసితశరంబులనిన్ను। కనికర
ములేకఖండగడతేర్చివేసె॥ ఆదినారాయణుండారాఘవుండైన। దయని
న్నుజూడగాదలపడాయెనుగ॥ వారిననబనియేమిక్రూరబుద్ధివినీవు। క
య్యమునకెదిరించికాలుద్రువ్వితివి॥ దుర్మార్గములనీవుతులదూగుచుండం
గ। కనికారబుద్ధెట్లుగలుగువారలకు॥ తాజేయకుండంగతనకులభ్యము
గాదు। కీడైనమేలైనకేవలంబుగను॥ తనకునిర్మలవృత్తిదనరంగగలిగి
తే। సిద్ధింపదెన్నడునుచేటుమార్గంబు॥ కడుఘోరపాపములకొడిగట్టినం
దునను। గలిగెనీమరణంబుకడుయుద్ధమందు॥ ఏమిసేయుదునునేనేలాగు
భరియింతు। దిక్కేది తేరవేది తెన్నేదియికను॥ పొంకమైనప్రతాపలం
కాపురంబెల్ల। బలుపీడపేటాడునలువీధులందు॥ నీవుగూలకముందెనిఖిల
బలములదెచ్చి। సమరంబుగావించిజలధిగలిపితివి॥ వినలేనువిధవలవీర
శోకారవము। నొకరిద్దఱనుగారువారించుటకును॥ కడుపురంబందరునుగ
గ్గోలుపెట్టుదురు। నిందుసేయగనాకుగుండెతాళదుగ॥ ఒక్కపురుషుండైన
నసూరలేకుండంగ। మొనసిపురస్త్రీలుముండమోసిరిగ॥ గతియేదివార
లకుధృతియేదినాకికను। దయజూచిచెప్పరాధైర్యపుత్రుండ॥ చలమున
వారింపజాలనైతినినేను। ఇంతగతిగలుగగానేలతాళుదును॥ ధాతవ్రాలీ
లాగుతథ్యమైయుండగా। నీవేలవినియెదవునేజెప్పినట్లు॥ నుదుటవ్రాసిన
వ్రాతనులిమితేచెడిపోదు। అనుభవించకతీరదనుభవంబెల్ల॥ అనియెదురు
గానున్నఆరాఘవులగాంచి। కరయుగంబులుమోడ్చికాంతయిట్లనియె॥

## చిత్రగంధి రాముని నిష్ఠురోక్తులాడుట.

శ్రీరామరఘురామశ్రీజానకీరామ। చారుసుగుణోద్ధామసంగ్రామభీమ॥ త
నయుడగుశతముఖుదయమాలిచంపితివి। దైనరాయానీకుధర్మమాయి
ట్లు॥ తనజ్ఞాతులైనరావణకుంభకర్ణులను। బరిమార్చినారన్నశాంతమునవీ

డు॥ పడుచుబుద్ధినిమీఁలోఁపగబూనియున్నాఁడు। గద్దరింపుచువీఁడుబుద్ధిహీ
నతను॥ అవతారపురుషుండవనినన్నెఱుఁగకను। మాఁకుఁగొనినతోఁడమే
ల్పరంబుననూ॥ గర్వవంతుడువీనిగర్వంబుతూలంగ। తిఱిరిచేతులుతీటదీ
ర్పంగరాదా॥ తలయొకటిచేతులును రెండుదక్కఁగఁజేసి। కోఁతువకరశిరము
లనుగూల్పంగరాదా॥ అటుమీఁదబలుగర్వమూఁగిమీఁపాదములు। మఱఁగు
చోరఁడాబుద్ధిమంతుఁడై వీఁడు॥ ప్రాణములువరిపుచ్చిపడఁగూలవేసితిరి। వై
వతాయామీఁరుధర్మంబువిడచి॥ అతులప్రతాపలంకాపట్నవాసులకు।
ప్రాపకంబిక నేదిబ్రతికియుండుటకు॥ వాఁడుదుష్టుండై తేవాసిఁజెందినయట్టి
జీవకోటులు యేమిఁజేసెపాపములు॥ ప్రాపకం బెడఁదూలిబ్రతుకుమార్గము
లేక। వానిపురమునయెట్లువర్తిల్లఁగలము॥ పురవాసులందరిఁ బరిమార్చి వే
సితిరిఁతరుణులందరికివైధవ్యంబుగలిగె॥ వాఁడిసహవాసమునవడిబలంబు
లుగూలె। వనితలందరుశోకవనినుండఁగలిగె॥ పురవాసులందరికి తెరవేది
దిక్కేది। గతియేదిధృతియేదిమతిదలంపఁగను॥ తలయొకటిరెండుచేతుల
తోఁడదానవుని। విడువరాదాజ్ఞానవిధినుండుమనుచు॥గర్వమెంతయుదూ
లికదుబుద్ధిమంతుఁడై। మెలఁగఁడామీఁవద్దమిగులభక్తిగను॥ కొండవలెర
ణమందుఁగూలంగఁజేసితిరి। కటకటాయెక్కింతకనికరము లేక॥ భరియింతు
మెట్లుయీపురములోపలమేము। అతివలందరముమాకాధారమేది॥నీవె
యాధారంబునీదెమాభారంబు। నీవెతల్లివిమాకునీవెతండ్రివిగ॥ ఎట్లుర
క్షింతువోయేదరినిఁజేర్తువో। ఎల్లభారంబునీదే రామచంద్ర॥ భువనంబు
లోనీవుపాలుపారఁజెలఁగుదువు। భువనములునీయందుఁబూనియుండెదవు॥క
పటనాటకసూత్రనిపుణుండవై నీవు। మాయాప్రపంచంబుఁజేయుచున్నా
వు॥ మమ్మునందరిని యేమార్గమునదయచేసి। కాపాడిబ్రోతువోకమలలో
చనుఁడ॥ నీదివ్యపదయుగము నెరనమ్మియున్నాము। సకలలోకేశ్వరాజాన
కీరమణ॥ అనిపాదపద్మములవసేతరాబ్రాలంగ। కనికరంబునరామజనవ

## శ్రీరాములు చిత్రగంధినూరడించుట.

రుండవుడు॥ పాదములపై బడ్డపణతి లేవగనెత్తి। దయజెనంగగ బలికెదా
శరథియపుడు॥ ఓసతీవగువంగవలదుశోకంబుడుగు। అసమానవిక్రముం
డైనసీసుతుడు॥ ధరణిబడినందాకతగనొక్కరీతిగా। పోరినాతోనొక్క
యార్ష్యలతనతండు॥ ఈరేడులోకములనెవ్వరైననుగాని। వీనితోసరిజో
లపీరుండులేడు। వీరుండుజగదేకశూరుండురణరంగ। ధీరుండునిరండుధీ
రసాహసుడు ॥ ఇతడుధీరుండనుచునెల్లలోకమునందు। దలచుమాటలు
మాకుదాఖలాపడెను॥ మర్కటబలమెల్లమదమణచినరిపుచ్చె। దేశాధి
రాజులనుతేజంబులణచె॥ మూలబలములనెల్లనేలగలయగగొట్టె। కడు
విభీషణుబలముకడతేర్చివైచె ॥ అనుజాలనుకుశలవుల నావిజయులనుబ
ట్టి। యేపెల్లదూలించియిలగూలవైచె॥ నాకుసాధ్యముగాకనాపైనిబలు
వేడి। శరములుగ్రతవేసిశక్తిగసపర్చె॥ అంతలోజానకీఅడ్డంబుగావచ్చి।
దనువుతూపులుబట్టిదనుజతోఁబోరె ॥ అతనిదోర్గర్వంబుఁజగపర్చికాంత
తో। రణముజేసెనుపరాక్రమవిక్రమముగ ॥ కరములునుశిరములునుఖం
డించినాగాని। వదలకుండగధైర్యవశుడగుచుబోరె ॥ తలయొకటిరెండు
చేతులుదక్కగాజేసి। కాంతసీతాదేవిగనుగొనుచునిలచె॥తనుగావుప్రో
వుమని। అణుమాత్రమైననుతననోటరాదాయెదనుజవీరునకు॥ అంతకంత
కుకోపమధికమైపోరంగ। కోపమునజానకీగూల్చెదానవుని ॥ తనుగావుమ
నిపల్కతననోటరాదాయె। మము నేలనిష్టూర్యమాటలాడెదవు॥ అతని
పరమాయువయుయాసన్నమైయుండ। నతడేలమాశరణుకాశించివచ్చు॥
ఏలవిలపించేవు యెంతవారలకైన। యిలజయాపాజయము లెవ్వారికిగలు
గు॥ దేహమనిత్యమనిదెలియదెవ్వారలకు। మరణమొందుచునుండమా
నుదురుయెవరు॥ సీతామహాదేవిచేతనీకొమరుండు। ఘోరరణరంగము
నగూలియున్నాడు ॥ ఘోరరణరంగమునగూలువీరులునెల్ల। వైకుంఠ

వాసులైవర్తిల్లగలరు ॥ సుదతినీవాతనికిశోకింపబనిలేదు । వైకుంఠపుర
మందువర్తించునతడు॥ ధరలోనుజీవులకుమరణములుదప్పవు। యెంతకా
లముకైనయెన్నాళ్లకైన॥ మాచేతనాతండుమడసినాడిచ్చోట । సొరది
వైకుంఠంబుజూరగొన్నాడు॥ స్థిరముగావైకుంఠపురమునందున్నాడు। వ
గవంగబనిలేదువానికైనీవు॥ హనుమంతుదెలిపినాడతివనీవర్తనలు। బ
హుయోగ్యురాలవనిపలువిధంబులను ॥ మాతోడకలహంబుమానుమ
నినీసుతుని। వారించుటలునాకువాయుజుడుజెప్పె ॥ వనితనీవెంతజెప్పినవి
నకనాతోడ। చలమునయుద్ధముకుజనుదెంచెనతడు॥ కరములుశిరము
లునుకండ్లైకూలెను। తెరిపేమిలేకుండధీరుండపోలె ॥ అతనిభుజబలిమి
యునుఆమహిమశౌర్యంబు। వర్ణింపగాదరమెవసుధనెవ్వరికి ॥ తనుగావు
మనిపల్కుతననోటరాదాయె। యేమిజెప్పుదువానితామసంబెల్ల । దైవ
యత్నంబెవరుతప్పింపగాలేరు । అతనికాయుర్దాయమెంతయున్నదియె॥
ఆయువేమియులేనియతనికైనీవిట్లు। విలపించమర్యాదయిదిగాదుసుమ్మీ॥
నీతికోవిదురాలనీమదినిభావించు। గతమునకుదుఃఖింపగారాదుయెవరు॥
దిక్కులేదనినీవుదీనతనుబొందేవు। బలువుగాశోకింపపనిలేదునీకు॥ నీయొ
క్కబుద్ధికినినీభక్తియుక్తికిని! కలికిరోనామదికికనికరంబొదవె॥ ఇటుమీ
దనీభాగ్యమేమిచెడిపోకుండ। దయమాకుబెనగొనియెతలపులోపలను॥ నీ
పురముచెడకుండనీకుమాయనీసుతుడు। కడుబుద్ధిశాలొకడుకలడంచువిం
టి॥ బాలకుడునిజముగాప్రహ్లాదునింబోలి। హరిభక్తినుండుటయునన్నివే
ళలను॥ వానిపైనాకిపుడువాత్సల్యతయుబొడమె । తప్పకరక్షింతుతరుణి
రోవినవె॥ బాలకునిపైనీకుబహుముద్దుగలుగునట। కట్టింతుపట్నంబుక
రుణనాతనికి॥ ఘనముగాపురముశృంగారంబుగావింతు। వేగనగరికిబొమ్ము
వెలదిరోనీవు॥ అలవిభీషణుబోలియాతండువర్ధిల్లు । మీకెల్లదిక్కనుమి
మ్ముబ్రోచునుగ ॥ బలుగుణవతినీవువిలపింపకిటుమీద । నీలకేతునిజూడు

సీసుతునిరీతి॥ సందేహామికమానిసంతోషమునసీవు। పురముశృంగారింపబొమ్ము వేగముగ॥ అనిరాఘవేశ్వరుడుకనికరంబునబలుక। బలుదుఃఖమ్మంతయునుబాసినాతరుణి॥ సీతామహాదేవిశ్రీరామచంద్రునకు । సాష్టాంగదండములుసమకొల్పెనపుడు॥ ఆవధూవరులచేలతివశలవందుకొని। తనదుఃఖములుబాసెతనకుశీలలాము॥ తనదుకోడళ్లనందరినప్పుడోదార్చి।తనవెంటదోడుకొనితనపురికిజనియె॥ తనపురికినేతెంచితరుణీలలామంబు। దాసీలరప్పించితనసముఖమునకు॥ ఆదినారాయణుండారాఘవేశ్వరుడు। నీలకేతునిబ్రోవనిర్ణయించెనుగ॥ అన్నమాటలుదప్పడాపుణ్యవంతుండు।సత్యవాక్యమురామజగతీవరుండు॥ మనకోర్కెలీడేరుమగువలారామీరు। ఘనముగాపురముశృంగారించిరండి ॥ అనిచిత్రగంధిచయ్యనవారలకుజెప్ప। పురమునలుదిక్కులనుబరగిరాస్త్రీలు॥ గంధకస్తూరికాకర్పూరములుకూర్చి। పన్నీటకల్లాపుబట్టి వేసరిగ ॥ కస్తూరిఘనసారకలితోదకంబులను । అలికిరావేదికలనన్నిదిక్కులను॥ చొక్కాటశేముత్యములుసాగసైనముగ్గులను। ప్రతియింటవేదికలబెట్టిరాస్త్రీలు ॥ పరగవీధులయందుప్రతియింటద్వారముల। పచ్చతోరణములేర్పడగట్టిరపుడు॥ కనకశోభితముగాఘనరత్నమయముగా। పూర్ణవైభవమొప్పిపురముజెన్నొందె॥ ఘుమఘుమారావఘునకొమరొందెపురమెల్ల। పరిమళద్రవ్యసంభరితమార్గమున॥ వీణకిన్నరమురజభేరిమృదంగములు। వరుసమంగళఘోషవాద్యముల్వాలసె॥ పురమిట్లుశృంగారపరిచిదాసీజనము। లావధూమణిజేరిరానందులగుచు॥ అచటరణభూమిలోనారాఘవేశ్వరుడు।ప్రేమవిభీషణునిబిల

### విభీషణుడు శతకంఠునకు అగ్నిసంస్కారము జేయుట.

చియిట్లనియె॥ నీకుపరమజ్ఞాతినిజముగాశతముఖుడు।కొండకై వడినేలగూలియుండెనుగ॥ అగ్నిసంస్కారంబులవినీవుగావించి। కర్మాదిక్రియలన్నికడతేర్చవయ్య॥ నీకుకొమరుండౌనుసీలకేతుడువాని। అధిపతినిజేయించు

యూవట్టణమునకు॥ అనిరాఘవేశ్వరుడుతనతోడబలుకంగ । హస్తములు
జోడించియువిభీషణుడు॥ అఖిలేశమీశలవుకడ్డు జెప్పగజాల। గానినామ
నివాకటిగలదుచెప్పెదను॥ అఖిలలోకంబులకునాపదలుగావించు। బలు
దురాత్ముడువీడుపరమద్రోహుండు॥ అగ్నిసంస్కారములకర్హనీయుడుగా
డు। కర్మాదిక్రియలేలకదుదురాత్మునకు ॥ ఎట్టిసోదరుడునాకీదుష్టచరితుం
డు। పరమచండాలుండుబలుపాతకుండు॥ దానవుంకొలుదునాతలద్రుంచ
నోయునుచు। తారకాచలగువాలదాగినేనుందు॥ వీనిమార్గములెల్లవిశ్వ
సించకపోతె । పరమశత్రువుడునాపాలింటవీడు ॥ నిన్నయుద్ధములోనున
న్నుబడగూల్చెను। పరమాత్మనీకరుణబ్రతికితినినేను ॥ కర్మాదిక్రియలన్ని
గావించుటకునాకు । అర్హనీయుడుగాడుఅఖిలేశవీడు ॥ అగ్నిసంస్కారం
బులనురునకుజేయంగ। మనసుపుట్టదునాకుమానవేశ్వరుడ॥ శత్రువునకు
నుయగ్నిసంస్కారములుజేయ। కలవిచ్చెదరునాకుజానకీరమణ ॥ అనివి
భీషణుడిట్లుతనతోడబలుకంగ। సర్వజ్ఞడారామచంద్రుడిట్లనియె॥ ఓవిభీ
షణనీవ్రుడూహించునీమదిని। శతముఖుడునాచేతసమరమునగూలె॥ మా
చేతశతముఖుడుమడయుచుండంబున। కడతేరెనాతనికికలుషజాలములు॥
పాపములనెడబాసిపరమపుణ్యుండయ్యె । దనుజుదోషములెన్నబనిలేదు
యికను॥ అనివీనులకుగల్గునమరవైకుంఠంబు । అదిగాకమాచేతసణగశ
తముఖుడు॥ వైకుంఠవాసుడైవర్తిల్లెనిజముగా । నతడుపుణ్యుండయ్యెనతి
సుకృతమబ్బె॥ అతనుదుశ్చేష్టుడైనపాపుడైనను। జ్ఞాతిగాడానీకుకర్మం
బుసలుప॥ దిక్కుమాలినవానితెరవుగాశతముఖుని। విడిచిపెట్టగరాదువీ
రరణమునను॥ నీలకేతుండుపసిబాలకుడుధీయేకర్మ। చేయుటెరుగడుయత
నిచేతగాదేమి॥ అతనికిపినతండ్రివితనికితమ్ముడవు। నీవుదప్పనటింపనిందవ
చ్చునుగ॥ ఇతడుసామాన్యుడాయెల్లలోకములందు। నేకచక్రత్వమునవే
లియున్నాడు॥కూలినాడనివానికొంచింపగాతగదు। ఇలజయాపజయంబు

లెవ్వరికిగలవు॥ ఘనముగానీతనికిఁగర్మాదిక్రియలన్ని। గావించుటకునీకుఁగ
ర్తవ్యమొదవు॥ సంశయింపకనీవుజని వేగయాతనికి। కర్మాదిక్రియలన్ని గా
వించవయ్య॥ అనిరాఘవేశ్వరుడుతనకిట్లుజెప్పంగ। మారుజగదీశునకు మ
రిజెప్పలేక॥ భవదాజ్ఞతప్పనాతలచాలునాయనుచు। నతనియాజ్ఞాబద్ధ
డై విభీషణుడు॥ మాల్యవంతప్రముఖమంత్రికోవిదులొప్ప। జనెవిభీషణు
డుశతకంధరునిదరికి॥ మేనువిస్తారముగమేరుశైలమురీతి। ఘోరాంగు
డై ధాత్రిగూలియుండెనుగ॥ అతనిగొనిపోవంగనసురవీరులబిలచి। కనక
శిబికొకటితాగట్టించుమనియె॥ నవరత్నజాలములునలుదిశలజెన్నొంద।
చెలువైనబంగారుశిబికగట్టిరిగ॥ తూర్యనాదములెల్లతోడిబడుచుమ్రో
యంగ। శాస్త్రిచోదితవిప్రజనములేతేర॥ శిబికపైశతముఖునిజేర్చిదను
జావళులు। గొనిపోయిరాశిబికకొంతదూరముకు॥ కొంతదూరంబునకు
గొనిపోయియచ్చోట। నిలిపిశాస్త్రిక్రియానిర్ణయంబునను॥ బ్రాహ్మణో
త్తములుమంత్రములుచ్చరింపంగ। కర్మాదిక్రియలన్ని గావించిరపుడు॥ గం
ధపుష్పులు దెచ్చిగగనంబుపొడవుగా। జితిబేర్చిశతముఖునిజేర్చిరందున
ను॥ అనలంబుసమకొల్పిరాకాష్టమంతయును। వినువీధినంటంగ పెనుమం
టలెగసె॥ శతకంఠుదేహంబుసర్వంబుసాంగమై। దందహ్యమానమైతగ
మంటగలసె॥ అచ్చోటవీడుకొనిఆవిభీషణుడపుడు। సరయూనదీయందు
స్నానములుజేసె॥ వచ్చిశ్రీరాములకువందనంబులుజేసి। కడుభక్తివిన
రంగఘనవిభీషణుడు॥ కడుమోదమునబల్కెఘనుడుశ్రీరాములతో। శ
లవుప్రకారంబుశతకంఠునకును॥ పరలోకకర్మనేభక్తితోజరిగిస్తి। పర
మాత్మనేజేయుపనిశలవులిమ్ము॥ అనినలక్ష్మణుతోడనారాఘవేంద్రుండు।
రావోయితమ్ముడారమ్మివేగమున॥ నీవువిభీషణుడునెమ్మితోడప్రతాపు। లం
కాపురముకేగిలావణ్యముగను॥ నీలకేతుండనెడిబాలునకువేగమున। ఘ
నతకోపట్నంబుగట్టిరండిటకు॥ అనిరాముబలుకంగనతనిశెలవందుకొని।

లక్ష్మణవిభీషణులుతక్షణంబునను॥ పొంకమైనప్రతాపలంకాపురముకేగి। కెల్లరాక్షసవర్గముల్లాసమొంద॥ అలకాపురముకంటెనమరావతియుకంటె। నందమైవిలసిల్లెనామహాపురము॥ వెలయనగరముచుట్టువినువీధినంటుచును। గలవుతొమ్మిదికోట లెలమిబొందుచును॥

## నీలకేతను పట్టాభిషేకము.

పదహారువన్నె మేల్పసిడికాంతులువెలయ। భాసిల్లుచునునవప్రాకారములును॥ తారాపథంబంటితళతళల్మీరుచును। మేలైనబంగారుమేడలునుగలవు॥ ఘనరథంబులుగంధకరితురంగంబులును। బరిఢవింపుచునుండెపురమునిండగను॥ ఏదిక్కుజూచినా యేవీధిజూచినా। హేమమయమైయుండెనెల్లచోటులను॥ కడువింతపురమెల్లగనివిభీషణుగూడి। ఆస్థానమునకేగెనపుడులక్ష్మణుడు॥ ఆస్థానమునకేగిఅచ్చటికిబాలకుని। కడువేగదెప్పించికరుణమీరగను॥ వెలయనానాతీర్థములుపుణ్యజలములను। అసురవీరులబంపిఅపుడుదెప్పించి॥ పుణ్యజలములుయిట్లుపాలుపారదెప్పించి। అఖిలభూసురగణములాశీర్వచింప ॥ మణికనకమంటపముమధ్యసంతోషమున। భద్రమంటపముపైబాలున్నిజేర్చి॥ ఘనతూర్యనాదములుకడువింతరంజిల్ల । పంచమహావాద్యములుమించిమ్రోయగను ॥ సకలజనములుచాలసంతోషమునుబొంద । సూతమాగధులెల్లస్తుతులుజేయగను॥ నీలకేతుడుసార్వకాలంబువర్ధిల్ల । నభిషేకమొనరించిరాపుణ్యవరులు ॥ అష్టదిక్పాలకులునమరాదిదేవతలు। జలనిధులుకూర్మంబుచంద్రభాస్కరులు॥ యుగములోరాముకథయున్నంతకాలంబు। వర్ధిల్లుమనుచుదీవనలిచ్చిరపుడు॥ అతులప్రతాపలంకాపట్టణేశుడై । నీలకేతుడువెలసెనిఖిలభాగ్యమున॥ పురవాసులందరునుపరమసంతోషమున । నెలమిబొందిరికోర్కెలీడేరెననుచు॥ అంతఃపురములోపలాచిత్రగంధియును । తనదుకోడళ్లంతతనివినుండిరిగ॥ తనకుపట్టముగట్టిరనినీలకేతుండు। సంతోష

మునుభూందేచాలగానపుడు॥ రామానుజుండైనలక్ష్మణవీరునకు। సాష్టాం
గదండములుసమకొల్పెనపుడు॥ శాశ్వతంబుగవిభీషణుబోలివర్ధిల్లు। మని
దీవనలునిచ్చెఘనుడులక్ష్మణుడు ॥ పినతండ్రియగువిభీషణునకుమ్రొక్కుం
గ। నతడుదీవించెదీర్ఘాయువులుగలుగ॥ అంతఃపురముకేగిఅవ్వగారికిమ్రొ
క్కి। తల్లులందరికితాతగుమ్రొక్కులిడియె॥ దేవులందరుగూడిదీవనలుగా
వించి। ఆరాముపదభక్తిఅతనికినిగలుగ॥ పట్టణాధీశుడై బాలుండువెలసె
నని। పతిబాయుదుఃఖములుబాసిరందరును ॥ నీలకేతనుడపుడునీరజాక్షు
నిపాద। దర్శనముగావింపదలచెవేడుకను॥ మాణిక్యములుమంచిమౌక్తి
కహారములు। కనకనిర్మితమైనమణిభూషణములు ॥ పసిడివస్త్రంబులు
నుపట్టుపీతాంబరములు। పరిమళద్రవ్యసంభరితజాలములు ॥ ఘనవస్తుజా
లములుకానుకలుగాగొనుచు ! తనయీడుబాలకులుతనవెంటగొలువ॥

నీలకేతనుడు రాముని స్తుతిసేయుట.



భానుకులదీపకునిపదదర్శనముజేయ। బాలకుడుజనుదెంచె పాదచారగు
-చు॥ అల్లంతదూరముననఖిలేశుబొడగాంచి। నేత్రపర్వంబొందినీలకేత
నుడు॥ పాణితలములురెండుఫాలమునజేర్చుకొని। పాహిరామప్రభోపర

మూర్త్యయనుచు॥ తానుదెచ్చినయట్టికానుకలుదగినుంచి। పాదారవింద
ములబడిమ్రొక్కులిడిరి॥ పలుమారుమ్రొక్కులిడిబత్తిజొత్తిల్లంగ।బా
లుండువినుతించెబహువిధంబులను ॥ శ్రీభానుకులసోమ సింధుగర్వవిరా
మ। సరససద్గుణధామసంగ్రామభీమ ॥ నీతత్త్వమహిమంబునీమహాచరితం
బు। వర్ణింపవశమానవసుధ నెవ్వరికి॥ నీవుచిద్రూపమైనీవుపెంజీకటై।నీవు
సమస్తమైనెగడుచుందువుగ॥ నిఖిలభువనంబులును నీకుక్షిలోనుండు। నీవు
లోకంబులనునిండియుందువుగ ॥ విశ్వంబునకునీకువేరులేదేమియును । వి
శ్వసాక్షివినీవువిశ్వమూర్తివిగ ॥ నినుదలంచినవాడునినుభజించినవాడు।
పుణ్యుండుభవ్యుండుపుండరీకాక్ష ॥ సర్వభువనంబులునుసప్తసంద్రంబులు
ను। గౌతమిజాహ్నవీకావేరినదులు ॥ జంతుజాలంబులునుశైలసంఘంబు
లును। పక్షిజాతంబులునుపన్నగంబులును॥ గీర్వాణయక్షులునుకిన్నరులు
సిద్ధులును। అష్టదిక్పాలకులుఅమరాదిసురలు॥ నరవానరులునిశాచరవం
శవర్గములు। నారదాదిమునీంద్రతాపసోత్తములు ॥ సర్వప్రపంచములు
సర్వమంత్రార్థములు। సకలభూతపిశాచసంఘాతములును ॥ ద్వాదశాది
త్యులునుతగయష్టవసువులును । జలజాతసంభవులు చంద్రభాస్కరులు॥
గ్రహతారకంబులునుగగనంబుధరణియును। సప్తమహారుషులుసకలజం
తువులు॥ కొమరుమిగులనంతకోటిబ్రహ్మాండంబు। లన్నినీకుక్షియందమ
రియుండెనుగ॥ పరమయోగులయందుభక్తకోటులయందు । నెడబాయ
కుండేవుయేవేళనీవు ॥ అజ్ఞానబంధంబుల బాయగాలేక । నీమహాతత్త్వం
బునిజమెఱుంగరుగ॥ పరతత్త్వమార్గంబుపరికింపగాలేక । ఇలలోనుజన్మం
బులెత్తవలసెనుగ॥ మూఢజన్మములెత్తిమోసబుద్ధులుదలచి। జీవకోటు
లుయమునిజెందవలసెనుగ॥ మిమ్మునెరిగినవాడుమిమ్ముగొలచినవాడు।యు
మునిపురికెన్నటికియేగబనిలేదు॥ అపరాధినైననాయందుకృపజేసితిరి। క
నికరంబాదవిరోకమలలోచనుడ ॥ నాతపంబులుపండెనాకోరికలునిం

డు। నీపాదదర్శనమునేడుప్రాప్తించె॥ పరసుఖునుమునుసోకిబంగారమైన
ట్లు॥ పరమాత్మనాజన్మపావనంబయ్యె॥ ఎంతపుణ్యుండనో యెంతధన్యుం
డనో। కలిగెమీపదపద్మకరుణనాయందు॥ నీవుమానవుడనుచునిజమెరుం
గగలేక। పలికిచెడిపోదురిలపాపిష్టిజనులు॥ దుష్టులనుదునుమాడశిష్టులను
కాపాడ।అవతారమెత్తినావయ్యసర్వేశ॥నీదుహృదయము బ్రహ్మనీజిహ్వ
భారతీ। నీసత్యవాక్యములునిఖిలవేదములు॥ నీశిరముగగనంబునీరోమము
నలుండు। నీనేత్రయుగ్మంబుయిందుభాస్కరులు॥ నీదుచూపులుదివమునీ
హస్తములుదిశలు।దనరంగనీప్రసాదముసుధావార్ధి॥పవనుడుశ్వాసంబుప
దతలంబులుధరణి।నీరోమసంఘములునిర్ఝరావళులు॥ నీశయ్యశేషుండునీ
సఖుండీశ్వరుడు। నీమూర్తిభువనములునీవెసర్వంబు॥ మత్స్యమైయంబోధి
జొచ్చిసోమకుద్రుంచి। పరమాత్మ వేదములుబ్రహ్మకిచ్చితివి ॥ కూర్మావ
తారమైకొండవీపునదాల్చి।అమృతమిచ్చితివీవుయమరకోటులకు॥ వారా
హరూపంబువసునతో ధరియించి। కనకాక్షుజంపితివికమలాక్షనీవు॥ కంబ
మునసుదయించికనకకశిపునిగూల్చి । ప్రహ్లాదుగాచితివి పరమాత్మనీవు॥
అవనిమూడడుగులిమ్మనిబలీంద్రునివేడి । బలినిగెల్చితివోయిపరమాత్మనీ
వు॥ పరశురాముండవై ధరణీశులనుబట్టి। దురముజేసితివిగాయిరువదొక
మారు॥ దశరథమహారాజతనయుడవై బుట్టి। దశకంఠుగూల్చితివిధరణీశ
నీవు॥ శరణుజేరినవిభీషణునకభయంబొసగి । పరగలంకారాజ్యపదవిచ్చి
నావు॥ నాతండ్రిశతముఖునినాతిసీతాదేవి । చేతగూల్పించితివిసిద్ధముగ
నీవు ॥ రిపునిపుత్రుడనన్నపరాధమెన్నకను । కఠినముంచకనన్నుకరుణ
జూచితివి॥ నాపై నికరుణించినన్నురక్షించితివి ॥ రాజ్యములకన్నిటికిరా
జుజేసితివి॥ శతకంఠసుతుడననిసందేహముంచకను । రక్షించితివినన్నున
క్షయంబుగను॥ క్షమునిగతినన్నుకృపజూచిప్రోచితివి । దీనరక్షకుడవై
దేవసర్వేశ॥ నాతండ్రిక్రూరుడనినీతలప్రనుంచకను। నన్నురక్షించితివినా

రాయణుండు॥ అనివేయిసాష్టాంగములుసమర్పించంగ। నీలకేతునిజూచి నీలవర్ణుఁడు। అతనిబుద్ధికిమెచ్చిఅత్యంతకృపజూచి। బాలునకుఁ నజే



నీలకేతుఁడనీవునిజమార్గశీలుఁడవు। సంతోషమయ్యెనీసద్గుణంబుల కు॥ నీవుయోగ్యుఁడవంచునిర్ణయించినమాట। తప్పకుండగమాకుదాఖలాపడెను॥ జనకుండుగూలెననిశంకయార్థంబేమి। నీబుద్ధినుంచకుమినీలకేతనుఁడ॥ దేవమానులబాధగావించునేవేళ। కడుపాపచిత్తుండుకఠినమానసుఁడు॥ భూభారమణఁగుటకుపారివుచ్చితిమివాని। సకలలోకంబులకుసంతోషమయ్యె॥ ఇసుకలోబంగారమొలమిబుట్టినరీతి। బురదలోపద్మంబు బుట్టుచందమున॥ ఆలచిప్పనుముత్తియంబుబుట్టినరీతి। మణికరపరాళ్లందుజనియించురీతి॥ కడుపాపకర్మకునిగర్భవాసమునందు। నీవుజన్మించితివి

నీలకేతనుడ॥ వానివంశముకెల్లవన్నెనీవుదెచ్చితివి॥ తలపంగరాక్షసకుల
శిరోమణివి॥ అవ్విభీషణుబోలియివ్వసుధనుప్రతాప। లంకాపురంబునకు
రాజవై యుండి॥ చంద్రతారార్కముగసర్వజనులునుమెచ్చ। క్రమము
గారాజరికమ్మేలుకొమ్ము ॥ మమువిలోకింపుచునుమముభక్తిదలపుచును।
వర్ధిల్లుమీలోకవైభవంబునను॥ అరయనేదలపంగనయోధ్యాధ్యపురిరమ్ము।
అవిభీషణురీతినాదరించెదను ॥ కాంతామణీచిత్రగంధియనుమతముగా।
నీవువర్తించుమీనీలకేతనుడ॥ నీతంద్రిశతముఖుడునెలతమాటలువినక।
మాతోటిపోరాడిమహినిగూలెనుగ ॥ కాంతముందరిలనాగతమెరుంగు
నుయామె। నీతికోవిదురాలునీయవ్వగారు॥ అతిబుద్ధిశాలినీయవ్వజెప్పిన
రీతి। మనులుమీకలనైనమాగుజెప్పకుమీ॥ తల్లికంటెభువినిదైవంబుమ
రిలేదు। తల్లియాజ్ఞకునీవుతప్పకనుయుండు ॥ పరిపాలనములోనపాపంబు
లేకుండ। సత్యశీలుండవై జగమేలుకొనుము॥ ధర్మమార్గములెల్లతగనీకు
దెలుసును। నీతికోవిదుడవునిర్మలుండవుగా॥ కొడుకులిద్దరుమాకుకొదువ
మాడవవాడ। వీవుగాభావింతుమెపుడుమామదిని ॥ దేవబ్రాహ్మణభక్తి
భావమునమరువకను। దయతోడగూడుకొనిధరణిపాలించు॥ అరయమా
ర్కండేయుయాయువనువర్ధిల్లి। భోగభాగ్యంబులనుభువినివర్ధిల్లు॥ సంతో
షముననీవుజనునీపురంబునకు। జనసంఘములకూలుటకుసంశయముపడకు॥ధ
ర్మంబునాల్గుపాదములవర్తిల్లంగ। నేలుకోలోకంబులెలమిబొందుచును॥
అనిరాఘవేశ్వరుండసురవల్లభసుతుని। జనుమనుచుశలవిచ్చె సంతోష
మునను॥ బాలకడురఘురాముపదయుగంబులవ్రాలి। ముమ్మాఱుశలవం
దిమోదాత్ముడగుచు॥ పరమసంతోషసంభరితచిత్తుండగుచు। తనపురం
బునకేగెదనుజేశసుతుడు॥ దశరథరాముండుదయజూచువిధమెల్ల। తన
యవ్వతోజెప్పితావినోందుచును॥ ధర్మంబునాల్గుపాదములుదప్పకయుం
డ। నేలెతనరాజ్యంబునీలకేతనుడు॥ పురవాసులందరునుపరమవేడుకనొం

ద॥ పురమునకరాఘవునివరవందనుండు॥ శతకంఠుపుత్రునిగతిపంతసిల జేసి॥
రఘురామచంద్రుండుమిగుల వేడుకను॥ మనముసంతసమందిహనుమంతు
నించిలచి॥ ప్రేమతోదుతబలికె రామభూవరుడు॥

ఆంజనేయుఁ తోకచే సముద్రములుదాటుట.



అంజనీనందనా అసమానవిక్రమ । శౌర్యధురంధరా జగదేకవీర ॥
కార్యసఫలంబాయె కదుజయంబులుగలిగె। మనమువచ్చినపనులుమాట
దక్కనుగ॥ అఖిలలోకంబులకానందకరమాయె। తేటతెల్లంబాయె
నూటిమీరగను॥ తిరిగిమనమయోధ్యపురమునకు జనవలెను। యిచ్చో
టనుండువనులేవు లేవికను॥ అనుచుశ్రీరఘువరుడుతవతోడబలుకంగ। పర
మసంతోషమునపవననందనుడు॥ భానుకులుడగురాముపదములకుప్రణ
మిల్లి। తనమహోన్నతరూపుదాల్చెహనుమంతు ॥ కమలబంధుదుబోద్దు
ఘుంటరాయెవిలసిల్లె। మొలపూసలగుచుచుక్కలుచుట్టువెలసె ॥ అఖిలలో

కంబులకుసానందముప్పొంగ। పెరిగెబ్రహ్మాండములుపిక్కటిల్లగను॥తన
దీర్ఘవాలంబుతగనాల్గువారధులు । దాటిపోవగ బెంచె మేటియావమున॥
వారధులనాల్గిటినివక్కమారేదాట । తనవాలమమరించెతుచరవరుం
డు॥ నాల్గులక్షలయోజనములపొడవునుగలిగి। నిలువునూరామడై వెడలె
వాలంబు॥ అట్లువాలముబెంచిఅంజనీనందనుడు । పంకజాక్షునితోడపలి
కెమోదమున॥ సకలలోకేశ్వరాజానకీనాయకా। దీనసంరక్షణాదేవాధి
దేవ॥ నాలుగుసంద్రములునయముగాదాటంగ। బరపితిేవాలంబుభవదీ
యకృపను॥ సకలసేనలుమీరుసంతోషముప్పొంగ । వాలంబుపై నడువ
వచ్చురఘువర్య॥ సకలసేనలుమీరుజనినపిమ్మటనేను । వొక్కలఘువున
దాటివత్తునేబలికె॥ భవదీయకృపనాకుప్రాప్తమైయుండంగ । యీవా
రధులుదాటయెంతపనినాకు ॥ మరిమరియువారగులుమనకడ్డుగాకుండ।
అంతటికినావాలమమరించితిపుడు ॥ జగదేకనాయకాజనుడెండుమీరను
చు। పలికెహనుమంతుండుపరమభక్తిగను॥ హనుమంతువాక్యములకా
నందభరితుడై। శ్రీరామచంద్రుండుసీతతోననియె ॥ మగువరోహనుమం
తుమహిమప్రభావంబు। కంటివామనకిట్టిఘనుడెందుగలడు॥ ఇతడజేయుం
డగుచునెల్లలోకంబులకు। యీశ్వరసమానుండుయీమహాత్ముండు॥ ఇత
నిమహిమలనెంచనెవ్వరితరమౌను । బలపరాక్రమశాలిభవ్యమానసుడు॥
ఈసంగరాంబుధికినితడొక్కనావగా।మనకుసాహాయంబుగనపరుచుచుం
డు॥ పవనతనయుడువంటిబలపరాక్రమశాలి। యీరేడులోకములనెంచి
ననుగలడ॥ ఎన్నివిధములనైననీమహాత్మునిఋణము। తెరువతోమనమిక
నుదీర్పజాలముగ॥ వర్ధిల్లుమనుచుదీవనలీయవలెగాని । యేమియిచ్చినదీ
రుసీమహానిఋణము॥ అనికాంతచెయికేలనమరించిముందుగా॥నడచెవా
లముపై నినారాయణుండు ॥ తోరంబుగాబ్రహ్మాగెతూర్యాదినాదములు।
వనచరులుజయజయధ్వనులుజేసిరిగ॥ ఆరాఘవులవెనుకయాలక్ష్మణస్వా

ఊ॥ భరతశత్రుఘ్నులునుబారుగానడువ॥ లవకుశులునుమరియులావణ్య
మొప్పంగ। విజయుడువిభీషణుడువెనుకనడచిరిగ ॥ చప్పన్నదేశాధిజనవ
రులుయావత్తు। నడచిరావెనుకనానందములువెలయ ॥ వానరభల్లూక
మానవదానవ। బలములన్నియువెంటబలసినడచిరిగ ॥ రథతురంగంబు
లునురాణించుగజములును। వేలసంఖ్యలుకోట్లువెంటనడచెనుగ॥ చాల
సంతోషమునశతకంఠుయుద్ధంబు । చెప్పుకొనుచునునడచెశ్రీరాముబల
ము॥ సౌమిత్రియునుభరతశత్రుఘ్నముఖ్యులును। సీతయుద్ధపుమహిమచె
ప్పుకొనినడచె ॥ లవకుశాఖ్యులుతల్లిలాలిత్యమంతయును । బాగడుచును
సంతసముబొందినడచిరిగ॥విజయుడుదేవారివీరులుయావత్తు।సీతయుద్ధము
లెంచిచెప్పుకొనినడచె ॥ అంగదసుగ్రీవఅలవిభీషణులెల్ల । సీతపరాక్రమ
ముచెప్పుకొనినడచె॥ సీతగనిసీవల్లజెలగెప్రఖ్యాతులని। కడుపెద్దకూరంజిల్ల
నడచెరాఘవుడు॥ సకలజనములువెంటజనుదేరహనుమంతు । వాలంబు
పైనడచెవనజలోచనుడు॥ వాలంబుపైనడచివారధులునాలుగును। దా
టెనవలీలగాదాశరథులప్పుడు ॥ తమ్ములునుపుత్రులునుతనపౌత్రులునుహి
తులు। తనవెంటనడువగాదర్లెరఘువరుడు ॥ సకలబలములువెంటజనుదే
రరాఘవులు । నయమొప్పగాదాటెనాల్గువారధులు॥ సురదధిక్షీరఘృ
తశరధులన్నియుదాటి। వాలంబుదిగినిలిచెవనజలోచనుడు ॥ వనజలో
చనుగూడివచ్చిరాభరతాది । సోదరులకౌశలవసుతులుపౌత్రులును॥ స
కలరాజన్యులునుసకలదానవభటులు । భల్లూకవనచర బలములన్నియు
ను॥ వాలంబుదిగివచ్చివనజనాభునిచుట్టు । వేలాముదీర్చిరావీరులందరు
ను॥ సకలసేనలమధ్యజానకీరమణుండు । చుక్కలలోచంద్రుసొబగుగా
నుండె॥ తనతోకపైసేనతర్లిపోవుటజూచి । ఆనందుడైపొంగెనంజనీసు
తుడు ॥ అవలీలతనవాలమంతకూడగదీసి । తనలోనుతనమహిమదలచు
కొనినవ్వె॥ అసమానబలశాలిఅంబుధులునాలుగును । సొక్కలఘువుగ

దాటనూహించెనపుడు॥ ఆసమీపముగల్గునట్టిశైలంబెక్కి। అంబరము
పొడవుగాహనుమంతునిలచె ॥ సరిపాదములునిల్చిచాలతనమొగమెత్తి।
సింహనాదముజేసెశ్రీరాముబంటు॥ వాలమొయ్యనద్రిప్పివడినిమోముబి
గించి। బాహులొయ్యననూపెపవననందనుడు ॥ ఒడలూపిలంఘించివా
రధులునాలుగును। మిడివింటమంటుండమీటుచందమున॥ లంఘించిహ
నుమంతులావణ్యవంతుడై। నాకవాసులుమెచ్చనాల్గువారధులు ॥ సొర
దిరెక్కలుగలుగుసురపర్వతమురీతి। నెగసెనాలుగువార్ధులేకముగదా
టె॥ చతురువారధులొక్కక్షణములోలంఘించి। వచ్చిశ్రీరాములకువం
దనముజేసి॥ వారధులులంఘించివచ్చినిలచినయట్టి। అంజనీసుతుజూచె
నారాఘవుండు॥ అలసటలుదీరంగహనుమంతయొకచోట। గురుతరము
మీరంగగూర్చుండవయ్య ॥ అనిరామవిభుపాలు డనుజలొప్పగగొల్వ।
పదిలముగగూర్చుండెభద్రపీఠమున॥శతకంఠుపురినుంచిసాకేతనగరంబు।
యినకులాధీశ్వరుండేగెంచెనపుడు ॥ అతనిగనుగొనవచ్చిరఖిలమునివరు

మునులు రాముని గాంచుట.



లెల్ల। జడలుతూలాడంగసన్నద్ధులగుచు ॥ జనుదెంచుమునివరులగనిప్రే
మరంజిల్ల। దండములుగావించెదాశరథులపుడు ॥ దండములుగావించ

నిండు వేడుకనొంది। దీవనలుగావించిధీరులిట్లనిరి॥ అఖిలకంటకుడైన ఆ
రావణునిద్రుంచి। జగముసంతోషింపజేసితివిముందు॥ ఇపుడుశతకంధరు
నియుంతిసీతాదేవి! చేతగూల్పించితివిశ్రీరామచంద్ర॥ కంటకులిద్దరును
గడతేరెమాకెల్ల। సేమమైయున్నదీజగతిలోపలను॥ ఇంకమాకాపదలు
యేకాలముకులేవు। కంటకులిద్దరునుమంటగలసిరిగ॥ అఖిలలోకంబుల
కునానందకరమాయె। తేటతెల్లంబయ్యెదిక్కులన్నియును॥ కొదువలేది
కమాకుసదయమీధర్మమున। సకలబాధలణంగెసంతోషమొదవె॥ అని
రాఘవునిబొగడిఆసీతబాడగాంచి। మునివరానీకములుముదమునిట్లనిరి॥
ఓతల్లిజానకీఓలోకములమాత। ఘనతరక్షించితివికమలాక్షినీవు॥ దశరథ
రాముండుదశకంఠుదునుమాడె। శతకంధరునినీవుహతముజేసితివి॥ కడు
దీక్షతోలోకకంటకులనిద్దరి। సతిపతులుమీరొక్కసరణిజంపితిరి॥ మీ
మహిమదెల్పంగమిమ్మువర్ణింపంగ। అనలచతుర్ముఖబ్రహ్మకైనశక్యంబా॥
అఖిలమునిగణములకునభయమిచ్చినయట్టి। మాటదక్కెనదయ్యావమా
నీంద్రులార॥ శతకంఠుతోమేముసమరంబుజేయుటకు। అరుగుసమయ
మునందుఅమరులందరును॥ క్షుధతృష్ణబాధలునుబాదవిరాకుండంగ। వ
రములిచ్చిరిసురలుయొక్కయేడాది॥ వరమునిన్నటితోటివాయిదాకడ
తేరె। బలములకుయేడాదిపరిపూర్ణమయ్యె॥ ఎల్లబలములక్షుడీవేళక్షు
ద్బాధ। ఆరంభమైయున్నదయ్యామునులార॥ ఇష్టసిద్ధిగసేనలెల్లభక్షింపం
గ। కామధేనువవచ్చిగావించవలెను॥ తాపసోత్తములారదయజూడవలె
నంచు। మరిమరియుపల్కెనామనుజనాథుండు॥ మనుజవరుండాడుమాట
లకుమునులెల్ల। సమ్మదంబునుబొందిసంతోషపడిరి॥ సంతోషమునుబొం
దిసకలమునివరులప్పు। డమరావతీనగరుకరుగుదెంచిరిగ॥ స్వర్గలోకంబు
నకుజనినమునులనుజూచి। పరమసంతోషమునపాకశాసనుడు॥ దండప్ర
ణామములునిండారగాజేసి। అర్ఘ్యపాద్యాదివిధులనుపూజజేయు॥ సంతు

ష్టచిత్తులై సన్మునీశ్వరులెల్ల। వేయికన్నులుగలవేల్పుకిట్లనిరి ॥ జగముసం
తోషింపశతకంఠుబరిమార్చి। సీతామహాలక్ష్మిశ్రీరామమూర్తి॥ తిరిగినే
డయోధ్యాపురవాసులైనారు । బలములన్నియుగొల్వఁబ్రౌఢిమీరగను॥
బలములన్నియుగుడువతలఁచుజేసెనునేడు । దశరథరాముండుదయబెనం
గొనగ॥ వర్షధారలనుసంబరవీధిచుక్కలను। యిసుకనైననులెక్కనెన్న
గావచ్చు ॥ ఆట్టిబలములకెల్లఆరామచంద్రుండు। భక్ష్యాన్నములుజేయ
భావమునదలచె॥ పాకంబుజేయనేబలులశక్యంబౌను । వర్ణింపఁగానవరివ
శముదేవేంద్ర॥ కరుణించినీవునీకామధేనువనిచ్చి। బలములనుసంతృప్తి
పరచంగవలెను ॥ ఆబలంబులకెల్లహారములుసమకూర్ప । కామధేనువ
గాకకలదెయొండైన॥ పరమాత్ముడగురామభద్రునికిప్రీతిగా। కరుణింపవ
య్యనీకామధేనువను॥ తిరిగిరేపటిరోజువరకునీధేనువను। నీపురికిపంపెద
మునిర్జరాధిపుడ ॥ అనిరుషులువేడంగనపుడుదేవేంద్రుండు । మోదాత్ము
డై సర్వమునులకిట్లనియె॥ బలములాకలిదీర్పపరమవేడుకనాకు । స్వామి
కార్యముసకలసంతోషకరము॥

ఆలస్యమేలనాయడ్డమేమియులేదు। ధేనువునుగొనిపొండిఋషీం
ద్రులార॥ అని వేలుపులగిడ్డినమరాధిపుండిచ్చె। పరమర్షిగణములకుభక్తి
తోడుతను॥ రాముకార్యంబెల్లరంజిల్లజేతునని । వెడలెసంతోషమునవే
లుపులగిడ్డి॥ వేలుపులయెల్లావువెనువెంటదోడుకొని। స్వామిసన్నిధికేగిరా
మహాఋషులు॥ పరమాత్మమేమంతభవదాజ్ఞతలనుంచి। ఘనముగాదె
స్తిమిటుకామధేనువను॥ బలములందరికిఫుడుపరితృప్తిగాజేసి । షడ్రసా
న్నములెల్లజరిగించవచ్చు॥ సెలవుమాకొసగుమాజానకీనాయకా । అని
రామువినుతించెనఖిలమునివరులు ॥ వినుతించిరామభూవరునిశెలవందు
కొని। తమతమాశ్రమములకుతర్లిరామునులు॥ కరుణమీరగవిశ్వకర్మను
బిలిపించి। పలికెనాతనితోడపరమాత్ముడపుడు ॥ బలములన్నియుపంచభ

## కామధేనువు సకలసేనల సంతృప్తుల జేయుట.





తుష్ట్యన్నములుగుడువ। నఖిలబలములకునీడమరియుండుటకు ॥ పదినూర్లు
యామడబారుగాపందిళ్లు। వినువీథినంటంగ వేయించుమనెను॥ పల్లవంబు
లువింతపరిఢవింపగజేసి। యెండగనరాకుంతనెల్లదిక్కులను ॥ నింగిము
ట్టునపాడవునిల్పవెయ్యామడ। కల్పించెపందిరలుకనులపండువుగ ॥ బల
ములన్నిటినవుడుపంక్తిగానుండుడని చాటించెనావేళజానకీవరుడు॥ జా
నకీవరుశలవుసంతోషమునబొంది। బంతులేసాగిరిబలములన్నియును॥ అ
న్నిపంక్తులనడుమనావేలుపులగిడ్డి। నిలిచిబలములగాంచిపలికెనిటులవు

డు॥ శ్రీరాఘవేశ్వరునిసేనలారామీరు। అతిక్షుధాతురులగుచుఅంతయు
న్నారు॥ మీక్షుధలుతీరంగమీరుభుజియింపవలె। నిష్టాన్నములుగోరు
డింపుమీరగను॥ అనిపంక్తిపంక్తులనునావేలుపులగిడ్డికడుప్రీతిరంజిల్లన
డువంగదొరణగ॥ వెలిమొదవనడువంగవెంటనేసిద్ధించె। ఘనబలంబులకె
ల్లకామితార్థములు॥ కోరినపదార్థములుకొరతలేకుండంగ। వెలయబల
ములకెల్లవిస్తళ్లనిండె॥ అనుభవించేవస్తువలుకొరతలేకుండ। గలిగెబల
ములకెల్లకామించినట్లు॥ సంతోషములువెలయసకలసేనావళులు। ఆర
గింపులుజేసిరానందమునను॥ ఇట్లుసర్వబలంబులేపారభుజియించి। కరత
లంబులునీళ్లగడిగిరందరును॥ సురభికర్పూరాదిపరిమళద్రవ్యములు। అఖి
లబలములమేననలరించెనపుడు॥ అపరంజిమణితోడవులఘనముగఒప్పిం
చి। బలములన్నిటికిచ్చెపరమాత్ముడపుడు॥ సకలబలములన్నిట్లుసంతోష
మొసరించి। గౌరవంబులుజేసెకమలనాభుండు॥ సేనలన్నిటికినిసెలవిచ్చె
నవ్వేళ। సంతోషభరితుడై శ్రీరాములపుడు॥ రామచంద్రుండంతలక్ష్మ
ణుండాదిగా। తమ్ములుబాంధవులుతగినమంత్రులును॥ పుత్రులుపౌత్రులు
నుపురజనంబేవత్తు। గొలువంగనగరులోపలప్రవేశించె॥ పరివారజనము
లనుబంధుకోటులనెల్ల। పురవీధిలోనిల్పిపరనాయకుండు॥ తనపుత్రపౌ
త్రులనుతమ్ములనుజానకియు। తనవెంటజనుదేరదశరథాత్మజుడు॥ అంతః
పురంబులోకరిగికౌసల్యాది। మొదలైనతల్లులకుమ్రొక్కులొనరించె॥ వ
తితోనుతామ్రొక్కెభామసీతాదేవి। వెలదులందరికపుడువేడ్కరంజిల్ల॥
తనపుత్రపౌత్రులునుతమ్ములునుయావత్తు। తనరీతిమ్రొక్కిరాతల్లులందరి
కి॥ సీతామహాదేవిసేయుమహిమంతయును। తనతల్లులకుజెప్పెదాశరథి
యపుడు॥ తల్లులందరుమహాయుల్లాసమందుచును। ముదితలందరుబట్టి
ముద్దుగొనియిరిగ॥ ముద్దాడిపలుమారుమోమునమోమునజేర్చి। కడుగా
రవింపుచునుకాంతలిట్లనిరి॥

## అంతఃపురస్త్రీలు సీతను కొనియాడుట.



ఓతల్లి జానకీఓలోకమాతనీ । వేలాగుశతకంఠు కెదురొనర్చితివి॥ హనుమంతుభుజములందమరితివినీవెట్లు । బలుచాపమేరీతిబట్టిబూనితివి॥ పటుదురార్భటివృత్తికెటునీవునిల్చితివి । నారిఠాంకృతులెట్లుబోరుకొల్పితివి॥ దివ్యస్వరూపమున తేజరిల్లితివెట్లు । కోపానలస్ఫూర్తిగొనియుంటివెట్లు॥ పలుదివ్యశరవృష్టిబరపితివినీవెట్లు। సింహధ్వనులుమీరిచెలగితివియెట్లు ॥ ఎట్లునిల్చితివినీవీవిక్రమస్ఫూర్తి । ఆశ్చర్యకరమాయెనఖిలజగములకు ॥ సాటివారలుమెత్సశతముఖునిదునుమాడి । వలనొప్పనీపతికివ

న్నెదెచ్చితివి ॥ మునివరులకభయమిచ్చినమాటనీపతికి । దక్కజేసితివి మాతల్లిరోనీవు॥ ఇంతులెక్కడనైననేకాలమందైన। దనుజకోటులదర్పం పథరలోనుగలరా॥ వెలసిదనుజులదర్పంపవిపరీతవాక్యంబు। గలుగజేసితి వియీకాలమునసీవు॥ నీకీర్తిలోకములనివ్వటిలియుండుటకు । శతకంఠ రునిబట్టిసంహరించితివి॥ నీవంటియిల్లాలునీవంటిగుణశీల । పదినాల్గులో కముల వెదకినాగలర॥ వసుధలోపలుమారువాడికలురంజిల్లె। చాలకీర్తు లువెలసెనఖియనీవలన॥ నీవాదిశక్తివినీవాదిలక్ష్మివి। మూడుమూర్తు లజగన్మాలంబునీవు॥ ఎల్లలోకంబులునుయెల్లబ్రహ్మాండములు। నీవల్లజ నియించునీవల్లనణగు॥ నిన్నెఱిగలేకనీమాయగనలేక । నిన్నుభా వించెదమునెలతచందమున॥ మావంశములకెల్లపావనంబులుగల్గు। నవ తారమెత్తినావశివమాతల్లి॥ అనివేయితెరగులనాదేవులందరునుసన్ను తులుజేసిరాజానకీసతిని॥ సీతనచ్చటవిడచిశ్రీరామచంద్రుండు । తమ్ములు పుత్రులునుతనవెంటగొలువ ॥ అఖిలభూసురగణము లాశీర్వదింపంగ। సూతమాగధులెల్లస్తుతులుజేయగను ॥ మంగళపాఠకసంగీతములువెల య। పంచమహావాద్యములుమించిమ్రోయగను॥ అత్యనర్గళసంభ్రమా యత్తచిత్తులై । కనకసింహాసనంబునదేజరిల్లె ॥ కరుణాకటాక్షంబుకడుదీ నులందునన్। పరమతాత్పర్యంబుబ్రాహ్మణులయందు ॥ శౌర్యంబుకఠినం బుశత్రుకోటులయందు। జెలగశ్రీరాముండుజగతిపాలించె॥ రసికులానం దింపపసగాడసన్యాసి। యనువాడసీపాటనెలమిగూర్చితిని ॥ వెలయంగ సీపాటవిన్నవారలకబ్బు। సంపదలుసౌఖ్యములుసకలభాగ్యములు॥ *

శతకంఠరామా[illegible]

సంపూ[illegible]ము.



